

మాతృస్వరూపిణి మహాగాయత్రిదేవి
సుబుద్ధి- మోక్ష జ్ఞాన ప్రదాత
అష్టైశ్వర్యదాయి, కలిప్రభావ దోష నివారిణి

84వ పేజీ చూడండి.

# అర్ధనారీశ్వరాష్టకం

అంభోధరశ్యామలకుంతలాయై। తటిత్ప్రభాతామ్రజటాధరాయ ।
నిరీశ్వరాయై నిఖిలేశ్వరాయ । నమశ్శివాయైచనమశ్శివాయ॥ 1

ప్రదీప్తరత్నోజ్జ్వలకుండలాయై । స్ఫురన్మహాపన్నగభూషణాయ
శివప్రియాయైచ శివప్రియాయ । నమశ్శివాయైచనమశ్శివాయ॥ 2

మందారమాలాకలితాలకాయై కపాలమాలాంకిత కంధరాయ
దివ్యాంబరాయైచదిగంబరాయ।నమశ్శివాయైచనమశ్శివాయ ॥ 3

కస్తూరికుంకుమలేపనాయై । స్మశానభస్మాంగవిలేపనాయ
కృతస్మరాయైవికృతస్మరాయ । నమశ్శివాయైచనమశ్శివాయ 4

పాదారవిందార్పితహంసకాయై । పదాబ్జరాజత్ఫణినూపురాయ
కళామయాయై వికలాయమాయ। నమశ్శివాయైచనమశ్శివాయ॥ 5

ప్రపంచసృష్ట్యున్ముఖలాస్యకాయై । సమస్తసంహారక తాండవాయ
సమేక్షణాయై విషమేక్షణాయ । నమశ్శివాయైచ నమశ్శివాయ॥ 6

ప్రఫుల్లనీలోత్పలలోచనాయై । వికాసపంకేరుహలోచనాయ
జగజ్జనన్యై జగదేకపిత్రే । నమశ్శివాయైచ నమశ్శివాయ ॥ 7

అంతర్బహిశ్చోర్ధ్వమధశ్చమధ్యే।పురశ్చపశ్చాచ్చవిదిక్షుదిక్షు
సర్వంగతాయైసకలంగతాయ। నమశ్శివాయైచనమశ్శివాయ॥ 8

ఉపమన్యుకృతం స్తోత్రం । అర్ధనారీశ్వరాహ్వయం
యః పఠేచ్ఛృణుయాద్వాపి । శివలోకే మహీయతే ॥

ఇతి శ్రీఉపమన్యువిరచితం అర్ధనారీశ్వరాష్టకం సంపూర్ణం.



బాలసుబ్రహ్మణ్య సహిత పార్వతి శక్తీశ్వరులు- కృత్తివర్త
యనమదుర్రు, భీమవరం తాలూకా

xix పేజీ చూడండి.



ముదిగొండ శంకరాధ్యులు

శైవమతోద్ధారకులు

ప్రథమశైవ మహాపీఠాధిపతి



శివయోగి ముడిగొండ నాగలింగారాధ్యులు

శైవమహాపీఠాధిపతులు, నీలకంఠ భాష్యవ్యాఖ్యానకర్త

సంస్కృత తెలుగు శైవవాఙ్మయ కర్త

షట్కాల మహాశివపూజా ధురంధరులు



ఆగమశాస్త్ర కోవిదులు మౌనమంత్రమూర్తులు
భూతపూర్వ శైవమహాపీఠాధిపతులు
(గ్రంధకర్త పితామహులు)
ముదిగొండ పాపయ్యశాస్త్రి



ముదిగొండ వీరేశలింగశాస్త్రి

శైవవాఙ్మయ నిర్మాతలు శతాధిక గ్రంధ పరిష్కర్త

విశ్వేశ్వర సంస్కృతాంధ్ర ప్రధానోపాధ్యాయులు

గ్రంథకర్త పితృదేవులు, ప్రథమ గురువులు



ఇవటూరి సానందారాధ్యులు
నిత్య శివారాధకులు, శైవమత ప్రచారకులు
నిరాడంబర జీవులు, నిష్కపటి
అంత్యేష్టిగ్రంథ సంకలనకర్త



ముదిగొండ రామలింగశాస్త్రి
శైవమత ప్రచారకులు
అనుభవ ఆయుర్వేద వైద్యనిపుణులు
సాహితీవేత్త, గ్రంధకర్త, నిత్య శివారాధకులు,
గ్రంధకర్తకు జీవన ప్రభాత రెండవ గురువులు

శివపూజా వివేచనము-I

# అభిప్రాయ వేదిక

## శివపూజా వివేచనము (Part - I)

### అను

### ఆరడుగుల బాటయే చిత్తశాంతికి ఏకైకబాట

భక్తి, జ్ఞాన, హఠ, రాజ, లయయోగ, షట్చక్రాల, షట్స్థల, సహస్రాది, సప్తకమల, అష్టావరణ, దశావధాన, బాహ్యాభ్యంతర శివపూజ, గోదాన, సోమవారవ్రత, గంగాపార్వతీ సమేత అగస్త్యేశ్వర భక్తస్తవయుత నామసంకీర్తనాది ముఖ్యాంశయుత ఆధ్యాత్మిక బాలశిక్ష.

కామ క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్టంతి తస్కరాః,
జ్ఞాన రత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రత॥

జన్మదుఃఖం జరాదుఃఖం జాయా దుఃఖం పునః పునః,
సంసార సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత జాగ్రత॥

మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధు సహోదరాః,
అర్థం నాస్తి గృహం నాస్తి తస్మాత్ జాగ్రత జాగ్రత॥

సాధ్యపడదు ఎంత సామంతుడైనను
సత్యశాంత సమర సాత్ముడైతె,
మోహమొందునయ్య మోహకాంత.
అఖిల జీవసంగ ఆత్మలింగ ॥

తామసంబు విడక, తత్వంబు గనరాదు,
రాజసంబు విడక రాదుముక్తి ।

సాత్మికంబు మోక్ష సాధనమైయుండు,
అఖిల జీవసంగ ఆత్మలింగ ॥

కుక్కవంటి మనసు కుదురుగా జేసియు,.
నిటలమందు దృష్టి నిలిపెనేని।
పటుతరైక బ్రహ్మజ్ఞానంబు కల్గును,
అఖిల జీవసంగ ఆత్మలింగ ॥

భువిని గోరువారు బుగ్గి అయిపోయిరి,.
ధనము గోరువారు దగ్ధమైరి ।
నిన్నుగోరువారు నిత్యులై నిలచిరి,.
పాపభయవిభంగ భావలింగ ॥

# పాంచజన్యం

స్వామి సుందర చైతన్యానంద

నిద్రించినది చాలు....మేలుకో. మగతను వీడు
....మమతయే కీడు.

అహంకార వత్తి ఆరిపోనీ. ఆత్మజ్యోతి వెలగనీ.
కాంతి నీలోనే ఉంది. సుఖము నీదై ఉంది.
విలువైన బ్రతుకును వృధా చేసుకోకు.
నవ్వుతూ జీవించు. జీవిస్తూ ఆనందించు.
భేద భావాలు కదలనీయకు. ప్రేమను వదలి పెట్టకు.
ప్రపంచములో చీకటి ఉందని వగవకు.
నీ చుట్టూ కాంతి వలయముంది. నీ బ్రతుకు కాంతి
నిలయమవుతుంది.

పరమాత్మను విశ్వసించు వారికి కొంతలేదు. వెలితిరాదు.
ఇది నా అనుభవము. మీరూ పొందండి.

శ్రీః

శ్రీ మేధా దక్షిణామూర్తయేనమః

# తొలి పలుకు

## శివపూజా వివేచనము

వేదశాస్త్రములకు పుట్టినిల్లయిన మన భారతదేశములో చతుర్విధ పురుషార్థసాధన ధర్మబద్ధముగా సాధించాలని ప్రబోధింపబడింది. బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసములనే నాలుగు ఆశ్రమ ధర్మాలు, వాని విశిష్టత, వైరాగ్యసంపత్తికి, మోక్ష ప్రాప్తకు అవి, ఎంత అవశ్యములో వివరించినదే మన భారతీ సంప్రదాయము.

మానవులకు పశు పక్ష్యాదులకు నిద్ర, భయము, సంతానోత్పత్తి సమానమే అయినా, మానవునకు పరమేశ్వరుడు బుద్ధి జ్ఞాన విశేషాలను ప్రసాదించాడు. అందుచేతనే మానవజన్మ ఉత్తమమైనది. అందునా షట్కర్మనియతి, ఆత్మానాత్మ వివేచనా జ్ఞాన సంపత్తి గల బ్రాహ్మణ జన్మ ధన్యతమమైనదిగా భావింపబడింది.

నిశ్చల జ్ఞాన వైరాగ్య సాధనకు సద్గురు కటాక్షము ముఖ్యము- సద్గురువు లక్షణములు.

సుందరః సుముఖః స్వచ్ఛః శుచిశ్చ బహు తంత్రవిత్ ।
అసంశయః సంశయ చ్ఛిన్నిరపేక్షో గురుర్మతః ॥

శిష్య లక్షణములు -

చతుర్భిరాద్యైః సంయుక్తః శ్రద్ధావాన్ సుస్థిరాశయః ।
ఆస్తికో పృథ భక్తిశ్చ గురౌ మంత్రేచ దేవతే ।
ఏవం విధో భవేచ్ఛిష్యః ఇతరో వ్యాధికృద్గురోః ॥

ఇంకనూ -

సదాచార రతో ధీమాన్ సత్యవాదీ జితేంద్రియః
సుశాంత మనసో విప్రో మంత్రయోగేతు సాధకః ॥
"నక్రోధో నచ మాత్సర్యం నలోభో నాఽశుభామతిః ॥

అని శ్రుతి వాక్యము.

జ్ఞానార్జన యందాసక్తిగల మానవుడు సత్కర్మాచరణ ద్వారా నిశ్చల జ్ఞాన సాధన, తద్వారా మోక్షార్హత పొందగలడు. "సత్వాత్సం జాయతే జ్ఞానమ్" అనుటచేత సత్త్వగుణాభివృద్ధికి నిర్దిష్టమైన ఆహార నియమాలు పాటించడమేగాకుండా, తామస గుణజనకములైన ఆహార విహారాలు విసర్జింపవలసి యున్నది. అట్టి జ్ఞాన సిద్ధికి తోడ్పడే మరొక సాధనా విశేషమే బ్రహ్మశ్రీ ముదిగొండ శంకరశాస్త్రి గారి "శివపూజా వివేచనము".

"నాఽరుద్రో రుద్రమర్చయేత్" అని శ్రుతి. స్వయముగా శివ పూజా దురంధురులైన శ్రీ శాస్త్రిగారి ఈ గ్రంథము వారి ఉత్తమ జ్ఞాన స్థితికి తార్కాణము. ఈ పుస్తకములో వారు మానవజన్మ విశిష్టత, శివారాధన ప్రశస్తి, పురుషార్థ సాధనా సంపత్తి, స్థల విశేషములు, షట్త్రింశత్తత్త్వోపచారములు, అష్టావరణములు, మంత్రోపాసన, సద్యోజాతాది పంచబ్రహ్మమంత్ర విశిష్టత, నాడిమండలము, అష్టాంగ

పరిచయము, గాయత్రీ మంత్రానుష్ఠానావశ్యకత. ఇత్యాది వస్తు విచారణ చేసారు. స్వయముగా ధన్వంతరులైన వీరు తమ వైదిక విజ్ఞానానికి ఆయుర్వేద శాస్త్రజ్ఞానాన్ని జోడించి, మన శరీరములో షట్చక్రముల ఉనికి, నాడీమండలము, ప్రాణాయామము, నాదోత్పత్తి, మంత్రానుష్ఠానము ద్వారా సహస్రారగతమైన పరమాత్మను చూడ గలందులకు యమ నియమాది నిత్యానుష్ఠాన మార్గవిశేషాలను విపులీకరించిన విధానము చాల సంతృప్తికరముగా నున్నది.

నిశ్చల జ్ఞాన సాధనకు సద్గురు ముఖతః ప్రాప్తమైన మంత్రానుష్ఠానము అవశ్యకము. "పద, బీజ, సంఖ్యా రేఖాత్మకమ్ మంత్రమ్" "మననాత్ త్రాయత ఇతి మంత్రమ్" అని మంత్రలక్షణము - జీవ బ్రహ్మైక్యాను సంధికి ఇది సోపానము.

ఈనాడు సద్గురు ప్రాముఖ్యత విస్మరించినందు వల్లనే ప్రజలలో స్వార్థచింతన, ప్రాపంచిక సుఖాలపై అమిత మమకారము, స్వధర్మ విస్మృతి ప్రబలిపోయింది. దయా ధర్మగుణాలు నశించి, గురు, వృద్ధ మాతాపితరుల సేవనకు విముఖులై స్వార్థచిత్తులై అయోమయ స్థితిలో వున్నారు. ఈ మిశ్రమ ధర్మానుష్ఠానపరుల హీనస్థితి వల్ల నేడు విస్తృతి జెందిన అశాంతి శ్రీ శాస్త్రిగారి హృదయాంతరాళాలను కదలించి వారి "శివపూజా వివేచన" ప్రాదుర్భావానికి కారణమైనది.

శ్రీ శాస్త్రిగారు పరమ విశిష్టమైన శివ పూజా ప్రాశస్త్యాన్ని వక్కాణిస్తూ భారతీ సంప్రదాయానుయాయులమైన మనము మానవత్వాన్ని మన కనీసధర్మాన్ని విస్మరించి, అన్ని పదార్థాలపై వ్రాలే ఈగలాగ, గాలికి కొట్టుకొని పోయి చిరిగిపోయే పులివిస్తరాకులాగా కాకుండా, దుర్లభమైన మానవ జీవితాన్ని సార్థకత చేసికొనేందుకై

పాటుపడాలి అన్నారు. అది దుష్కర్మనాశకము, చిత్తశాంతిప్రదాత అయిన నిత్య శివపూజా సంసేవనము అన్నపేరి ప్రబోధ ఋషిప్రోక్త మార్గమైయున్నది.

"సత్సంగత్వే నిస్సంగత్వం" అన్న శ్రీ శంకర భగవత్పాదుల వాక్యము వల్ల జ్ఞానదృష్టిగల శ్రీ శాస్త్రిగారి వంటి వారి ద్వారా ఈ మిశ్రమ ధర్మానుష్ఠానపరులు అజ్ఞానాంధకారం నుండి బయట పడి శివ పూజాచరణ వల్ల కలిగే శుభఫలితా లనుభవించగలరు. భారతీ సంప్రదాయ విశిష్టత శ్రీ శాస్త్రిగారి "శివపూజా వివేచన" ద్వారా పునరుజ్జీవితము కాగలదు. ఈ గ్రంథము సర్వులూ చదివి ధర్మవర్తనులు కావలెనని మా ఆకాంక్ష.

భాగ్యనగరము
శ్రీముఖజ్యేష్ఠ బహుళ తదియ.

శ్రీ గోపానందనాథులు
ప్రచారకులు
శ్రీ చండీ నవశతి మంత్రమాల

# నివేదనము

"వాచోవేగం, మనసః, క్రోధవేగం,

జిహ్వావేగముదరోపస్థ వేగం

ఏతాన్ వేగాన్ యోవిషహోత ధీరః

సర్వామపీమాం పృథివీం సశిష్యాత్."

వాక్కును నిగ్రహించుట, మనస్సును నిగ్రహించుట, క్రోధమును నిగ్రహించుట, జిహ్వాచాపల్యము తగ్గించుకొనుట, కామావేశము, కుక్షింభరత్వము అనువానిని విడువట కలిగిన ధీరుడు, యావత్ ప్రపంచమునకు గురువు కాగలడు. స్వధర్మ నిర్వహణకు అలాంటి గురువు, పరిస్థితులు అలభ్యమైనపుడు, సకల శంకలను బాపి, ఈ జీవాత్మను పరమాత్మ వద్దకు చేర్చే పరమసాధనాన్ని మనం పొందగలగాలి. ఈ "శివపూజా వివేచనము" అటువంటి అమూల్యసాధన అని నా భావన.

అఘోర నామధేయుడైన శివుడు పితృమూర్తి సదాశివమూర్తి అని వివరిస్తున్నది దుర్వాసోపనిషత్తు. సదాశివుడు నిర్గుణస్వరూపుడు. నిర్గుణస్వరూపుడు పంచకృత్య పరాయణుడు. (సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహము). నిత్యం ఉదయం ఆ పరమశివుని మంత్రయుక్తంగా పూజించే సాధకుడు చరరూపంలోవున్న సదాశివుడే అవుతున్నాడు. నిండు మనస్సుతో తన హృదయకమలంలో, పరమేశ్వరుని ప్రతిష్ఠించి, ప్రవచితమార్గాన అర్చించే అర్చకమూర్తి

సాక్షాత్తు హరమూర్తియే కౌశిక, కాశ్యప, భరద్వాజ, గౌతమ, అగస్త్యాది ఐదుగురు అలాంటి సాక్షాత్తు హరమూర్తులే.

శివదీక్షా తత్పరులై, భస్మరుద్రాక్షధారులై, పంచాక్షరీ జపాశక్తులై, అంబికాప్రియుడైన సదాశివుని అర్ధమెరిగి, అంగాంగాలను ఆత్మను, శివమయం చేసుకుని, మనం చేసే శివపూజ మనకు నిత్యం జీవనంలో ఆహ్లాదాన్ని, మంగళత్వాన్ని ప్రసాదిస్తుంది. షట్కాలము లందుకాని, త్రికాలములందుకాని, కనీసం బ్రహ్మముహూర్తంలో కాని ప్రదోషకాలంలోగాని ఏ జీవాత్మ శివార్చన చేస్తుందో అది పరమాత్మకు సన్నిహిత మవుతుందని ఉపనిషత్తు ఉవాచ.

నాలుగు విధములైన శివపూజాయోగములు, సాధకునికి కావలసిన సాధనాలు, పరమశివుని కలాతత్వములు వాటిఅధిదేవతలు, ఇందులో ప్రస్తావించబడ్డాయి. క్రమవికాసానికి కారణమైన షట్చక్రాల స్థితి గమనాలను, మానవశరీర నాడీమండల స్థితిగతులను అన్వయించి, చరాత్మకమైన ఈ శరీరంలో అలవడగు పరమేశ్వరుని అష్టమూర్తులను ఆవిష్కరించారాయన ఈ పుటలమధ్య.

బహుశః గౌతమీతటి సాక్షాత్తు శివుని సన్నిధినుండి జాలు వారిన మందాకిని కావటం కారణం కావచ్చు అట్టి గోదావరీ పుష్కర కాలంలో ఎనమదుర్రు క్షేత్రమూర్తి పార్వతీసహిత శక్తీశ్వరునికి ఈ సంకలనాన్ని సమర్పించి అఖిలాశంకరశాస్త్రిగారలు ధన్యులయ్యారు.

సకలచరాచర ప్రపంచంలో పరమాణువునుండి బ్రహ్మాండం దాక, సూక్ష్మరూపంలో, లయాత్మకమైన శక్తిగా ఈశ్వరతత్వముంటుంది. అట్టి సదాశివుని షట్స్థలములు, షట్ త్రింశత్ తత్వ మానసిక పూజ, లింగాష్టకాదులతో అలంకృతమైన సమగ్ర, అర్ధయుక్త శివ

విధి ముఖ్యాంశ వివరణములు ఇందు చిత్రీకరించబడినవి. శ్రీమద్ శంకరాచార్యాది ఆర్యోక్తులు కూడా సందర్భోచితంగా ప్రస్తావించబడ్డాయి.

మానవశరీరము శివార్చనకు అర్హమైన ఆరోగ్యవంతమైన లక్షణాలు, ఆయుర్వేదశాస్త్రాన్ని అనుసంధించి మనముందు ఆవిష్కరింపజేశారు. షట్చక్రాదులు చిత్రాత్మకంగా వివరించబడ్డవి. స్థూలంగా, శివసాధనకు కావలసిన వివరణాత్మక సాధన సంపత్తి ఈ "శివ పూజా వివేచనము".

నిష్ఠతో కూడిన ఈ సంకలనం సమృద్ధియైన శివోపాసనా సంపత్తి కావాలని నిండుగా ఆకాంక్షిస్తూ !

ఆచంద్రార్కమైన కీర్తిని, ఆయువును ఆ శాస్త్రిగారి కుటుంబమునకు అనుగ్రహించమని ఆ పరమేశ్వరుని అర్థిస్తూ !

ఇవటూరి రామకృష్ణ

# కృతజ్ఞతలు

ప్రప్రథమముగ శివసాయుజ్యము చెందిన, ఇహ జన్మ మాతా పితరులు ప్రథమగురువులు ముదిగొండ రాజరాజేశ్వరమ్మ వీరేశలింగ శాస్త్రిగారలకు, మౌనమంత్రమూర్తులు మా పితామహులు ముదిగొండ పాపమ్మ, పాపయ్యశాస్త్రిగారలకు, నాకు ఆయుర్వేద చికిత్సచేసి ప్రాణదానమిచ్చిన ద్వితీయ గురుమూర్తులు, మా పినతండ్రి రామ లింగశాస్త్రిగారికి వారి ధర్మపత్ని దుర్గాంబగారికి, మాకు పిన్నవయస్సు నందే కలిగిన మాతృలోపమును మరిపిస్తూ మమ్ములను ఆడించి, ఓదార్చిన మా రెండవ పినతండ్రి కోటి మల్లికార్జున్‌గారు వారి ధర్మ పత్ని భూషమ్మగారికి తన గోటిముద్దలతో మమ్ము మరపించి, ఆల రించిన మా మేనత్త శ్రీ॥ పం॥ దుర్గాంబ, మల్లికార్జున అయ్యవార్లం గారలకు తన ఆర్ద్ర కరుణాపూరిత హృదయస్పందనచే జీవనస్రవం తిలో కలవరపడుతున్న నాకు ధైర్యమునిచ్చి ప్రోత్సాహపరచిన తాడికొండ అగస్త్యేశ్వరమ్మ పూర్ణానందం దంపతులకు నాలో ఆయు ర్వేదశాస్త్ర జిజ్ఞాసకలిగించి, వైద్యునిగా మార్చిన ములుగు అన్న పూర్ణమ్మ, విశ్వేశ్వరశాస్త్రి దంపతులకు శ్రీ ముదిగొండ చినవీర భద్రయ్యగారికి, నాలో దుర్గోపాసనాసక్తి కలిగించిన ములుగు పార్వతమ్మ శ్రీ॥పం॥ వీరభద్రయ్యగారికి నాలో శివజ్ఞాన జిజ్ఞాస కలిగించిన విభూతి మాహాత్యమును చాటిన శ్రీ॥పం(విభూతి)కోటయ్య గారికి, తమ శివభజనకీర్తనలద్వారా నాలో భక్తిని పెంచిన తాడికొండ మల్లికార్జునం అయ్యవారి దంపతులకు షడక్షరీమంత్ర ప్రాశస్త్యమును బోధించిన శ్రీ॥పం॥ కోటిలింగంగారికి తాము నిత్యం అర్ధరాత్రిశివ

పూజ నాచరిస్తూ, దాని విశేషములతో నాలో స్పందన కలిగించిన మా మేనమామ అన్నదేవర రాజశేఖరయ్య దంపతులకు, నన్ను తన వ్యక్తిత్వంతో ఆకర్షించిన మా అత్తగారు కాశీనాధుని అన్నపూర్ణమ్మ గారికి నా కృతజ్ఞతాపూర్వక సుమాంజలి ఘటించుచున్నాను.

నా మలిజీవన విధాతలు మాఅన్నగారు ముదిగొండ సిద్ధవీరరాజ లింగం దంపతులకు, మా అమ్మగారు ఆదిశేషమ్మగారికి, పిన్నిగారు హనుమాయమ్మగారికి, నాలోని మాతృత్వ ఆర్తిని, తన మృదుల భాషణలతో ఓదార్చి నన్ను కార్యోన్ముఖునిగా చేసిన ఇవటూరి రాఘవమ్మగారికి, ప్రణామములు. నన్ను ప్రతిక్షణం ప్రోత్సాహిస్తూ అట్లాగే తన సునిశిత విమర్శలతో చెక్ చేస్తూ రాత్రింబవళ్ళు నా ఆరోగ్యవిషయంలో ప్రత్యేకశ్రద్ధవహిస్తూ, లౌకిక వ్యవహారములను పరిష్కరించు కొంటూ వచ్చిన నా ఇహజన్మ అర్ధాంగి చి॥సౌ॥ అఖిలకు చి॥ మంజు, మంగళ, మహేశ్ లకు నా హృదయపూర్వక శుభాసీస్సులు.

ఈ సంకలన రచనయందు విషయముల పర్యవేక్షణ చేస్తూ తొలిపలుకులు వ్రాసి ఇచ్చిన వయోవృద్ధులు, శైవమహాపీఠాధిపతులు అయిన శివశ్రీ నిర్మలశంకరశాస్త్రి గారికి, వయోవృద్ధులు, ఆగమ శాస్త్ర విశారదులు, శైవపండితమండలి సభ్యులు అయిన మల్లంపల్లి జ్వాలావీరభద్ర శాస్త్రిగారికి నా రచనను అప్పుడప్పుడు పరిశీలిస్తూ తగు ప్రోత్సాహ మొసగినట్టియు, వయోవృద్ధులు అయిన కాశీనాధుని పూర్ణ మల్లిఖార్జునుడు మామగారికి, నేను అనర్హుడినైననూ, అర్ధవంతగా శివపూజా వివేచనమును అందించు మానవాళికి అని నన్ను ప్రోత్సాహపరచిన, ఇవటూరి శకుంతల రామకృష్ణ దంపతులకు, రాదిగడప మార్కండేశ్వరరావు దంపతులకు, శివపూజయందు క్రమ శిక్షణ ప్రాధాన్యతను నిత్య ఆచరణద్వారా నాలో స్పందనం

కల్గించిన ములుగు జాలమ్మ, సుబ్రహ్మణ్యం దంపతులకు, పాక్షిక ధన సహాయంచేసి శివపూజా వివేచనము - అచ్చు అగుటకు దోహదకారి అయిన ములుగు హనుమంతరావు దంపతులకు, మా నిత్య శివపూజయందు నాగాలేకుండా బిల్వార్చనకు కావలసిన బిల్వములను ప్రేమతో సమకూర్చిన ముదిగొండ లింగయ్యశాస్త్రి దంపతులకు, ఈ పుస్తకము బాలసుబ్రహ్మణ్య సహిత, పార్వతీశ్వరులకు కృతిసమర్పణము చేయుటకు ముఖ్యకారకులైన చాగంటి శివరావు దంపతులకు. తమవద్దనున్న శైవగ్రంథములను విషయసేకరణకై నాకు ఇచ్చి సహాయపడిన బంధుమిత్రకోటికి తమ రచనల ద్వారా ఉపన్యాసములద్వారా గ్రంథరచనయందు సహాయబడిన ఆవసాయుజ్యం పొందిన ముదిగొండ చినకోటయ్యశాస్త్రిగారికి, ఇవటూరి సోమనందారాధ్యుల వారికి ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారి కుటుంబమునకు, కీ॥శే॥ కోడిమేల రాజలింగారాధ్యులవారి కుటుంబ సభ్యులకు శైవగణార్చనా పాశస్త్యాన్ని, జీవితాంతము ప్రతి సంవత్సరము గణార్చన నాచరించుచు శైవజ్ఞానవ్యాప్తికి దోహదకారియైన శ్రీ॥సా॥ముదిగొండ చండికాంబ మల్లనారాధ్యులవారికి బహుముఖ వత్తిడులున్ననూ, ఈ పుస్తకమును తమ శివాజీప్రెస్‌నందు అచ్చు అగుటకు సహకరించిన శ్రీయుతులు నాగేంద్రన్, వారి కార్యకర్తలకు మౌన మంత్రమూర్తులు నవశతి ప్రచారకులైన శ్రీ గోపానంద సిద్ధులుగారు నా పుస్తక తుదిదశలో పరిచయులై తొలిపలుకు వ్రాసి నన్ను ఆశీర్వదించినందులకెంతయో కృతజ్ఞుడను. ఈ పుస్తక పరిశీలన ముద్రణయందు సహాయపడిన ప్రియమిత్రులు పి. రాఘవరావుకు ఆశీస్సులు. నాకు వైదికాచార మార్గదర్శులైన ముదిగొండ నందయ్యబాబాయిగారికి నునమస్సుమాంజలులు. అఖరిన, ఈ పుస్తకసంకలనమున సహాయపడిన ఎందరో మహానుభావులు అందరికీ నా వందనములు.

ముదిగొండ శంకరశాస్త్రి

# సంకలనకర్త వంశవృక్షము



(ii)


మనుమారాధ్యులు
మల్లికార్జునారాధ్యులు
భోగమహేశ్వరారాధ్యులు
చంద్రశేఖరారాధ్యులు
మనుమారాధ్యులు
అయ్యవారు
శంకరారాధ్యులు
మల్లనారాధ్యులు
మనుమారాధ్యులు
కొండయారాధ్యులు
పర్వతారాధ్యులు
శరభారాధ్యులు
భద్రయారాధ్యులు
శ్రీశైలపతి
మల్లయ్య
చంద్రయ్య


వీరమల్లయ్య
శ్రీ గిరిలింగం
మనుమయ్య
మంత్రయ్య
వీరయ్య
పాపయ్య
పాపయ్య
వీరేశలింగం దత్తువచ్చాడు
మల్లయ్య
పాపయ్యశాస్త్రి దత్తువచ్చాడు
వీరేశలింగ శాస్త్రి
రామలింగశాస్త్రి
కోటి మల్లికార్జునుడు—జ్వాలాపతి లింగం
సిద్ధవీర రాజలింగం
శంకరశాస్త్రి
విశ్వేశ్వరరావు-చంద్రశేఖర్-శంభుప్రసాద్-భవానీ శంకర్
వీరేశలింగ మహేష్‌కుమార్
జీవన్ కుమార్
శరత్‌కుమార్
నాగరాజు

# కృతిసమర్పణ

## శ్రీ పార్వతీశక్తీశ్వరాలయ ప్రాశస్త్యము

1. పశ్చిమగోదావరిజిల్లా భీమవరం మండలంలో భీమవరానికి 4 కిలోమీటర్ల దూరంలో (యమపురం) యనమదురు అనే గ్రామమున్నది. అచ్చట అతి పురాణమైన శక్తీశ్వరాలయం ఉన్నది.

స్థలపురాణం : లోకకంటకుడైన శంబాసురుడనే రాక్షసుడ్ని సంహరించటానికి యమధర్మరాజు వెళ్ళి ఓడిపోతాడు. అప్పుడు యమధర్మరాజు శక్తిసముపార్జనకై శక్తీశ్వరుని అర్థించుటకు రాగా శక్తీశ్వరుడు యోగనిద్రలో ఉండుటవల్ల పార్వతీదేవి నాశ్రయించి, తగుశక్తిని సమకూర్చుకొని వెళ్ళి శంబాసురుడ్ని సంహరిస్తాడు. అతని కోరికపై ఆదిదంపతులు నిజరూపంలో అచ్చట సకుటుంబంగా వెలిసినట్లు తెలుస్తున్నది. ఇచ్చట (1) శక్తీశ్వరుడు, యోగముద్రలో శీర్షాసనంలో పార్వతీదేవి బాలసుబ్రహ్మణ్య సహితంగా ఒకే పీఠముపై దర్శనమిచ్చుట. (2) ఒకనాగుపాము శక్తీశ్వరకుండలో నిత్యము స్నానమాచరించి శక్తీశ్వరుని చుట్టుకొని ఇటీవలి కాలంవరకు ఉండటం. (3) శక్తీశ్వర కుండంలోని పవిత్ర జలం గంగానది యొక్క అంతర్వాహినీ సంబంధించినదని, అందుజలము నిత్యము నిర్మలముగా, సర్వరోగ నివారంగా పవిత్రంగా ఎల్లకాలము ఉంటున్నదనీ, ప్రశస్తి. (4) ఇచ్చట ఉన్న నందీశ్వరుని ప్రసూతియందు అతి దుఃఖిత అయిన స్త్రీ కదిలించిన, సుఖప్రసూతి కల్గునని లోకోక్తి

(5) శక్తి కుండమును వెదల్పు చేయనిశ్చయించి త్రవ్వుటకు ప్రయత్నింపగా 6 వత్తుగల సుబ్రహ్మణ్యస్వామి వారి శిలాఫలకం దొరకుట దానిని దేవాలయమునందే ప్రతిష్ఠించి పూజలు జరుపుట (6) ఈ యమపురికి దక్షిణ కాశి అని పిలుపబడుట.

ఇట్టి ఆసక్తికరమైన స్థలమును తెలియచేసిన చాగంటి శివరావు గారు, నాచే సంకలనము చేయబడిన శివపూజా వివేచనమును గ్రంథములను పార్వతీ బాలసుబ్రహ్మణ్య సహిత శక్తీశ్వరులకు అంకితమొసరించు మహాభాగ్యమును గోదావరి పుష్కరములలో నాకు కల్పించినారు.

## 2. ఈ మన్యగస్తేశ్వర దేవాలయ ప్రశక్తి

మత్ పితామహ జన్మస్థలమైన ఈమని అనే కుగ్రామం తెనాలి తాలూకాలో ఉన్నది. అచ్చట ఈశ్వరుని లింగము స్వయంభువు కాలక్రమేణ దానిని అగస్త్యమహాముని మంత్రజలముచే ప్రోక్షణచేసి పునీతం చేసినారు. బకింగ్‌హ్యామ్ కాలువ త్రవ్వువరకు ప్రతినిత్యము నిరతము గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరస్వామి సకల పాపహరమగు కృష్ణవేణి జలములచే నిత్యాభిషిక్తుడు. ఈ దేవాలయంలో సూర్య భగవానుని ప్రతిష్టకూడా చేయబడినది.

# మాతృవందనము

ఇహజన్మకారకులు, ప్రత్యక్ష దైవస్వరూపులైన శివసాయుజ్యము చెందిన శ్రీమతి రాజరాజేశ్వరమ్మ వీరేశలింగశాస్త్రిగారలకు నిండు మనసార ప్రథమతః నమస్సుమాంజలులు అర్పిస్తున్నాను.

భూప్రదక్షిణ షట్కేంచ కాశీయాత్రా శతేన చ
గంగాస్నానసహస్రేణ నతుల్యం మాతృవందనమ్.

మా తల్లిదండ్రులు కలిసియున్న ఫోటో ఎంత ప్రయత్నించినను లభ్యముకాలేదు. ఆ ఫోటో కాపీనైన సహృదయులు మాకు అందించువారికి మా కృతజ్ఞతలు తెలుపుకొంటాము. దానికగు ఖర్చులనుగూడ ఇస్తాము.

అశ్రుతర్పణము



జననం 9-2-1921 శివసాయుజ్యం 4-2-1994 శివసాయుజ్యము చెందిన శ్రీమతి రాఘవమ్మగారు అందరికి బంగారమ్మ

గారుగా తెలుసు. నిత్యరామ సంకీర్తనము శివభక్త శివపూజాచరణము మిగిలినకాలంలో ఆధ్యాత్మిక జిజ్ఞాసువులు. ఇవటూరి మల్లికార్జున రావుగారి ధర్మపత్ని చి॥ డా॥ రామకృష్ణగారి మాతృమూర్తి. ఉద్యోగ రీత్యా నేను బెజవాడ వెళ్ళుతున్నప్పుడు వారింట్లో నేనుండుట వల్ల సన్నిహితత్వము ఏర్పడింది వారితో రాను రాను నాకు మాట్లాడుతున్నా భోజనము చేసేటప్పుడు ఏదో నేను చిన్నతనంలో 4వ ఏటనే పోగొట్టుకున్న మాతృమూర్తి స్పందనం కలిగేది. వారిలో కూడా పోగొట్టుకున్న కుమారుడు తిరిగి ఆకస్మాత్తుగా కలిస్తే కలిగే అనుభూతులు కలిగేవి. బహుశా పూర్వజన్మలో నేను పోగొట్టుకున్న మా అమ్మగారు ఈ ఇంటి ఇల్లాలుగా జన్మించారేమో అనిపించేది వారి నిర్మలప్రేమ, మాతృత్వము అభిమానములే వారిని బంగారమ్మగా చేశాయేమో తెలియదు. భవబంధాలవల్ల వారి ఋణం తీర్చుకొనలేక పోయాను. వారు శివసాయుజ్యమూ పొందుటకు 2 నెలలముందు హైదరాబాదులో మా ఇంటికి వచ్చి కుటుంబ సభ్యుల నాశీర్వదించి ఒక చిన్న వ్రాతపతిని నాకిచ్చారు. దానిలో వారి ఆత్మానుభూతి ఈ విధంగా వ్రాసియున్నది.

ఆత్మబావ దాగ, రాముడుండేబాద
రాముడుండె బాగ, రాజయోగి మేడ
ఆ మహామేడలో కుండలిస్థానమున
అఖండ గురుని కరుణ అమరియున్నవాని ॥ఆత్మ॥

వారికి అశ్రుతర్పణ మిడుటకన్న నేను ఏమిచేయగలను? కాయేన, మనసా, వాచా, సర్వేషాం, మాతృప్రేమామృత వర్షిణీ। హేరాఘవీ, గృహాణ ఆర్తి అశ్రుతర్పణం మిదం సు మనసాతుభ్య మర్పితమ్ ॥

# ద్రవ్యదాత పరిచయము

శ్రీమతి జాలమ్మగారు, ములుగు సుబ్రహ్మణ్యంగారి ధర్మపత్ని క్రమశిక్షణతో, బ్రహ్మముహూర్తముననే లేచి స్నానాదుల నాచరించి శివపూజ, హనుమదుపాసన చేసుకోవటంవారి దిన ప్రథమ కార్యక్రమం. వారి వయస్సు 80ఏండ్ల పైబడి ఉంటాయి. నిత్యము సాత్వికాహారమే సేవించుటవల్ల చూపు ఆరోగ్యం వారికి తోడుగా ఉన్నాయి. వారికి 3 కుమారులు ఒక కుమార్తె ఉన్నారు.

వారి శివారాధన ఫలంగా వారి పుత్రుడు ములుగు హనుమంత రావు దంపతులు శ్రీ శివపూజా వివేచనము మొదటిభాగం అచ్చు వేయుటకు ఇచ్చిన ధనసహాయానికి నిండుమనస్సుతో ఆశీర్వదిస్తూ ఆ పార్వతి శక్తీశ్వరులు. వారి ఇష్టదైవము జ్వాలాముఖి అమ్మవారు, వారందరికీ ఆయురారోగ్యాభివృద్ధుల నొసంగవలెనని ప్రార్థిస్తున్నాము.



# ఆశీర్వచనము

Office No. 45201 Cuddapah
Pushpagiri 225 Chennur Exchange
Hyderabad 848799

Namama Veda Mataram
Sri Sri Sri

**Jagadguru Sankaracharya Pushpagiri**
**Mahasamasthanam**

Pushpagiri - 516 166

Office : Mochampet,
Cuddapah - 516 001

Station
Date

శ్రీ శ్రీ శ్రీ జగద్గురు
శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యేత్యాది
సమస్త బిరుదావళీ విరాజమాన
శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు
శ్రీమదభినవోద్దండ శ్రీ విద్యానృసింహ భారతీస్వామి
వారు అస్మదత్యంత ప్రియ శిష్యులు

శ్రీ ముదిగొండ శంకరశాస్త్రి వారికి
ఆశీఃపరంపరాపూర్వకముగా వ్రాయించిపంపు నారాయణ



జగద్గురు శంకరాచార్యులు, పుష్పగిరి
విద్యానృసింహ భారతిస్వామి, వైదికమత ప్రచారకులు
బహుముఖ ప్రజ్ఞాశాలి, నిరాడంబర జీవులు

xxiv పేజీ చూడండి.

# స్మరణ పత్రిక
# అనంతరమ్

తమచేత సంకలితము చేయబడిన "శివపూజావివేచనము" (1, 2 భాగములు) అను గ్రంథమును జూచితిమి. ఇది శివపూజాభిరతులగు సాధకులకును, శివార్చకులకును చక్కని కరదీపిక, శాస్త్రీయ సంప్రదాయాను గుణముగా అర్చన చేయు విధానము నేటి యువజనులలో క్రమక్రమముగా మరుగైపోవుచున్న ఈ రోజులలో ఈ గ్రంథము ట్టివారికుత్తేజమిచ్చి ప్రోత్సాహపరచగలదు. శ్రీ శాస్త్రిగారు సంప్రదాయసిద్ధ శాస్త్రీయ విజ్ఞాన సంపదగలవారు. వారు ఎంతో శ్రమించి సాధకజన హితముగోరి ఇట్టి ఉత్తమ గ్రంథమును సంకలనము చేయుట ముదావహము.

అశాంతితో నెలకొన్న ప్రస్తుత వాతావరణంలో శాంతిని ప్రసాదించే దివ్యఔషధము భగవదర్చనే. అర్చనావిధానం తెలియనిచో భగవదర్చనకు, భగవదనుగ్రహానికి దూరమౌతారు. ఆస్తికులైన భారతీయులకు భగవదారాధన స్వధర్మము. స్వధర్మాచరణీయ భగవదారాధన.

అందుచేత ఇట్టి యుత్తమగ్రంథము నాధారముగ జేసుకొని భగవదారాధన పరులై భగవదనుగ్రహముచే శాంతి సౌఖ్యముల పొంది వర్ధిల్లగలరని ఆశిస్తున్నాము.

ఇతి

నారాయణ స్మృతయః

శ్రీ విద్యానరసింహ భారతీ స్వామినః

**Sri Vidyashankara**



Lord Sree Medha Dakshina Murthyeyy Namaha
Sree Vidyashankara Vidyaranya Malayala
Vijayathe

Sree Pampa Virupaksha Asthadasha Bhuja
Bhuvaneshwari (Akkayamma) Jagadamba
Sree Sreepado Vallabha Sree Narasimha
Saraswathi Lord Dattatreya Namaha
Sree Sree Jagadguru Raja Guru Shankaracharya
Sree Hampi Virupaksha Vidyaranya
MAHA SAMSTHANAM PAMPA KSHETRAM

## Vijayanagara Empire in South India

**Sree Virupaksha Vidyaranya Maha Peetham**

*Hampi Vijayanagara Empire Raja Guru
Parampara Peetham*

(Karnataka, Andhra Pradesh, Maharashtra, Tamil Nadu, Kerala, Goa, Pondicherry. These Seven States Comes under Vijayanagar Empire Jurisdiction.)

# 'SREE SREEMUKHAM'

Sreemathparamhamsa Parivrajakacharya Varya Padavakya Pramana, Paravara Pareena Yamaniyamasana, Pranayama, Pralyahara, Dhyandharma Samadhyastanga Yoganustana, Nistagarista Thapaschakra, Pravarthanadyavichichinna SadguruSree Jagadguru Shankara Bhagavathpadacharya Parampara Praptha. Shaddarshana Sthapanacharya, Vyakhyana, Simhasanadheeshwara, Sakala Vedartha Prakashaka, Sankhyythrayee Prathipalaka, Sakala Nigamagamasara Hrudaya, Vydeeka Marga Pravarthaka, Sarva thanthra Swathanthra Sreemad Vidyanagara (Vijayanagara) Maharajdhani Karnataka Simhasana Prathistapana Charya Varya. Sreemad Rajadhi Raja Guru Bhoomandala Charya Rushyashrunga Puravaradheeshwara, Thungabhadra theera Nivasi Kishkindakhande, Hemakoota Mathanga, Malyavantha, Rushyamooka, Anjana Parvathayor Madhye Nivasathu, Hemakootadi-pathi Sree Pampa Virupaksha Asthadashabhuja Bhuvaneshwari Jagadamba, Jaganmatha Vidyashankara Vidyaranaya Malayala Bramma Parabramma Deva Divya Sree Sreepada Padmaradhaka Jagadguru Shankaracharya Sree Sree H. H. Sachichidananda bhinava Shankara Bharathi Mahaswami Guru Karakamalasanjata.

Sree Sree Jagadguru Shankaracharya H. H. Sreemadabhinavoddananda Narasimha Bharathi Mahaswamibhischa on the Beloved Disciple Sree Dr. M. Shankarashastry Retd. Add Director of Ayurveda (Shanthi Clinic) H. No. 1/2/288/9, Next to Hanuman Temple, Domalaguda, Hyderabad-29.

A.P. We have Seen your Research and Publishing Shivasampradaya Pooja Vidhanam book it Requires Some more valuable points like Shivapuranam. Skandapuranam, Vishweshwara samithi, parthiva Pooja Vidhanam, Kashikandam and Padma puranam also take in these features Research and are happy in Research of work, Hence we Approach to our Samsthanam as a "Religious adviser" and Honour to you with 'Shiva Chintamani" title of Respect through this Sreemukham. It is valid in 7 states of our Jurisdiction.

Please accept and reply to us.

Blessings with Narayanasamaranam.



శ్రీశ్రీ సచ్చిదానంద అభినవ శంకరభారతీ మహాస్వామి
శ్రీశ్రీశ్రీ జగద్గురు శంకరాచార్య
శ్రీవిరూపాష విద్యారణ్య మహాపీఠం హంపి
నిశ్చయ నిర్మల కార్యసాధకులు
శ్రీభువనేశ్వరిదేవి ఉపాసకులు

Lxviiవ పేజీ చూడండి.

## షట్త్రింశత్ తత్త్వోపచార మానసిక, వాచిక శివపూజా

స్థూల శరీర తత్త్వములు - 24

సూక్ష్మ శరీర తత్త్వములు- 11

జీవాత్మ 1

36

పృథివీ, జలము, అగ్ని, వాయువు, ఆవేకము పంచభూతములు

శబ్ద, స్పర్శ, రూప, రసగంధ తన్మాత్రయ- పంచతన్మాత్రలు

శ్రోత్ర, చక్షు, జిహ్వా, ఘ్రాణ, త్వక్, పంచజ్ఞానేంద్రియములు

వాక్, పాణాం, పాద, పాయుఉపస్థ, పంచకర్మేంద్రియములు

మనో, బుద్ధి, అహంకారములు- త్రివిధ అంతరింద్రియములు

24) మూలప్రకృతి, 25) పురుషుడు (జీవాత్మ) 25

ఈ మానవ శరీరము 36 మూలతత్త్వములతో ఏర్పడినది. ప్రతి నిత్యము శివపూజా సమయమున ఈ 36 తత్త్వములను శివార్పణం చేయుటద్వార జీవులు మలరహితులై, కర్పూర శిఖి న్యాయమున సాక్షాత్ పరమశివుడే అవుతారం. రాగిపాత్ర ప్రతిదినం తోమి శుభ్రముచేసినట్లు శరీర శుద్ధి చేయుటద్వారా, భృరురకీటకన్యాయ మున, జీవాత్మ, ఆ పరమశివునియందు జలక్షీర న్యాయమున శివ సాయుజ్యముపొంది, చిదానందరూపుడౌతాడు. ఇదియే శైవ విశిష్టా ద్వైత సిద్ధాంత సారాంశము. ప్రతినిత్యము 3 సార్లుగాని, 6 సార్లు గాని, మానసికముగాగాని, వాచకముగాగాని, పారాయణం చేయుట ద్వారా జీవుడు నిర్మలుడై మనఃశాంతి కల్గి నిర్భయుడై శీఘ్రముగా

తన జీవితకాలములోనే మోక్షమును సాధించగల్గుతాడు. కావలసినవి నిర్మల భక్తి శ్రద్ధలు, కాయ వాక్ మనస్సులు సత్వగుణ యుతము అగుట. ఇది మన ఋషి సాంప్రదాయ సిద్ధ ప్రక్రియ. మీరెందుకు ప్రయత్నించి మనఃశాంతి పొందకూడదు స్త్రీ, పురుష, కుల, మత బేధములేదు. పరమశివుడొక్కడే. నిత్యుడు. చిచ్ఛక్తియుతుడు. కాబట్టి శివపూజ నిత్యము చేయుటద్వారా అయ్యవారికి, అమ్మవారి దేవ, ఋషి గణములందరికీ పూజచేసినట్లే.

## పూజా ప్రారంభం

కాలకృత్యములు తీర్చుకొని సుస్నాతుడై, శుభ్ర వస్త్రధారియై విభూతి రుద్రాక్ష ధరించి, శివ ప్రతిమనుగాని, మట్టిలింగమునుగాని ఇష్టలింగమును వామకరతలమున నిడుకొని పూజసలుపవచ్చును.

కైలాసపతి గొల్వ, కైవల్యమును పొందమానవులకు ।
మనస్సు శాంతినొంద, ఇంతకంటె మందులేదు మహిని ॥
భక్తి జ్ఞాన మోక్షమార్గాలనభవుని నర్పింప నిత్యంబు ॥
(పీఠపూజ చేతగాని, వామకర తలపూజ చేతగాని)
వామకరతల పూజాప్రాశస్త్యము
వామకరతలంబు భగవత్తరంబు
ఆత్మలింగరూపి నభవుని జన్మస్థలంబు ॥
మాతృ, పితృ, సద్గురు రూపి షట్ లింగ శక్తినిలయ
నిత్య షస్థల లింగ పూజచేత సత్వయుతుని ॥

జ్ఞాన పటిముచేత షట్ శక్తి నియామకంబు
నిత్య షడ్స్థల సద్భక్తి లింగపూజచేత శివసాయుజ్య సాధకంబౌ

ధ్యానము

పరమశివు డొక్కడే నిత్యుడు చిచ్ఛక్తియుతుడు
అతిపవిత్రుండు ముప్పదియారు తత్వయుతుడు ॥

నిత్య జీవుని ముప్పదియారు తత్వారణలచేత శివునికి
జీవుడతి పవిత్రుడై పరమశివుని చేరు భ్రమరకీటకన్యాయసరళి
చిదానంద రూపుడౌ జీవుండు క్షీరజలన్యాయ సరళి
నిత్యుడై పరమశివునియందు లీనమగును కర్పూర
శిఖిన్యాయ సరళి ॥

వందే శంభుముమాపతిం సురగురుం వందే జగత్కారణం
వందే పన్నగ భూషణం శశిధరం వందే పశూనాం పతిం ॥

వందే సూర్య శశాంక వహ్నినయనం వందే
ముకుంద ప్రియం
వందే భక్తజనాశ్రయం చ వరదం వందే శివం శంకరం ॥

మృత్యుం జయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే
అమృతేశాయ శర్వాయ మహాదేవాయ తే నమః ॥

గౌరీవల్లభ కామారే కాలకూట విషాశన
మాముద్ధ రాపదాం చోదేత్రి పురఘ్నాంత కాంతక ॥

వాగర్ధా వివసంపృక్తౌ వాగర్థ ప్రతి పత్తయే
జగత పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ॥

సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్ధ సాధకే
శరణ్యే త్రియంబికేదేవి లలితాయై నమోనమః.

ధ్యానం సమర్పయామి.

## 36 తత్వోపచార సమర్పణ విధానము

ఆసన-మనస్తత్వము
షడక్షరీవ మంత్రబంధిత భస్మాసనంబిడుదు సద్యోజాతమూర్తి
మర్కట మనోర్పణంబడినట్లు అది సద్భక్తి అది దంపతులకు

2. ఆహ్వానము-బుద్ధితత్వము
త్రికరణాల ఆ వాహనంబిడుదు గాయత్రీదేవికి.
బుద్ధ్యర్పణం బిడినట్లు మేధా దక్షిణామూర్తి

3. భస్మానులేపనం-పృథివీతత్వము
మలబంధ జీవుని నిర్మల రుద్రమూర్తి సేయు భూతినిడుదు
క్రియాశక్తికి.
పృథివీ తత్వార్పణం బిడినట్లు ఆదార లింగమూర్తి

4. పాద్యస్నానాభిషేకము- జలతత్వము
సుగంధ నిర్మలజలముచే పాద్యాదుల నిడుదు జ్ఞానశక్తికి
జలతత్వార్పణం బడినట్లు సద్భక్తి గురు లింగమూర్తి

5. అర్ఘ్యం- గంధతత్వం
నిండు అంజలుల తర్పణంబిడుదు సూర్యమూర్తికి
గంధతత్వార్పణంబిడినట్లు హిరణ్మయునకు

6. ఆచమనము- రసతత్వము
శరీరాంతరాశాల శోధింప ఆచమనం బిడుదు భవికి
రసతత్వార్పణం బిడినట్లు సద్భక్తి వామ దేవమూర్తి

7. అంగారతాపనము- అగ్నితత్వము
అధిశిక్తరుద్రాణి ఉష్ణతాపనంబిడుదు సద్భక్తి
అగ్నితత్వార్పణం బిడినట్లు తిరువణామలేశు.

8. దూపసంవీజనము- వాయుతత్వము
సుమనోహర దూప సంవీజనం బిడుదు జ్ఞాన ప్రసూనకు
వాయుతత్వార్పణం బిడినట్లు సద్భక్తి శ్రీకాళహస్తీశు

9. వస్త్రము- త్వక్ తత్వము
వస్త్రయుగళమర్పింతు భ్రమరికి సద్భక్తి
త్వక్ తత్వార్పణం బిడినట్లు శ్రీశైల మల్లికార్జుననకు

10. యజ్ఞోపవీతము- విద్యాతత్వము
వాయువును కుంభించి కుండలి నిపై కీర్చిజందెమిడుదు శాంకరికి
విద్యాతత్వార్పణం బిడినట్లు సద్భక్తి వైద్యనాధునకు

11. గంధాక్షతార్పణ-ఘ్రాణతత్వము
దశపుష్టులనీయు సుగంధమర్పింప కామాక్షిదేవికి
ఘ్రాణతత్వార్పణం బిడినట్లు ఏకాంబ్రనాధునకు

iii)

12. ధూపప్రసారణం- ఆకాశతత్వము
దూపప్రసారణంబిడుదు సద్భక్తి వ్యోమకేశికి
ఆకాశతత్వార్పణం బిడినట్లు చిదంబరేశు

13. దీపనీరాజన హారతులు- రూపతత్వము
మహాదేవు దర్శింప దీపనీరాజ హారతులిడుట ఇచ్ఛాశక్తికి
రూపతత్వార్పణం బిడినట్లు శివలింగమూర్తి

14. మాల్యధారణము- రాగతత్వము
(రాగాది వైరిగణరూప) రంగురంగుల పూలమాల నర్పింప సద్భక్తి
మంగళ గౌరికి
రాగతత్వార్పణం బిడినట్లు సద్భక్తి పశుపతి నాధునకు

15. శుభ్రాక్షతలు—కాలతత్వము
జీవజీవేశ రూప ధవళాక్షతలనిడుట ఏకవీరికకు
కాలతత్వార్పణం బిడినట్లు జీవేశ్వరునకు

16. ఆభరణములు— కళాతత్వము
బంగారు సొమ్ముల నలంకరింప సద్భక్తి మహాలక్ష్మికి
కలాతత్వార్పణం బిడినట్లు ఓంకారపతికి

17. పుష్పార్చన- సదాశివతత్వము
ఆత్మచిత్తకళలబోలు పరిమళ పుష్పాల పూజింప చాముండ సద్భక్తి
సదాశివ తత్వార్పణం బిడినట్లు గోకర్ణేశ్వరునకు

బిల్వార్పణ- సదాశివతత్వము
వైరివర్గమణచి మోక్షమిడు బిల్వమును నర్పింప గిరిజకు
సదాశివ తత్వార్పణం బిడినట్లు త్రయంబకేశునకు

18. ఛత్రము- శక్తితత్వము
వానాతపాదుల బారికాపాద సద్భక్తి ఛత్రమిడుట మహంకాళికి
శక్తితత్వార్పణం బడినట్లు మహాకాళేశ్వరునకు

19. చామరము— స్పర్శతత్వము
(దైవోపచారాల) శీతల స్పర్శనిడుట చామరంబు వీచ ఆదిశక్తికి
స్పర్శతత్వార్పణం బిడినట్లు సద్భక్తి చరలింగమునకు

20. తాళవృంతము- నియతితత్వము
కనకదుర్గకు సేదతీర్చ తాళవృంతము వీచ సద్భక్తి
నియతితత్వార్పణం బిడినట్లు కేదారపతికి

21. దర్పణము- చక్షుతత్వము
జీవముల నిర్ధారణ గుణకమౌ దర్పణము చూప మాణిక్యాంబకు
చక్షుతత్వార్పణం బిడినట్లు సద్భక్తి భీమశంకరునకు

22. ఘంటానాదము- శ్రోతోతత్వము
దేవతల బిలువ రాక్షసుల సాగనంప ఘంటమ్రోగింప జోగు
లాంబకు
శ్రోతోతత్వార్పణంబిడినట్లు సద్భక్తి బాలబ్రహ్మేశ్వరునకు

23. శంఖారవము- శబ్దతత్వము
శిష్టుల రక్షింప, పూర్ణభావమున శంఖమూద పరాశక్తికి
శబ్ద తత్వార్పణంబడినట్లు సద్భక్తి పసాద లింగమునకు

24. వాద్యము - జిహ్వాతత్వము
(చతుర్వేద సారమౌ)నమక చమక పారాయణము సేయ అఖిలకు
జిహ్వాతత్వార్పణ బిడినట్లు సద్భక్తి జంబుకేశ్వరునకు

25. గీతగానము- మాయాతత్వము
చతుషష్టి కళల గీతగానముసేయ వైష్ణవీదేవికి సద్భక్తి
మాయాతత్వార్పణం బిడినట్లు నాగనాదునకు

26. నృత్యము- ఈశ్వరతత్వము
జీవుండు సద్భక్తి నృత్యంబుసేయ శృంఖలాదేవికి
ఈశ్వర తత్వార్పణంబిడినట్లు నటరాజశేఖరునకు.

27. ప్రదక్షిణం- పాదతత్వము
ప్రదక్షిణత్రయంబు రాజరాజేశ్వరికి సద్భక్తి
పాదతత్వార్పణం బిడినట్లు సోమనాదునకు

28. నమస్కారము- పాణితత్వము
కాయవాక్ మనసార వందనంబిడుదు సరస్వతీదేవికి
పాణి తత్వార్పణం బిడినట్లు రామలింగేశ్వరునకు

29. స్తుతి- వాక్‌తత్వము
హర శంభో ఉగ్రాణి అనుచూస్తుతింప మాధవీదేవిని
వాక్ తత్వార్పణం బిడినట్లు సద్భక్తి పాపేశ్వరునకు

30. యాచనా- పాయుతత్వము
సద్భావ సద్భక్తి శ్రద్ధతో యాచింప పురుహూతికాదేవిని
పాయు తత్వార్పణంబిడినట్లు కుక్కుటేశ్వరునకు

31. విజ్ఞప్తి- ఉపస్థ తత్వము
త్రికరణాల సద్భక్తి విజ్ఞాపనము సేయ విశాలాక్షికి
ఉపస్థతత్వార్పణంబిడినట్లు కాశీవిశ్వేశ్వరునకు

32. విసర్జనము- అహంకారతత్వము
శివపంచకోవదారాల త్రివిశంతి తత్వార్పణంబిడుట భువనేశ్వరికి

అహంకార తత్వార్పణం బిడినట్లు పరమశివునికి

33. నివేదనము- శివతత్వము
నిర్మల త్రిశరీరాల జీవాత్మతో నివేదనంబడుట చిద్శక్తికి
శివతత్వార్పణం బిడినట్లు మహాలింగమునకు

34. తాంబూలము- ప్రకృతితత్వము
నిర్గుణ నిర్మల త్రిగుణాల నర్పింప కామరూపికి
ప్రకృతి తత్వార్పణం బిడినట్లు కామేశ్వరునకు

35. వస్త్రప్రావరణం- శుద్ధవిద్యాతత్వము
పునీత మంత్ర వస్త్రప్రావరణం బిడుట అన్నపూర్ణకు
శుద్ధ విద్యాతత్వార్పణం బిడినట్లు భావలింగమునకు

36. అంగనివేశనము- పురుషతత్వము
రాగివంటి జీవుని నిత్యంబు షట్స్థల లింగపూజచేత, హిరణ్మ
యునిచేసి, ఇష్టలింగమును హృదినిడుట
పురుషతత్వం బిడినట్లు ఆదిదంపతులకు.

# పవళింపు సేవ

రచన : డా॥ భవానీశాస్త్రి

సీ॥ సకలలోకాలలో సర్వజీవులసృష్టి
సలిపి సలిపి స్వామి సొలసినావా
ఏడేడులోకాల నేరీతి నడపాలొ
తలబోసి తలబోసి యలసినావా
దుష్టుల శిక్షింప శిష్టుల రక్షింప
వేవేగ పరిగెత్తి విసిగినావా
జాణతనంబున ప్రాణుల తలవ్రాత
సతతంబు వ్రాసి వేసారినావా

ఆ॥ పూర్వజన్మ పాపపుణ్యాల బేరీజు
వేసివేసి లెక్క వేయలేక
చిర్రుబుర్రులాడి చీకాకు పడినావా
నిదుర బ్రోవరమ్మ నాదువాడిని

సీ॥ ఏడేడు లోకాల నెందెందు వెదికినా
నందందె యగుపించు నాదిదేవ

యే పేరుతోనైన నెట్లెట్లుపిల్చినా
వోయని బదులిచ్చు యూర్ధ్వరూప
సకల జీవాత్మకా సర్వదేవాత్మకా
సగుణ నిర్గుణమూర్తి సర్వవ్యాపి
యోగాది మార్గాల యోగీశ్వరేశ్వరు
హృదయాల వెలిగెడి వేదరూప

ఆ॥ ఎట్టి కష్టమైన నిట్టె తొలగజేసి
సర్వశుభములొసగు శాంతిదాత
యన్నిపనుల వదలి యాదమరచి నీవు
నిదుర బోవరమ్మ నాదు వాడిని

సీ॥ ఆర్తితో వేడుదు ఆర్తుల బ్రోవంగ
పరుగు లిడుచు వచ్చు పార్వతీశ
గరళంబు మ్రింగి జగంబుల గాచిన
కరుణాంత రంగుడ కాలకంఠ
సింధువుగామారి చిందులేవేసెడి
గంగ గర్వమడచిన కామవైరి
బుసలెన్నొ గొట్టుచు విసమును గ్రక్కెడి
నాగులకై సేయు నాట్యరాజ
చంద్ర సూర్యాగ్నులు చక్షుత్రయంబుగా
కాలంబు శాసించు కాలరూప

ఆ॥ గడిచె నా పదలిల గండాలు గట్టెక్కె
సర్వమంగళాంబ శక్తితోడ
భయము పోవ జగతి పాలించితివి దేవ
నిదురబ్రోవ రమ్మ నాదువాడిని

సీ॥ సిగలోన గంగమ్మ చిందులే వేయంగ
చలితోడి వణికేటి చక్కనయ్య
గళమందు నాగన్న గట్టిగా బుసకొట్ట
విసపుగాలుల జిక్కి వెట్టి తండ్రి
భూత ప్రేత పిశాచ వ్రాతంబు భయపెట్ట
బిక్క చచ్చినయట్టి పిచ్చితండ్రి
ముక్కన్ను మంటకి ముఖమంత కందంగ
బుంగమూతి పెట్టు బుజ్జితండ్రి

ఆ॥ భయము పోవనిన్ను బజ్జుండ పెట్టగ
అక్కన నినుజేర్చి యాదరించ
కన్నతల్లిప్రేమ కరువాయె నాతండ్రి
నిదురబోవరమ్మ నాదు వాడిని

సీ॥ అన్నపూర్ణాదేవి యాలియైయుండియు
పట్టెదన్నము నీకు పుట్టదాయె
నవనిధులకుపతి నరవాహనుడుతాను
చెలికాడు నీకయ్యు జాలిమాల

## xLi

నిల్లిల్లు భిక్షంబు నెత్తుకొనుచు నీకు
ప్రతిరోజు తిరిగెడి గతియుఁ బట్టె
నష్టలక్ష్మీ పతియాది నారాయణు
డాప్త భక్తుండయ్యు నష్టకష్ట

ఆ॥ ములిల తప్పవయ్యెముల్లోక పతివయ్యు
గూడు గుడ్డ మరియు గూడులేక
వెతల క్రుంగుస్వామి విశ్రాంతిపొందంగ
నిదుర బ్రోవరమ్మ నాదు వాడిని

# సంధ్యోపాసన- పూర్వముద్రలు 24 వాని భావార్థము

1. సుముఖముద్ర: సుముఖము అనగా అనుకూలత. నిత్య గాయత్రి మంత్ర జపానుష్ఠానపరులచే ఆచరింపబడు ఈముద్ర సాధకులను బ్రహ్మజ్ఞాన పిపాసకులుగా అనుగ్రహించునుగాక.

2. సంపుటముద్ర: జీవులచే చేయబడిన ప్రారబ్ధ కర్మ ననుస రించి వారు భవసాగరమున మునిగి తేలుచు, సుఖదుఃఖముల ననుభవించుచున్నారు. సాధకులచే ఆచరింపబడు ఈ సంపుటీ ముద్ర ఫలముగా సాధకులు సంసార సాగరమునుండి బయల్వె డల గల్గుదురుగాక. (మార్గదర్శకమగుగాక)

3. వితతముద్ర; నిత్యగాయత్రి అనుష్టాన సమయమున ఈ వితతముద్ర ఫలముగా భవసాగరమును ఈది బయట పడునట్లు చేయునుగాక.

4. విస్తృతముద్ర: విస్తృతము అనగా విడివిడిగా తెరచుట. తెరువబడిన అరచేతుల దశాంగుళములు సూచించు 1. అజ్ఞాన జనిత అవిద్య, స్మిత. రాగ, ద్వేష, అభినివేశము అను పంచక్లేశములు 2. మనస్సుతోగూడిన శబ్ద, స్పర్శ రూప, రస

గంధములు మానవుని దుఃఖమయ జీవనమునకు సంసారకూప మున పడుటకు కారణములగుచున్నవి. ఓ గాయత్రీ ! ఏ సాధకులు నిత్యము మంత్రజపానుష్ఠాన సమయమున ఈ విస్తృత ముద్ర నాచరించుచున్నారో వారిని ఈ పంచక్లేశములనుండియు ప్రలోభింపచేయు మనస్సుతోగూడిన శబ్దాదిపంచకమునుండియు దూరము చేయుము.

5. ద్విముఖముద్ర : ఓచిచ్ఛక్తి స్వరూపగాయత్రీ దేవి ! నిత్యము నీ మంత్ర జపానుష్టాన సమయమున, ఏ ఉపాసకులు ఈ ద్విముఖ ముద్ర నాచరించుచున్నారో ద్విముఖ సజ్ఞితంబగు (ఆత్మ-పరమాత్మ) జీవాత్మ చిచ్ఛక్తియుత పరమశివుడు ఒకరే అను ఆత్మజ్ఞానమును గాయత్రీదేవి, వారికి కల్గించుగాక !

6. త్రిముఖముద్ర : త్రిముఖముద్ర; భక్తి జ్ఞాన యోగరూప మోక్షమార్గ సూచకము. ఓ సావిత్రీదేవి ! నిత్యము నీ మంత్ర జపానుష్ఠాన సమయమున ఏ ఉపాసకులు ఈ త్రిముఖముద్ర నాచరించుచున్నారో వారియందు భక్తి, జ్ఞాన యోగరూప మోక్ష మార్గములయందు ప్రేరేపించి, భవసాగరమునుండి ఉద్ధరింపుము.

7. చతుర్ముఖముద్ర : ఈ చతుర్ముఖముద్ర, మోక్ష సాధనోపాయములయిన 1) నిత్యానిత్య వస్తువివేచనము 2. ఇహ ముత్ర ఫలభోగ విరాగము 3) శమదమనాది షట్కము 4) ముముక్షుత్వములను సూచించును. ఓ సరస్వతీ దేవి నిత్య నీ మంత్ర జపానుష్ఠాన సమయమున ఏ ఉపాసకులు ఈ చతు

ర్ముఖముద్ర నాచరించుచున్నారో వారిని శీఘ్రమోక్ష ఫలప్రాప్తి అగునటుల ఆశీర్వదింపుము.

8. పంచముఖముద్ర : ఈ ముద్ర 1) హర్షణము 2) రోచనము 3) మోహనము 4) శోషణము 5) మారణము అను పంచ వశీకరణ పద్ధతులను సూచించును. ఓ పరాశక్తి అతీంద్రియ మునులనుగూడా బ్రహ్మజ్ఞాన భ్రష్టులనొనర్చి. వారిని విషయ వాంఛలయందు ముంచి తేల్చు పై వశీకరణముల బారినుండి తప్పించి మోక్షపదగాములుగా రూపొందించు.

9. షణ్ముఖముద్ర : ఈ ముద్ర జయాపజయములు, లాభనష్టములు సుఖదుఃఖములు అను ఆరింటిని సూచించును. నిత్యము ఏ సాధకులైతే మంత్రజపానుష్టాన సమయమున ఈ షణ్ముఖముద్ర నాచరించుచున్నారోవారికి వలయుసుజ్ఞానము, సమబుద్ధి సుబుద్ధుల నొసంగి, అభయమొసంగి, భక్తియుత పరమశివోపాసో న్ముఖులుగా చేయుము.

10. అధోముఖముద్ర : అధోముఖముద్ర - మానవునియందు ఈ దేహమే ఆత్మ అను భ్రాంతిరూప జ్ఞానసూచకము. ఏ సాధకులైతే నిత్యము నీ మంత్ర జపానుష్ఠాన సమయమున ఈ అధోముఖ ముద్ర నాచరించుచున్నారో వారిని ఆ దుర్భ్రమనుండి తొలగించి సన్మార్గయుతులుగా చేయుము.

11. వ్యాపకాంజలిముద్ర : విష స్వీకరణ సంజ్ఞితము. ఓ అన్నపూర్ణాదేవి! ఏ మానవులు నిత్యము త్రికరణశుద్ధితో నిన్ను అర్పించుచున్నారో, మంత్ర జపానుష్టాన సమయమున ఈ


సురభి


జ్ఞాన


చక్ర


యోని


కూర్మ


పంకజ


విఘ్నం


నిర్వాణ

అంజలీ ముద్రను ఆచరించుచున్నారో, వారికి జీవాత్మ - పరమాత్మ ఒక్కరే. జీవాత్మ చిచ్ఛక్తియుత పరమశివుడు ఒక్కరే అను శివాద్వైత సుజ్ఞాన సింధువును సుబుద్ధియుత అంజలియందు భిక్ష నొసంగుము.

12. శకటముద్ర : జీవాత్మ, త్రిశరీరమును (స్థూల సూక్ష్మ కారణములను) శరీరముల భోగసాధనముగా చేసుకొని ప్రారబ్ద కర్మను అనుభవించుచున్నాడు. శకటమనగా వాహనము ఓ గాయత్రీదేవి ? నిత్యము నీ మంత్ర జపానుష్ఠాన సమయమున ఏ సాధకులైతే సకటముద్ర నాచరించుచున్నారో ! అట్టివారి త్రిశరీరములనే శకటమున చిచ్ఛక్తియుత పరమశివుడవైన నీ వధిరోహించి, సారథిగానిలచి, శివాద్వైత మార్గమున నడిపించుము.

13. యమపాశం : ఆధ్యాత్మిక చింతనారహిత, సర్వదుఃఖమయ సంసారబంధ కారణమగు జీవుని మనస్సే యమపాశము. ఓ గాయత్రీదేవి ! నిత్యము నీ మంత్రోపాసన సమయమున ఏ ఉపాసకులు ఈ యమపాశముద్రను ఆచరించుచున్నారో అట్టి సాధకులను యమపాశమునుండి తప్పించి మనస్సును సత్వగుణయుతముగా స్థిరముగా నొనర్చి శివపంచకోన్ముఖులుగా చేసి శివసాయుజ్య పథగాములుగా చేయుము.

14. గ్రథితం : బంధింపబడుట అని అర్థము. జీవుడు మాయా మోహరూప అజ్ఞానమనే మొసలిచేత మ్రింగబడిన ఆత్మజ్ఞానము గలవాడై బహువిధ దుర్భర బాధల ననుభవించుచున్నాడు. ఈ సంసారమనే విషమయ సాగరములో మును

గుతూ తేలుతూ గ్రంధిత రూపమున బంధింపబడు చున్నాడు. ఓ గాయత్రీదేవి ఏ ఉపాసకులు నిత్యము నీ మంత్ర జప అనుష్టాన సమయమున ఈ గ్రధిత ముద్ర నాచరించుచున్నారో, అట్టివారిని బంధవిముక్తులుగా చేయుము. నిర్మల ఆత్మజ్ఞానమును ప్రసాదింపుము.

15. సన్ముఖోన్ముఖముద్ర : ఆత్మజ్ఞాన భ్రష్టులను ఉద్ధరించుట అని సంజ్ఞితము.

ఏ సాధకులు పూర్వజన్మ ప్రారబ్ద కర్మవశమున అథోముఖ ముద్రయందు సూచించినట్లు దేహమే ఆత్మ. అనుభ్రాంతిలోనై. యమపాశమను మనస్సుచే బంధింపబడిన గ్రధితరూప ముద్రయు సూచించినట్లు ఆత్మజ్ఞాన రహితులగుటచేత దుఃఖులు అగుచున్నారో, అట్టివారిని, నిత్యము నీ మంత్ర జపానుష్టాన సమయమున ఈ సన్ముఖోన్ముఖముద్ర నాచరించుచున్నారో వారికి అభయ మొసంగి, ఆత్మజ్ఞాన మొసగి సంసార విష సాగరమునుండి ఉద్ధరింపుము.

16. ప్రవిలంబముద్ర : వేరుచేయుట అని అర్థము.

ఏ ఉపాసకులు నిత్యమంత్ర జపానుష్టాన సమయమున ఈ ప్రవిలంబముద్ర నాచరించుచున్నారో, అట్టివారిని సంసార బంధ జనితములగు సుఖదుఃఖాది ద్వంద్వములనుండి విడమర్చి, శివ సాయుజ్య పధగాములుగా మోక్షార్హులుగా ప్రేరేపింపుము.

17. ముష్టికముద్ర : పిడికిలి అని అర్ధము.

నిత్యము ఏ ఉపాసకులు నీ మంత్రజపానుష్టాన సమయమున ముష్టికముద్ర నాచరించుచున్నారో అట్టివారిని దుఃఖ భాజనమైన

సంసారబంధ ముష్టినుండె విడదీయుము. తదుపరి వారిని చతు ర్విధ మోక్షసాధనోపాయములను ముష్టియందు బంధించి శివాద్వైత పథమున మరల్చుము.

18. మత్స్యముద్ర : చంచలమైన చేప, చంచలమైన మనస్సుల పోలిక. చేప ఏ విధముగా ధ్యేయరహితమై, మునుగుతూ తేలుతూ ఇటు అటు సంచరించుచుండునో అట్లే ప్రారబ్ధ కర్మబద్ధ జీవుడు ఐహిక ఆ ముష్మిక విషయలోలుడై మానవ జీవన పరమార్థ మగు మోక్ష ధ్యేయరహితుడగుచున్నాడు. ఓ గాయత్రిదేవి ఏ ఉపాసకులు నిత్యము నీ మంత్ర జపానుష్టాన సమయమున ఈ మత్స్యముద్రను ఆచరించుచున్నారో వారిని ఆ బాధలనుండి తప్పించి సుధ్యేయ యుతులుగా అద్వైత జ్ఞాన మార్గావలంబ కులుగా నొనర్చుము.

19. కూర్మముద్ర : తాబేలు ఏ విధముగా తన సర్వేంద్రియము లను సుఖముగా బుర్రక్రింది భాగమున అమర్చుకొనునో అట్లే శివాద్వైత సాధకులు. సర్వేంద్రియములను ఆ చిచ్ఛక్తియుత పరమశివునియందే లగ్నము చేయవలెననుట.

ఓ గాయత్రీ దేవి ! ఏ ఉపాసకులు నిత్య గాయత్రీ మంత్ర జపానుష్టాన సమయమున ఈ కూర్మముద్ర నాచరించుచున్నారో వారి సర్వేంద్రియములను దుఃఖ కారకము భోగ దాయకముల నుండి తొలగించి, ఆ చిచ్ఛక్తియందే త్రికరణ శుద్ధిగా యుంచి శివాద్వైత పథగాములై సుఖించుచున్నట్లు ఒనర్చుము.

20. వరాహముద్ర : అడవిపంది తన వాడియైన ముళ్ళతో, మిక్కిలి బలముతో హిసించును. అట్లే మానవుని హృదయమనే

అరణ్యమున, అరిషడ్వర్గములు రాగాది సప్తకము మానవుని చంచల మనోగతములై జీవుని ప్రతిక్షణము హింసించుచూ చిత్త అశాంతికి సర్వదుఃఖ కారములగుచున్నవి. ఓ గాయత్రీ దేవి ! ఏ సాధకులు నిత్యము నీ మంత్ర పునశ్చరణ సమయ మున ఈ వరాహముద్ర నాచరించుచున్నారో వారి హృదయము లను మనస్సులను అరిషడ్వర్గమునుండియు, రాగాది సప్తకము నుండియు రక్షించి, మనో హృదయములను శివభక్తి జ్ఞానముల నింపి, నిత్య శివోపాసనోన్ముఖులుగా చేసి చిత్తశాంతిని సుఖ మును అనుగ్రహింపుము.

21. సింహాక్రాంతముద్ర : జీవునియొక్క హృదయమనే వనమున భోగదాయకమైన స్త్రీ, ధనము, రక్తచందనాదులచే ఆవరింప బడి నిత్య అశాంతికి నిలయముగా, సర్వదుఃఖ హేతువుగా ఆధ్యాత్మిక చింతనకు అతి దూరులుగా చేయుచున్నవి. అట్టి వానిని సంహరింపవలెనన్న సింహమును వాహనముగా గల్గిన దుర్గాదేవి రూప గాయత్రీదేవికి సాధ్యము. ఏ సాధకులు నిత్యము గాయత్రీ మంత్ర జపానుష్ఠాన సమయమున ఈ సింహాక్రాంత ముద్రనాచరించుచున్నారో వారి హృదయారణ్యమును అరిషడ్వ ర్గము, రాగాది సప్తకములను, మానవరూప వ్యాఘ్రముల బారి నుండి రక్షించి, నిన్ను నమ్మి కొలుచు నీ భక్తుల హృదయము నందు సింహవాహినివై సంచరించుచూ రాక్షసులద్రుంచి, భక్తి జ్ఞానములనే కుసుమముల నాటి పెంపొందించి వారిని మోక్ష మార్గ గాములుగా నొనర్పుము

22. మహాక్రాంతముద్ర : రజోతమోగుణయుత మనో జ్ఞానేంద్రి యములు, మనోమయ కోశమనే అగ్ని అగుచున్నది. వనిత

రక్తచందనం ధనాదులనే భోగసాధనములచే (నెయ్యి చేర్చబడి నట్లు అగ్ని వృద్ధి నొందుచున్నది. ప్రారబ్ధ ఆగామి సంచితము లను త్రివిధకర్మల వాసనలు సమిదలగుచున్నవి. జీవుని త్రివిధ శరీరములందు మారణ హోమము నిత్యము జరుగుతున్నది. అందువల్ల అశాంతి అజ్ఞానములకు నిలయమై పునర్జన్మ హేతు వులగుచున్నవి. ఓ గాయత్రీదేవి ! నిత్యము నీ మంత్ర జపా నుష్ఠాన సమయమున ఆచరింపబడు ఈ ముద్రచేత నీవు సాధ కుల హృదయమునందు ఈ మారణహోమమును నివారించి వారిని చతుర్విధ మోక్షమార్గ సాధకులుగా, పునర్జన్మ రహితు లుగా చిచ్ఛక్తియుత పరమ శివోపాసనోన్ముఖులుగా నొన ర్చుము.

23. ముద్గరముద్ర : హే కామేశ్వరీదేవీ! ఏ ఉపాసకులు నిత్యము నీ మంత్ర జపానుష్ఠాన సమయమున ఈ ముద్గరముద్ర నాచరించుచున్నారో ! అట్టివారికి నిర్మల ఆ పరోక్ష ఆత్మజ్ఞాన మును ప్రసాదింపుము.

24. పల్లవముద్ర : నిత్య నూతనత్వమునకు, నిత్యశోభకు చిహ్నము దినదినాభివృద్ధికి పల్లవము (చిగురు) చైత్రామలకము (ఉసిరికె) సర్వకాల సర్వావస్థలయందు నూతనత్వమును సుశరీర మనస్సు లకు ప్రసాదించు తల్లివంటిది. ఓ మహా గాయత్రీదేవి ఏ ఉపా సకులు నిత్యము నీ మంత్ర జపానుష్ఠాన సమయమున ఈ పల్లవ ముద్ర నాచరించుచున్నారో వారిపై కటాక్షించి, వారికి పల్లవ రూప, నిత్యనూతనుడగు ఆ చిచ్ఛక్తియుత పరమ శివ, శివ పంచక పిపాసకులుగా నొనర్చుము.

## L

ఒక బీద పతివ్రత ఇంటియందు ఏమియు లేనందున ఎండిన ఆమలకమును భగవత్పాదులు శంకరాచార్యులకు భిక్షగా ఒసంగినదట. అంత ఆ పరమ శివశంకరుని ఆశీర్వాద బలముగా ఆ బీదపతివ్రతకు అష్ట ఐశ్వర్యాలు ప్రసాదింపబడినట్లు కనక ధారా స్తోత్రమునందు చెప్పబడినది.






## సంధ్యోపాసన జపానుష్ఠానంతర ఉత్తరముద్రలు
## భావవివరణము

1. సురభిముద్ర : కామధేనువువంటి గాయత్రీదేవి నిత్యము యంత్ర, మంత్ర జపానుష్ఠాన సమయమున ఆచరించువారిని మోక్షసాధన చతుష్టయమును (నిత్యానిత్యవస్తు వివేకము, ఇహ మంత్ర ఫల భోగ విరాగము, శమాదిషట్కము 4 ముముక్షత్వములనే నాల్గు స్తనములవలె కల్గిన ధర్మదేవతా స్వరూపిణి అయిన గోమాత శివాద్వైత జ్ఞానము అను అమృతమును వర్షించుగాక.

2. జ్ఞానముద్ర : ఏ ఉపాసకులైతే నిత్యము సంధ్యోపాసనను ఆచరించుచు నీ మంత్ర జపానుష్ఠాన సమయమున జ్ఞానముద్ర నాచరించుచున్నారో వారికి "చిచ్ఛక్తియుత పరమశివుడొక్కడే (జీవాత్మ అతనికంటే భిన్నముగాదు) పరబ్రహ్మయే ఆత్మ తద్భిన్నంకాదు అనుసుజ్ఞానమును కల్గించుము.

3. చక్రముద్ర : "బుద్ధి కర్మానుసారిణీ" అనులోకోక్తి. అజ్ఞానము వల్ల మాయామోహంబులచే ఆవరింపబడి ప్రారబ్ధ ఆగామి సంచితము అను త్రివిధ కర్మలను సంతరించుకొని జనన మరణములనే చక్రమునందు ఇరుకుకొని దుఃఖజనులగుచున్నారు. దీనికి కారణము అద్వైత సుజ్ఞానబుద్ధిని తెలుసుకొని ఆచరించకుండుటయే.

నిత్యము గాయత్రి మహామూర్త్యోపాసన చేయునీ సాధకులకు, చక్రముద్రాచారణముచేయు వారలకు శివాద్వైత జ్ఞానయుత సుబుద్ధిని ప్రసాదించి, మనశ్శాంతిని, కర్మరాహిత్యమును కల్గింపుము. పునర్జన్మ రహితులుగా చేయుము.

4. యోని : అవిద్యచే ఆవరింపబడి జీవాత్మ అనేక దుష్ట కర్మలకు, దుర్వాసనలకు యోని (నిలయము) అగుచున్నది.

నిత్యము గాయత్రీ జపానుష్ఠాన మొనరించు ఉపాసకులను అజ్ఞాన అవిద్యాయుతయోనినుండి తొలగించి, నిత్య సచ్చిదానంద మొసగు, శుద్ధ విద్యా శివాద్వైత సుజ్ఞాన యోనియందు ఉంచి, బ్రహ్మమే పరబ్రహ్మము అను అభేద జ్ఞానము నొసంగుము.

5. కూర్మముద్ర : గాయత్రీ మహామంత్ర పునశ్చరణము చేయు సాధకులకు మోక్షసాధకములగు సర్వేంద్రియములు. ఇంద్రియార్థముల నొసంగి, జగద్విషయ బద్ధమై సర్వభోగ కారణములై మలయుత సర్వేంద్రియములనుండి వాని అర్థములను తొలగించి తాబేలు ఏ విధముగా సుఖముగా తన బుర్ర క్రింది భాగమున సర్వేంద్రియముల నముడ్చుకొనునో అట్లు సర్వేంద్రియములను సుజ్ఞాన చైతన్య శివాద్వైతమువైపు మరల్చి, కూర్మవృత్తిని సదానందమయునిగా చేయుము.

6. పంకజముద్ర : జీవుడు తనాచరించిన ప్రారబ్ధ ఆగామి సంచితములను త్రివిధ కర్మలవల్ల సర్వదుఃఖకారకములగు సంసార రూప పంకజమందు ఇఱుకుకొని నిత్యము అశాంతి నిరాశ నిస్పృహలకు గురి అగుచున్నాడు.

నిత్యము గాయత్రీ మంత్ర జపానుష్ఠాన సమయమున ఆచరింపబడిన పంకజముద్రవలన, అట్టి సాధకుల మలయుత సంసార పంకమును, సుగంధ పటిమక శివాద్వైత రూపపంకముగా మార్చి, మట్టియందు మాణిక్యమువలె ఆ పరోక్ష జ్ఞాన పంకమునందు సుజ్ఞానరూప ఆ పరోక్ష జ్ఞానపుష్పమును ఉత్పత్తి చేయుము.

7. లింగముద్ర : నిత్యము గాయత్రీ మంత్ర జపానుష్ఠానము చేయుచూ లింగముద్ర నాచరించు సాధకులను చిచ్ఛక్తియుత పరమ శివ శివాద్వైత సుజ్ఞానులుగా లింగముద్రరూప అద్వైత పరబ్రహ్మబుద్ధిగలవారలుగా నొనర్పుము.

8. నిర్యాణముద్ర : ఓ కామేశ్వరీ ! నిత్యము గాయత్రీ మంత్ర జపానుష్ఠాన మొనర్చుచూ నిర్యాణముద్ర నాచరించు ఉపాసకుల జీవాత్మలను నిర్యాణముద్ర సంజ్ఞితయగు, భ్రమజనిత దేహమునుండి విడమర్చి, త్రిశరీర రహిత, శరీర సువర్ణపంజర బంధవిముక్తులు (నిత్యము శివపూజ నాచరించుటవలన) గా నొనర్పుము. చెవిటివాడు విననట్లు, గుడ్డివాడు చూడలేనటుల కనపడని (దేహనిర్యాణము నొందుటచేత) ఆ జీవాత్మ బ్రహ్మ విద్య సంపన్నుడై క్రమశః పరబ్రహ్మమేయగును. అనగా జీవాత్మ చిచ్ఛక్తియుత పరమశివునియందు లింగైక్యము నొందును. పునర్జన్మ రాహిత్యము గల వాడుగాను నిత్యము సచ్చిదానంద రూపుడగును. ఇదియేకదా జీవిత పరమావధి.

అతిదుర్లభమైన మానవజన్మను మనకొసంగి మనలను ఇహ జన్మాంతమున, నిత్య శివారాధన ఫలముగ "అహం బ్రహ్మ" అహం

శివోస్మి "తత్వమసి" అను జీవుని ఉత్కృష్ట జీవన ధ్యేయ సాధకులుగా నొనర్చుటయేకదా గాయత్రీ మహా మంత్రానుష్ఠాన ప్రసాదము.

సంపూర్ణము

శుభంభూయత్.

గోబ్రాహ్మణ హితమస్తు

లోకాస్సర్వే సుజ్ఞాన సుగంధ పరిమళయుతమస్తు.

# సుషమాలాపం

-భిషగ్రత్న, ఆయుర్వేదవాచస్పతి
డా॥ ప్రకాశచంద్ర శతపథి

"విద్యామధీత ఇతి వైద్యః"

విద్యలను చదివినవాడు వైద్యుడని గౌతమమహర్షి తన స్మృతిలో వాకొనినాడు.

"అవైద్య మూర్ఖః" - విద్యలను చదవని మూర్ఖుని అవైద్య శబ్దమున పేర్కొనినాడు.

వైద్యుని కెన్నియో విద్యలు - జ్యోతిషము, వాస్తుశాస్త్రము, తర్క శాస్త్రము, సాహిత్యము, శబ్దశాస్త్రము, అధ్యాత్మికము యిలాంటివన్నిటియందునూ ప్రజ్ఞ సంపాదించగలిగి యుండ వలయును. కనీసము పరిచయమైన కల్గి యుండవలయును. లోకజ్ఞత, యుక్తిజ్ఞత, పూర్ణముగా నుండవలయును. లేకున్న విద్వద్వైద్యుడనబడజాలడు.

ఇక యోగవిద్యయందునూ దక్షుడై యుండవలయును. ఆస్తికుడై యుండుట తప్పనిసరి.

ఆయుర్వేదము జనారోగ్య సంరక్షణజేయునదేగాక, ఆస్తికులుగా, ధర్మపరులుగా, సత్యవాదులుగా, పరిశుద్ధ జీవనులుగా ప్రజలను చేయునది కూడ. అదే ఇతర వైద్యవిధానములకు ఆయుర్వేదమునకున్న వ్యత్యాసము.

వాగ్భటాచార్యుడు దేహ తత్త్వ నిర్ణయము" అను పోత్రమున వైద్యునిగూర్చి వివరిస్తూ.

"షట్చక్రం శోడశాధారం త్రిలక్ష్యం వ్యోమ పంచకమ్

స్వదేహే యో న జానాతి కథం వైద్యస్య ఉచ్యతే"

షడ్చక్రములు, శోడశాధారములు, త్రిలక్షములు పంచభూతములు శరీరములోనుండు స్థితిని తెలియనివాడు వైద్యుడనబడునా ! అని ప్రశ్నించినాడు. అంటే ఇవన్నీ తెలిసినవాడే వైద్యుడు. తెలియనివాడు వైద్యుడుకాడని నిర్ణయము.

దివోదాసధన్వంతరి భగవానుడు సుశ్రుతాదులకు పది విధములయిన శరీర విజ్ఞానమును విశదీకరిస్తూ ఇలా అంటారు.

.. ........నిర్దిష్టాని దశైతాని శారీరాణి మహర్షిణా,

విజ్ఞానార్థం శరీరస్య భిష జాం యోగినా మపి"

ఈ పది విధములైన శారీరక విజ్ఞాన విషయములును వైద్యులకును, యోగాభ్యసన పరులకును మిక్కిలిగా తెలియుటకే చెప్పబడినది అని.

ఈ ధన్వంతరియే భాగవతమునందు స వై భగవతస్సాక్షా ద్విష్ణోరంగాంశ సంభవః, ధన్వంతరి రితిఖ్యాతః ఆయుర్వేద దృగిజ్యభాన్ అని తెల్పబడివాడు. విష్ణ్వాంశ సంభూతులు, శివాంశభూతులునైన భిషగ్వరులు ఆస్తికులు కాకుంప ఎట్లుండగలరు? జనాచార్యులుగ నుండుట విధి. దేశంలో వైఖానసులు శివారాధకులు వైద్యులుగానున్నారు.

"ఆచర్యత ఇత్యాచార్య" సంస్కారములను పొందించువాడు గావున ఆచార్యుడనబడునని గౌతమ మహర్షి వాక్కు.



వైద్యశ్రీ ప్రకాశచంద్ర శతపధిగారు
వైదిక ఆయుర్వేదశాస్త్ర పారంగతులు-బహుముఖ ప్రజ్ఞాశాలి
ఔషదీ పరిజ్ఞానంలో దిట్ట.

Lxv వ పేజీ చూడండి.

ముదిగొండ శంకరశాస్త్రిగారు శాస్త్రీయంగా ఆయుర్వేద శాస్త్రాన్నభ్యసించినవారు. జిజ్ఞాసాపరులు (జిజ్ఞాసా ధర్మ చింతన కదా) ప్రభుత్వ ఆయుర్వేద కళాశాల ప్రాచార్యులుగా ఆయుర్వేద ఆతురాలయ ప్రధానచికిత్సకులుగానుండినవారు. నిత్యశివారాధన అనాదిగా సల్పుఆస్తిక్యవంశజులు వారు శివపూజావివేచనము మొదటి భాగమును అనేక గ్రంధములలోని విషయములను ఆయుర్వేద శాస్త్రాంశములను జోడించి సుందరముగ హృద్యంగా ఒక గ్రంధమును సంకలనజేసి అభిప్రాయార్ధము నాకు పంపినారు. పొత్తమును అందుకొనువప్పటికి అస్వస్థచిత్తుడనై యుంటిని. సాంతముచూచినాను విప్లుతమైన మనస్సు కుదుటపడినది. ఏకాగ్ర మనసాపరిశీలించినాను. మనోజ్ఞంగా భాషించినది. ఇది పఠించినవారలకును మనః ప్రసాదం చేకూరునని భావించవచ్చును.

శివ మనగా శుభము మంగళము అవికల్పించువాడు గనుక శివుడన బరగినాడు. శివంకరుడన శుభముల కల్గించువాడు. శంభుశబ్దము ఇంతే ఈశ్వరశబ్దము శ్రేష్ఠమన్న అర్థము మొసగునది.

శివ ఈశ్వర శబ్దములు ఆయుర్వేద తంత్రముల బహుళముగా వాడబడినవి. చరకచికిత్సా కాస ప్రకరణము పద్మకాది లేహమును వివరిస్తూ.. .... విశుద్ధలేహయే ల్లేహం సర్పికా సహరమ్ శివమ్ అని పేర్కొనబడినది.

చరకకల్పస్థానం సప్తమాధ్యాయంలో విరేచన లేహ్యయోగముల కొన్నింటిని పేర్కొంటూ అవి ఈశ్వరాణాం విరేచనం. చక్రగా విరేచనముచేయుటకు ప్రశస్తమైనదిగా ఈశ్వర శబ్దములో ఉల్లేఖించ బడినవి. కాసమర్దాది ఘృతము- ప్లీహకాస, సహరం, శివమ్ అని

తెల్పబడినది ఆయుర్వేద చికిత్సలో మహేశ్వరుని పేరిట ఎన్నెన్నో ఔషధములు కలవు.

మాహేశ్వర ధూపం - కామేశ్వర మోదకం పంచవక్త్ర రసం శివగుటిక - మృత్యుంజయ రసం - భీమపరాక్రమరసం - సర్వేశ్వర రసం - మహామృత్యుంజయ రసం - చంద్రశేఖర రసం - భూతభైరవ రసం - పాశుపతరసం - పాశుపతాస్త్రం - ఉమాశంభురసం - ఉమా ప్రసాదనరసం - త్రినేత్రరసం - ప్రాణేశ్వరసం.

త్రిపురాంతకరసం త్ర్యంబకేశ్వరరసం-సర్వేశ్వర రసం. ఇలా ఎన్నెన్నోగలవు. కొన్ని శంభుదే తెల్పినవి. చరక చికిత్సలో విషాధికారమున "మహాగంధహస్తి యోగము కుబేరునకు ఈశ్వరుడు తెలిపినట్లు

"... ....అగదోయం వైశ్రవణా యాఖ్యాత
త్ర్యంబకేణ షష్ట్యంగః । అప్రతిహత ప్రభావః
ఖ్యాతో మహాగంధహస్తీతి ॥... ...."

ఉల్లేఖింపబడినది.

కరుణాసముద్రుడు, ఆర్తత్రాణ పరాయణుడు అనాధరక్షకుడు- ఐశ్వర్యప్రదాత- సమస్త శుభ ప్రదాత- మృత్యుంజయుడు—భక్తసుల భుడు నైన భూతనాథుని ఆ పరమేశ్వరుని నిర్మల చిత్తముతో, నిర్మోహముతో—మనోవాక్కాయ కర్మలా అర్చించిన ఆ పశుపతి నాధుదే సర్వబాధల నివారించుననని ఆయుర్వేద సిద్ధాంతము కూడా. ఆయన విశ్వేశ్వరుడు విశ్వప్రాణుల రక్షకుడుగా ఎన్నెన్నో దృష్టాం తరములు ఆర్ష వాఙ్మయములోగలవు. వ్యాధులు శివావతారము

వలననే జనించినవని ఆయుర్వేద సిద్ధాంతము. శివార్చన వ్యాధిహరము విషమజ్వర పీడనుండి తేరుకొనుటకు-

మూ. సోమం సానుచరం దేవం సమాతృగణ
మీశ్వరమ్ । పూజయన్ ప్రయతః
శీఘ్రం ముచ్యతే విషమజ్వరాత్ ॥

విష్ణుం సహస్ర మూర్ధానంచరా చరపతిం
విభుమ్ స్తువన్నామ సహస్రేణ జ్వరా
న్సర్వానపోహతి । బ్రహ్మాణ మశ్వినా
నింద్రం హుతభక్షం హిమాచలమ్ ।
గంగాం మరుద్గణాం శ్చేష్ట్యా పూజయన్.
జయతి జ్వరాన్॥ భక్త్యామాతా పితౄణాం
చ గురూణాం పూజనేనచ । బ్రహ్మచర్యేణ
తపసా సత్యేన నియమేనచ ॥ జపహోమ
ప్రదానేన వేదానాం శ్రవణేనచ । జ్వరాద్విము
చ్యతే శీఘ్రం సాధూనాం దర్శనేనచ ॥

## చరక చికిత్సాస్థానం జ్వరాధ్యాయము

పార్వతీదేవితోడను, నందికేశ్వరుడు మున్నగు అనుచరులతోడను మాతృగణముతో కలసియున్న పరమేశ్వరుని పవిత్ర హృదయముతో పూజించిన విషమ జ్వరము విడనాడును. అటులనే జంగమ స్థావరములకు ప్రభువైనట్టియు, సమర్థుడైనట్టియు వేయి శిరస్సులు

గల విష్ణుమూర్తిని సహస్రనామములచే (విష్ణుసహస్రము) స్తోత్రము చేసినచో సర్వజ్వరములు బాయును.

బ్రహ్మ, అశ్వినీదేవతలు, దేవేంద్రుడు, అగ్నిదేవుడు, హిమవంతుడు, గంగాభవాని, దేవతలు వీరిని భక్తితో పూజించిన వ్యక్తి జ్వరముల జయించును.

తల్లిదండ్రులయందలి భక్తిచేతను, గురుపూజచేతను, బ్రహ్మచర్యముచేతను, తపస్సుచేతను, సత్యముచేతను, నియమముచేతను, జపహోమములు చేయుటవలనను, వేదముల వినుటచేతను, సాధువుల చూచుటచేతను జ్వరము శీఘ్రముగ నశించునని వివరించబడినది.

వైద్యవిద్యార్థికి ఆచార్యుడు విద్యచెప్పుటకు ముందిటుల చెప్పవలసినదిగా చరక విమానస్థానమున ఉల్లేఖించబడినది.(8వ అధ్యాయం)

దేవతాగ్ని ద్విజగురు వృద్ధసిద్ధాచార్యేషుతే నిత్యం సమ్యగ్వర్తితవ్యమ్, తేషుతేసమ్యగ్వర్తమానస్య అయమగ్నిః సర్వగంధరసరత్న బీజాని యథేరితాశ్చ దేవతాః.

శివాయుస్యుః; అతోన్యథా వర్తమానస్య అశివాయేతి.

దేవతలు- అగ్ని- బ్రాహ్మణులు- గురువులు- పెద్దలు- సిద్ధులు ఆచార్యులు - వీరి విషయమై నీవు (విద్యార్థి) వినయముతో సరైన పద్ధతితో నడచుకొనవలయును. వారలకనుకూలముగా నడుచుకొన్నచో నీ అగ్ని, సకలగంధములు, రసములు, రత్నములు, బీజములు, దేవతలును నీకు శుభములనిత్తురు. వారియెడ వ్యతిరేకముగా ప్రవ

గ్రించిన అశుభముల కల్గింతురు శుభ, అశుభవములశుగాను శివాయ ఆ శివా పలుకులు వాడబడినవి. విజ్ఞులు గమనించదగును.

కనుకనే

"పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ బాధతే
తచ్ఛాంతి రౌషధైర్దానై జపహోమ సురార్చనై"

అని ఆయుర్వేద విదులు తెల్పినారు.

మరియు

"పుణ్యైశ్చభేషజైః శాన్తాస్తేజ్ఞేయాః కర్మదోషజాః"

దాన జపాది పుణ్యకర్మలచేతను, ఔషధములచేతను శమించు వ్యాధులు కర్మదోషజములనబడును.

భూతనాధుని (శివుని) జగద్రక్షకుడైన ఈశ్వరుని, ఈశ్వరుని ప్రమథగణములను నియమముతో పూజించినచో ఉన్మాదములు నశించునని చరకసంహిత చికిత్సస్థానమున (ఉన్మాదచికిత్సలో) తెలుపబడినది.

భూతానామధిపం దేవమీశ్వరం జగతః ప్రభుమ్।
పూజయన్ ప్రయతోనిత్యం జయత్యున్మాదజం భయమ్.
రుద్రస్య ప్రమథానామగణా లోకేచరన్తియే
తేషాం పూజాంచ కుర్వాణ ఉన్మాదేభ్యో విముచ్యతే

మరియు

బలిభిర్మంగ వైర్హోమై రోషధ్యాగదధారణైః
సత్యాచారతపోజ్ఞాన ప్రదానానియమవ్రతైః

దేవగుహ్యక విప్రాణాం గురూణాం పూజనేనచ
ఆగంతుః ప్రశమం యాతిసిద్ధైర్మన్త్రౌషధైస్తథా ।

బలికర్మ, మంగళకార్యములు - హోమములు - ఓషధులను, ఔషధములను ధరించుట, సత్యము, ఆచారుల తపస్సు, జ్ఞానము, దానము, నియమవ్రతము, దేవతలను, గుహ్యకులను, బ్రాహ్మణులను, గురువులను పూజించుట, సిద్ధంబులగు మంత్రములు ఔషధములు భూతోన్మాదములు, ఉన్మాదములు నశించునని తెలుపబడినది.

అసలు ఉన్మాదములు- మద్యమాంసముల విడచినట్టి హితాహారమును తినుచున్నట్టియు, నియమముగా నున్నట్టియు శుచిగావున్న సత్వగుణముగల మనుజునికి ఉన్మాదములు కలుగనేరవని-

నివృత్తా మిషమద్యోయో హితాశీ ప్రయతః శుచిః ।
నిజాగంతుభిరున్మాదైః సత్వవాన్ న సయుజ్యతే ॥

అని చరక చికిత్సలో తెలుపబడినది. ఆచారముల ననుసరించుటవలన జపదాన, హోమ, బలిమంగళ దైవారాధనవలన కలుగు సుగుణములు తెలుపబడినవి.

చరకసంహిత మదాత్యయ ప్రకరణములో-

నివృత్త సర్వమద్యేభ్యో నరోయస్స్యా జ్జితేంద్రియః
శరీరమానసైర్ధీమాన వికారైర్న సయుజ్యతే ॥

ఇంద్రియ నిగ్రహము గల్గినవాడై యుండి మద్యమును త్రాగ

కున్నచో శరీరసంబంధమయిన వ్యాధిగాని, మనస్సంబంధ మైనట్టి వ్యాధిగాని పొందనేరదని తెలుపబడినది.

ప్రతివ్యక్తిని సదాచారసంపన్నునిగా సత్‌శీలునిగా సత్త్వగుణ సంపన్నునిగా తీర్చిదిద్దుటే ఆయుర్వేదాశయము.

ఇంద్రియోపక్రమణీ యాధ్యాయమున (చరక సంహిత సూత్ర స్థానం) ఒకవైపు ఆరోగ్యమును వేరొక వైపు ఇంద్రియవిజయమును మరొకవైపు నిర్మలచిత్తునిగా, ఆస్తికునిగా భాగవతోత్తమునిగా తీర్చి దిద్దు విధానములు. మానవుడనుష్ఠించవలసిన విధులు వివరింపబడినవి. స్వస్థవృత్తము- దినచర్య- ఋతుచర్య- పేరిట మానవుడు సత్‌శీలుడుగా, సదాచార సంపన్నుడుగా- పరోపకారిగా- పరహిత చింతనా పరుడుగా రూపుదాల్చుట కనుగుణమైన క్రియలు తెలుపబడినవి.

''ఆచారాదాయుర్లభ్యతే'' ఆచారములనుసరించినందున ఆయుర్వృద్ధి జరుగుతుంది. అసలు ఆయుర్వేదమే ఆయుస్సును పెంపుదల చేయు శాస్త్రము.

"ఆయుర్వేదోమృతానాం"
జీవితమును నిచ్చువానిలో ఆయుర్వేదమును

"సద్వచన మనుష్ఠేయానాం''
అనుష్ఠింపదగిన వానిలో సద్వాక్యము.

''కాలభోజన మారోగ్య కరాణాం''
సరైన వేళయందు భుజించుట ఆరోగ్యకరము.

బ్రహ్మచర్యమాయుష్యాణాం"
బ్రహ్మచర్యము ఆయుర్వృద్ధికరము.

అహింసా ప్రాణినాం ప్రాణవర్ధనా నాముత్కృష్టతమం
మనుజులకు ప్రాణవర్ధకములలో అహింస

"తత్త్వావబోధో హర్షణానాం"
సంతోషమును కలిగించు వాటిలో బ్రహ్మజ్ఞానులు.

"బ్రహ్మచర్యమయనానాం"
సన్మార్గములో బ్రహ్మచర్యమును

"విద్యాబృంహణానాం"
పుష్టినొసగువాటిలో విద్య

"వీర్యం బలవర్ధనానాం"
బలవర్ధకములలో ఉత్సాహము.

"అనిర్వేదో వార్తలక్షణాం"
ఆరోగ్య లక్షణములలో విచారము లేకుండుట.

"లౌల్యం క్లేశకరాణాం"
దుఃఖమును కల్గించువానిలో ఆశ కల్గియుండుట.

ఇలాంటి సదుపదేశములెన్నో ఆయుర్వేదమునందు ల్లేఖింప బడినవి.

ఆయుర్వేదలక్ష్యం - రోగములు రాకుండునటుల చూచుట- జనించిన వ్యాధులను చికిత్సించి నయముచేయుటయేగాక- మనుజుల

ఆరోగ్యము నిలకడగ నుండునటుల చూచుట (స్వస్థరక్షణ) ప్రధానము. ఆయుర్వేద చికిత్సయన -

"చికిత్సా చాయుషో హి తాయోపదిశ్యతే"

"చికిత్స ఆయువు యొక్క హితముకొరకు చేయబడును. శీలసంపత్తిని పెంపొందింపజేసి మానవుని ఉన్నతునిగా ఆధ్యాత్మ విదునిగా రూపింపజేయు ఆశయముగా గలది "శీలే మనుష్యాణాం" అని శాస్త్రం చతుర్విధ పురుషార్థ సాధనకు ఆరోగ్యం ముఖ్యమని "ధర్మార్థ కామమోక్షాణామారోగ్యం మూల ముత్తమం - ఇది ఆయుర్వేదశాస్త్ర ఆకాంక్ష మానవుడేకార్యము చేయవలెనన్నా - అది ఐహికంగానీ ఆధ్యాత్మికంగానీ, దైవార్చనగానీ, పితృకార్యంగానీ ఆరోగ్యముంటేనే కొనసాగును.

ఆరోగ్యాన్నిస్తూ ఆధ్యాత్మికతను చేకూర్చునది ఆయుర్వేదము.

ధర్మార్థకామములు మూడూ ఐహిక జీవితమునకు చెందినవి. వీటిని త్రివర్గమందురు.

ఇందు ధర్మము జీవితగమనమునకు మూలమైనట్టిది. పునాది వంటిది. ధర్మమునకు విరుద్ధముకాని ఆర్జన ధర్మమునకు విరుద్ధము కాని కామము అనుభవించుటవలన జీవితము విశుద్ధమై చతుర్థ పురుషార్థమగు మోక్షము అప్రయత్నముగనే కరతలామలక మగును జీవితము అధర్మయుతమై అర్థకామములే ఆరాధనీయములైన జీవితమంతా అంధకారమయమై అజ్ఞానవిలసితమైన మోక్షము సుదూరమగును.

అటుల మోక్షమునకు దూరముకాకుండ కాపాడునదే మతము.

v)

మతము విజ్ఞానయుతము జ్యోతి స్వరూపము. ధర్మస్వరూపము. ధర్మమనవేద మార్గము. "వేదో ధర్మమూలమ్"

"వేద ఇతింకర్మజన్యోభ్యుదయనిశ్శ్రేయ సహేతుర పూర్వాఖ్య ఆత్మగుణోధర్మః"

అని గౌతమ ధర్మ సూత్రమున వేదో ధర్మమూలమ్‌కు వివరణ యిది.

కర్మజన్యమై అభ్యుదయమును నిశ్శ్రేయమును (మంగళమును) గల్గించుటకు కారణమైయుండునట్టి అపూర్వమను ఆత్మగుణమే ధర్మము, అట్టి ధర్మమునకు మూలము అనగా ప్రమాణము వేదమే.

ఆత్మశుద్ధిగల్గినపుడు మానవుని సుగుణపుంజ మావరించునే గాని దుర్గుణ ఛాయ లంటవు. ఆయుర్వేదము, ప్రతివ్యక్తిని అధ్యాత్మ విదునిగా రూపొందించును. ఆయుర్వేదశాస్త్రరీత్యా అధ్యాత్మయన- మనస్సు, మనోవిషయము. బుద్ధి - ఆత్మ - ఇవి అధ్యాత్మ ద్రవ్య ముల, గుణముల యొక్క సంగ్రహము. ఈ సంగ్రహమే శుభము లకు, అశుభములకు, సంసారప్రవృత్తికి, మోక్షమునకు హేతువుగా నుండును.

కర్మయన్నది ద్రవ్యము నాశ్రయించి యుండును. అదియే క్రియ అనబడును.

మానవుని పరిశుద్ధముగా ప్రజ్ఞానవంతునిగా మలచునది మనస్సు మనోర్థం, బుద్ధి, ఆత్మలు ఇవి అకల్మషముగానున్న జీవితము పర మేశ్వరుని సన్నిధి నాకాంక్షించు సత్వగుణ సంపత్తితో అలరారు చుండును.

ఇందుకు ఆహారాచార చేష్టలు వికృతమై యుండరాదు. మనోర్థ

మన - "(మనసస్తు చింత్యయర్థః) ఆలోచించతగినది మనోవిషయములు. "ఆహారశుద్ధౌః సత్వశుద్ధిః" పరిశుద్ధాహారము వలననే మనస్సు పరిశుద్ధముగ నుండును.

అటులనే ఆచారము, చేష్టలు విగుణవంతములుగా నుండకున్న మానవుడు సత్త్వగుణ సంపన్నునిగా విరాజిల్లును. వ్యాధులబారి పడకుండ కాపాడునని కూడా ఆయుర్వేద ముద్ఘాటించినది. ప్రాచార్యులు శంకరశాస్త్రిగారు శివపూజా వివేచనమున శివ సంబంధమైన విషయములను బోధించి సంకలనము చేసినదానిలో ఆయుర్వేద జ్ఞానమును జొనుపుటకు కారణమైనది. ఆయన వైద్యుడైనందు చేతనే యిలా జరిగినదని తలంచకూడదు. మృత్యుంజయుడే ఆది వైద్యుడు.

కాళిదాసమహాకవి జగత్తునకు పార్వతీపరమేశ్వరులు తలిదండ్రులని వాకొనినారు.

ఆయుర్వేదచికిత్సలో రస గంధకములు ముఖ్యమైనవి. ఆయుర్వేద చికిత్స రెండురకములు. ఒకటి బ్రాహ్మీ చికిత్స రెండవది శైవీచికిత్స. రసగంధక ధాతువులతో ఔషధములు పరికల్పన చేయబడునది శైవీచికిత్స.

రసము, గంధకము - శివ, శాంభవిల అంశలు.

ఆయుర్వేదౌషధములలో పాకౌషధములు భ్రజ్జపీ ఔషధములు యించుమించు అన్ని రసగంధకమిశ్రితములే.

బ్రాహ్మీ చికిత్సలోకూడా అక్కడక్కడా రసగంధకముల ప్రయోగములున్నవి. అయినా నూటికి తొంబదిపాళ్ళు ఓషధులతో తయారు చేయబడును. శైవీ చికిత్సలోను ఓషధులుకూడా ఉపయో

గింపబడును. అసలు కొన్ని ఓషధులు శివనామముతో విఖ్యాతినంది నవి.

విషహరమైన, రసాయనిక గుణవంతమైన ఒక ఓషధిపేరు "ఈశ్వరి" వస్తువు పేరు "గౌరీ"

**లింగదొండ** : "ఈశ్వరీ, శైవవల్లరీ, లింగ సంభూతా, లైంగా, లింగ, దేవి నామములు గలది.

**శరకాం్ర్యుయ** : శివా పేరిట పేర్కొనబడును. హైమవతీ అన్న నామములు గలదు.

**ఉసిరికకు** : శివనామములు గలదు, శ్రీఫల పేరున్ను.

**మహేశ్వరీ** : శివకుమారీ, ఈశానీ, ఇవి ఈశ్వరికి పేర్లు.

**అడవి సదాపాకు** : సితశివాయని నామములు.

**కుటజకు** : గిరిజ నామముకలదు.

**సైంధవ లవణం** : శివనామముతో వ్యవహరించబడును. శిత శివ మరో పేరు.

**తెల్లజీలకర్ర** : కాశికాపేర పేర్కొనబడును ప్రేంఖనం -

**ప్రేంఖనం** : 'గౌరీ' నామములుగలది.

గోరోచనము గౌరీపేరిట వ్యవహరించబడును. ఇలా ఎన్నెన్నో ఓషధులకు పార్వతీ పరమేశ్వరులపేర్లు గలవు.

**అధర్వణ వేదజ మాయుర్వేదము** : వేదములు కొందరు భావించినట్లు మానవకల్పితముకావు. పరాత్పరుని నిశ్వాసరూపమున వెలువడినట్టివి వేదములు.

అస్యమహతో భూతస్య నిశ్వసిత మే వైతత్ యత్
ఋగ్వేదో యజుర్వేదస్సామవేదో థర్వణ ఇతి"

(బృహదారణ్యము)

"యస్య నిశ్వసితల వేదాః" శృతివాక్యము.
"నకశ్చిద్వేదకర్తాచ వేదం స్మృత్వా చతుర్ముఖః

(పరాశర స్మృతి)

ఇలా వేదములు ఏదో ఒక కాలమున ఏర్పడినవి కావు అనాదిగా వస్తున్నవి. అవి నిత్యములు. అనాదులు. అనాదులైన వేదములను కల్పాదియందు బ్రహ్మచే ననుజ్ఞాతులైన మహర్షులు తమ సమాధి ప్రజ్ఞచే అందుకొని శిష్యులకందజేతురు. అవి అట్లు పారంపర్యముగా వచ్చి కల్పాంతమువరకు ప్రవర్తించును. కల్పాంతమునందు పునః అంతర్హితములగుచుండును. తిరిగి కల్పాదియందును మహర్షులచే ప్రాచుర్యమునకు వచ్చుచుండును.

"యుగాంతేం తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్
మహర్షయః లేభిరే తపసా పూర్వం

అనుజ్ఞాతా స్వయంభువా అని పేర్కొనబడినది. అథర్వణ వేదమున బ్రహ్మదినకాలమును 432కోట్ల సంవత్సరములుగా చెప్పబడెను. బ్రహ్మదినమునకు పదునాల్గు మన్వంతరములు. మన్వంతరమునకు 71 దివ్యయుగములుండును. దివ్యయుగమునకు 12వేల దివ్య సంవత్సరములుండును. దివ్య సంవత్సరమునకు 360సామాన్య సంవత్సరములుండును. ఇప్పుడు మనము స్వాయంభువ, స్వారో

చిషఔత్తమ. తామస, రైవత, చాక్షుసములు గడచి, వైవస్వంతమ న్వంతరమునందున్నాము. ఇది ఏడవ మన్వంతరం. ఇప్పటికి శ్వేత వరాహకల్పం. కల్పప్రళయములు జరిగిన తదుపరి ఏర్పడిన కల్ప చెంది ఇదేర్పడి సుమారు పన్నెండు కోట్ల సంవత్సరములనుండి హిందూమతం, హిందూసంస్కృతి, ఆయుర్వేదం, గీర్వాణభాషమను గడయున్నదని విశదమగును.

"న్యూటెస్టమెంటు" అను క్రైస్తవ మత గ్రంథము రెండువేల సంవత్సరముల నాటిది. పైగంబరు వారికి వినిపించిన ఈశ్వరవాక్కు అనబడు "కొరాను" సుమారు పదమూడువందల సంవత్సరముల లోపుది. ఈరీతి యీ గ్రంథమునకు, మతములకు కాలనిర్ణయం అయినద్ధి. వేదముల కాలము ఇటీవలి కాలమానమునకు వర్తించదు. అనాది కోట్లాదివత్సరములనాటిది. ఆయుర్వేదము అనాదిదే.

## ఏ వేదమునకు ఉపవేదము ఆయుర్వేదం;

''ఋగ్వేదసాయుర్వేద ఉపవేదః''

అను చరకవాక్యము ననుసరించి ఆయుర్వేదము ఋగ్వేదమునకు ఉపవేదమని కొందరి సిద్ధాంతము. ఋగ్వేదములోను ఆయుర్వేద విషయములున్నవి. అయితే ఆయుర్వేద తంత్రజ్ఞులు

''ఆత్రేయాగ్నివేశ దివోదాస ధన్వతరిసి ప్రభుతులు

(చరక, సుశ్రుత గ్రంథకర్తలు) ఆయుర్వేదము అథర్వణ వేదముకుపవేదమనియే తెల్పిరి. చరక సూత్రస్థానం త్రింశత్తమాధ్యాయమున-

"చతుర్ణామృక్సామ యజురథర్వ వేదానాం కం వేద
ముపదిశన్త్యాయుర్వేద విదః"

నాలుగువేదములలో ఆయుర్వేదవేత్తలు ఏ వేదమును తెలుపు
చున్నారు అని ప్రశ్నవేసుకొని

"తత్రభిషజాపృష్టే నైవం చతుర్ణామృక్సామ
యజురథర్వవేదానా మాత్మనోధర్వవేదే
భక్తిరాదేశ్యాః వేదోహ్యాధర్వణః స్వస్త్యయన
బలిమంగల హోమనియమ ప్రాయశ్చిత్తోప
వాసమంత్రాది పరిగ్రహాచ్చికిత్సాహం ప్రాహ
ఋగ్వేదము సామవేదము, యజుర్వేదము

ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము అధర్వవేదమనెడి
నాలుగువేదములలో అధర్వవేదముననే వైద్యుడు భక్తినుంచ వల
యును. అధర్వవేదమునందు - శుభార్థముచేయబడు ఆరాధనలు,
బలులు, మంగళప్రదములగు హోమములు, నియమములు, ప్రాయ
శ్చిత్తములు, ఉపవాసములు, మంత్రములు, మున్నగువాటితో ఆయు
ర్వేద చికిత్స తెలుపబడినదని తెల్లముచేయబడినది చరకమున
సుశ్రుతసంహిత సూత్రస్థానమున-

ఇహాల్వాయుర్వేదం నామోపాంగ మధర్వ వేదస్యాను
త్పాద్యైవ ప్రజాః శ్లోకశత సహస్రమధ్యాయ సహస్రంచ
కృతవాన్ స్వయమ్భూః...."

విధాత ప్రజలను సృజించుటకు ముందరనే లక్షశ్లోక పరిమితంబై

వేయి అధ్యాయములు గలదైనది అథర్వవేదమున కుపాంగమైనదిగా దేనినివచించెనో అదియే ఆయుర్వేదముగా ప్రాచుర్యమందినది.

ప్రజలను సృష్టించుటకుముందే ఆయుర్వేదమావిర్భవించిన న్నది. విజ్ఞులు గ్రహించవలసిన ముఖ్యవిషయం.

ఆయుర్వేదము అష్టాంగవిలసితము. ఆయుర్వేదమున రోగ పరీక్షలు ఎనిమిది రకములు. వీటినే అష్టస్థాన పరీక్షలందురు. అందు నాడీ పరీక్ష ప్రధానమయినది.

"వాతనాడీ భవేద్బ్రహ్మాపిత్తనాడీచ శంకరః శ్లేష్మనాడీ భవేద్విష్ణు స్త్రిదేవానాడి సంస్థితాః"

వాతమునుచూపునాడి బ్రహ్మ యని-పిత్తప్రకోపమును జూపునాడి శివుడని-శ్లేష్మప్రకోపమును జూపునది విష్ణుస్వరూపమని ఆయుర్వేద విదుల తలంపు.

చరకసంహిత చికిత్సాస్థానమున పదునేడధ్యాయములు, సిద్ధి కల్పస్థానములు లభ్యపడలేదు కారణాంతరములవలన. అట్టిస్థితిని పంచనదపురవాసి, కపిలబలిపుత్రుడైన దృఢబలుడను ఆయుర్వేద వందితుడు చరకముకలుప్తమైనభాగములపూర్తిచేసి ఇలా పేర్కొనెను.

"...తచ్ఛంకరం భూతపతిం సంప్రసాద్య సమాపయత్. అఖణ్డార్థం దృఢబలోజాతః పంచనదేపురా. కృత్వా బహుభ్యః తన్త్రేభ్యో విశేషోంఛసిలోచ్చయమే....(చరకసిద్ధిస్థానం)

భూతేశుడగు శంకరునిగొల్చి ఆ మహాదేవుని అనుగ్రహము పొంది తానీపనిచేయగల్గితినని పేర్కొనినాడు.

యోగరత్నాకరం ప్రఖ్యాత ఆయుర్వేద గ్రంథం. యోగరత్నాకర గ్రంథకర్త ఆంధ్రుడు ఈతడు తన గ్రంథ ప్రారంభమును త్రిమూర్తుల తత్పత్నీ సత్పుతులమని చేయుచూ మొదలిడెను. మొదట శివుని వాకొనెను.

"శివంహరిం విధాతారం తత్పత్నీ స్తత్సుతాన్ గురూన్
నత్వాసమస్త ప్రత్యూహశాన్తయే మంగళాయత్"

కొట్టూరి బసవరాజను వైద్యవరుడు 'బసవ రాజీయము అను బృహత్ గ్రంథమును రచించెను. ఆంధ్రదేశమంతటా ప్రఖ్యాతినందిన గొప్ప చికిత్సా గ్రంథము. ఇది హిందీ, గీర్వాణభాషలలో కనువదించబడినది. యోగరత్నాకరంకూడా గీర్వాణీ గైకొన్నది. అసలు వీరిద్దరు గీర్వాణభాషయందే రచించిరి. బసవరాజు మధ్యమధ్య తెలుగు పద్యములు, గద్యమును రచించెను.

ఈ బసవరాజు ప్రతి అధ్యాయము ఆదియందునను మహేశ్వరుని క్రొంగొత్తవర్ణనలతో గీర్వాణమున నుతిసల్పి రచన ప్రారంభించెను. చరకమున వ్యాధిశమనకు మృత్యుంజయుని స్తుతిముందు వివరించ బడినది.

"శివునాజ్ఞలేనిదే చీమైనకుట్టదు" అన్ననానుడి ప్రతివారికి తెలిసినదే

"చిత్తంశివునిమీద. భక్తి చెప్పులమీద" చిత్తశుద్ధిలేని పూజల గూర్చి వాకొనునానుడి తెలుగునాట ప్రసిద్ధమేగదా!

తెలుగుదేశం శివభక్తిగలదేశం. "త్రిలింగ" పదమే తెనుగైనది.

శ్రీముఖలింగం, ద్రాక్షారామం, శ్రీ కాళేశ్వరం-లమధ్య గల దేశము గనుక త్రిలింగమయినది. కొందరు శ్రీ కాళహస్తి నిచేర్చి పేర్కొం దురు. ఏమైనా ఈశ్వరసంబంధమైనదేశం, ఈశ్వర, రఈశ్వర ప్రగడ, కాశీనాథుని, కాశీ, దూర్జటి, తెలుగునాటగలరు. శివకామేశ్వరరావు, శివరామారావు, శివరావు, నాగేశ్వరావు, నాగమల్లేశ్వరరావు, శంక రావు, శంకరశాస్త్రి, మహేశ్వరరావు, పార్వతీశ్వరావు, శివశంకర రావు ఇలా ఎన్నోరీతుల శివనామం గలవారెందరో తెలుగునాటగలరు కార్తికమాసమున శివరాత్రినాడు తెలుగునాట శివమయంగా గోచ రించును. మృత్యుంజయులు గొల్చినవారందరికి శుభాయురారోగ్యైశ్వ రములు ప్రాప్తించును. శంకరశాస్త్రిగారి శివపూజావివేచనమునెల్లరూ పఠించి పరమేశ్వరానుగ్రహపాత్రులగుదురు గాక!

## శివస్మరణం

శ్లో॥ ప్రాతఃస్మరామి భవభీతిహరం సురేశం।
గంగాధరం వృషభవాహన మంబికేశం॥

ఖట్వాంగశూల వరదాభయం హస్తమీశం।
సంసారరోగ హరణౌషధ మద్వితీయమ్॥

శ్లో॥ ప్రాతర్నమామి గిరీశం గిరిచార్ధదేహం
స్వర్గస్థితి ప్రళయమకారణ మాదిదేవం

విశ్వేశ్వరం విజిత విశ్వమనోభిరామమ్।
సంసారరోగహరణౌషధ మద్వితీయం॥

LXXV

శ్లో॥ ప్రాతర్భజామి శివమేకమనంత మాద్యం।
వేదాంత వేద్యమనఘం పురుషం మహాన్తం ॥

నామాదిభేదరహితం చషడ్భావశూన్యం।
సంసారరోగహరణౌష మద్వితీయం॥

శ్లో॥ ప్రాతస్సముత్థాయ శివం విచింత్య
శ్లోకత్రయం యనుదినం పఠన్తి॥

తేదుఃఖితం బహుజన్మసంచితం।
హిత్వాపదం యాంతితదేవ శంభో॥



# అభిప్రాయము

''జన్మానాం నరజన్మ దుర్లభం'' జన్మలలో మానవజన్మ దుర్లభము.

"దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనం తుదైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదేవతా"

అని బ్రాహ్మణ జన్మ ఔన్నత్యాన్ని విశ్లేషించారు.

"ముఖేమంత్రం హృదిధ్యానం మస్తకే లింగధారణం
శిఖాసూత్రం తదా భస్మహ్యేత బ్రాహ్మణలక్షణం"

అని శ్రుతులచే చెప్పిన విధంగా బ్రాహ్మణజన్మయందు లింగధారిజన్మ అత్యుత్తమము. బ్రాహ్మణులైన వారందరికి వేరెక్కడ తలచిన అక్కడ దైవారాధనచేసికొను అవకాశములేదు. దైవాన్ని తనతోగూడ తిప్పుకొని తానెక్కడ తలిస్తే అక్కడ ఆరాధించుకొను భాగ్యము ఒక్కలింగధారికే దక్కినది.

"సర్వం శివమాయంజగత్" అన్ని శాస్త్రములు చెప్పుకొనుచున్న అట్టి శివుని లింగరూపమున ధరించు అదృష్టముగలవాడు లింగధారి.

''జన్మదుఃఖం జగదుఃఖము, జాయదుఃఖం, పునః పునః'' అన్నట్లు దుఃఖభూయిష్టములోనూ ప్రపంచములో భయోత్పాతాలకు లోనుకాకుండా చిత్తశాంతికై ఎందరో భగవంతుని రూపాలనులాకెట్లుగా

ధరించుచున్నారు. లింగధారికి మాత్రము ప్రాణప్రతిష్ఠ చేయబడిన లింగమును ధరించే అర్హత కలిగినది.

పంచభూతాత్మకము, సప్త ధాతువులతో మలమూత్రభూయిష్ఠమయిన ఈ శరీరమును పంచగవ్యము, పంచామృతములతో శుద్ధిగావించి భస్మరుద్రాక్ష, ధారణాది కవచములనొసంగి, జలాధిధాన్యాది వాసముగావించి ప్రాణప్రతిష్ఠ చేసిన లింగము ధరింపచేసెదరు. అందువల్లనే "లింగ దేహిస దిశూచి'' అని చెప్పబడెను.

ఆధునిక సంస్కృతి సంసారములచే ప్రభావితులై స్వార్థాహంకారచిత్తులై భోగలాలసులై, నేడు దైవాన్ని విస్మరిస్తున్నారు. లింగధారణ అన్న భయముతోనో, నిర్లక్ష్యముతోనో, లింగాధారణ గావించుకొనుటకు వెనుకంజవేయువారిని చూచి విచలితులై శాస్త్రిగారు ఈ గ్రంథ సంకలనానికి కుపక్రమించారు. సామాన్యులకు అందుబాటులోలేని అనేక గ్రంథములలో నిక్షిప్తమైయున్న విశేషములను సేకరించి ''శివపూజా వివేచనము"నందు పొందుపరిచారు.

జలం పుష్పం తధిగంధ మధవా భస్మనిక్షేపత్
నివేదయే త్తతోభోజ్య మాచాణది సులింగకై:
త్రికాల మేకకాలం వా భస్మనావాసు పూజయేత్

ఒక ఆంగ్లేయ న్యాయాధిపతి శివుని "Poor Peoples God" అని వ్యాఖ్యానించారుట. అట్లే స్వామిమిమ్ము చీని చినాంబరములుగాని, సుగంధద్రవ్యములుగాని, పంచభక్ష్యపరమాన్నంబులు గాని కోరుటలేదు. మీ అవకాశము ననుసరించి ''ఓం నమః శివాయ" అను షడక్షరమంత్రముతో మూడుమారులు, మూడు ఉద్ధరిణ్ణలు నీరుంచి,

చిటికెడు విభూదిధరించిన పొంగిపోవు నీ భోళాశంకరుడు పుష్ప గంధ ధూపాదీపాదుల నిమిత్తము గూడా, విభూతిచే అర్చించవచ్చు. అవకాశమును బట్టి షట్కాలములో త్రికాలములలో అథవా ఏక కాలమో అర్చించాలని శాస్త్రిగారు సెలవిచ్చారు.

"నా రుద్రో రుద్రమార్చయేత్" అను శృతి ననుసరించి లింగ ధారియైన వానికి శివపూజ విశేషఫలముల నొసంగును.

ఈ శివపూజా వివేచనము సులభశైలిలో, సామాన్యుల సందే హములను తీర్చు విధముగా కూర్చబడినది.

ఈ పుస్తకమును "మానవజన్మ విశిష్టత" సంధ్యా వందనాది విధులు మొదలు, షట్త్రింశతత్త్వచాల్‌తో, అష్టావరణ, షట్చక్రి యాలవంటి అనేకవిషయాలను ప్రస్తావించుటయేగాక, నిమజ్జనము లఘుపూజా విధానము వంటి అతిచిన్న విషయములనుగూడా వివ రించి శివపూజ అంటే పెద్ద తతంగముగా భావించుచూ, భయసందేహా లతో నివృత్తి చేశారు.

పూజావిధానంలో అందుకుపలయు సాధన సంపత్తి ని గూర్చి గూడా వివరముగా తెలియచేశారు.

గోదానము, సోమవారవ్రత విధానమువంటి అనేక విషయము లను ఉద్బోధించారు.

ఈ పుస్తకమును కూలంకషముగా చదివిన ఎవరి సమయాను కూలముగా వీరు వారికినచ్చిన పద్ధతి నవలంభించవచ్చు.

శ్రీ శాస్త్రిగారు తమ ఆయుర్వేద విజ్ఞానాన్ని జోడించి మానవ

శరీరములో షట్చక్రమాలవునికి, నాడిమండలము, ప్రాణవాయువు, దీనివల్ల కలుగు ఆరోగ్యస్థితి, వంట, సమన్వయాములనేకములలో ప్రస్తావించారు.

శివదీక్షా తత్పరులైన వారికి, భస్మ రుద్రాక్షధారులై, పంచాక్షరి జపాశక్తులై వారికి ఇది మార్గదర్శకమగును.

10-4-94 హనుమంతరావు

# శైవ విజ్ఞాన ఖని

శివయోగులు డా॥ ముదిగొండ శంకరశాస్త్రిగారు రచించిన ఈ శివపూజా వివేచనము (ప్రథమభాగం)ను శివపూజకు సంబంధించిన అంశాల విజ్ఞాన సర్వస్వం అనవచ్చును. సంప్రదాయము లుప్త మవుతూ, సంప్రదాయజ్ఞులు కొఱవ అవుతున్న ఈ రోజుల్లో శివపూజా విషయకమైన అనేక విషయాలు శ్రౌతశైవులు తెలిసికోవడానికి ఈ గ్రంథం ఎంతగానో ఉపయోగపడ్తుందనడంలో ఎలాంటి సందేహమూ లేదు. విభూతిధారణ వైశిష్ట్యం నుంచి అంతరంగిక శివపూజవరకు అనేక విషయాలపైన సంక్షిప్తంగానే అయినప్పటికీ స్పష్టంగా డా॥ శంకరశాస్త్రిగారీ గ్రంథంలో తెలిపి పుణ్యం కట్టుకున్నారు. ఎంతో కష్టంతో సిద్ధించిన ఈ మానవజన్మ ఫలవంతమయి సదానంద రూపమైన మోక్షమును పొందడానికి శివపూజ ఎంతో శక్తివంతమైన సాధనా మార్గం. ఆ మార్గంలో నిష్ణాతులైన పెద్దలు డా॥ శంకర శాస్త్రిగారు ఈ గ్రంథంలో శివపూజా సంబంధమైన అనేక అవసర విషయాలను వివేచించడం గొప్ప పుణ్యకార్యం. సంసారంలో ఉంటూనే శివపూజచేత శివాద్వైత సిద్ధిని భక్తులు పొందడానికి తోడ్పడే ఉత్తమగ్రంథం ఇది.

ఆధ్యాత్మిక మార్గంలో పయనిస్తున్న సాధకులకు ఏ పనిచేసి నప్పటికీ తెలిసిచేయడంవల్ల ఎక్కువ ప్రయోజనం సిద్ధిస్తుంది. మంత్ర జపం చేసే సాధకుడు మంత్రార్థాన్ని తెలిసి చేసినప్పుడు ఎక్కువ ప్రయోజనాన్ని పొందుతాడు. అట్లాగే విభూతిధారణవల్ల, పీఠపూజ,

ఇష్టలింగపూజ మొ॥న వాటిని తెలిసికొని చేసినప్పుడు అవి అత్యంత ప్రయోజనకరాలవుతాయి. డా॥ శంకరశాస్త్రిగారు సాధకు లకు ఇలాంటి అనేక విషయాల అంతరార్థాన్ని, వాటివలన కలిగే ప్రయోజనాలను సులభశైలిలో ఈ గ్రంథంలో తెలిపారు.

ప్రతిమతానికి కొన్ని కొన్ని విశిష్ట సంప్రదాయాలు, జీవేశ్వరుల సంబంధాన్ని గ్రహించడానికి ప్రత్యేక పారిభాషిక శబ్దాలూ ఉంటాయి. శ్రౌతశైవం వైదికమార్గంలోని ఒక విశిష్టశాఖ. భక్తి జ్ఞాన మార్గాలను విశిష్టంగా ముడివేసిన తత్త్వదర్శనం ఈ మార్గంలో కన్పిస్తుంది. భక్త మహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణు, ఐక్యస్థలములన్న షట్ స్థలములు, షట్ చక్రస్థిత సద్యోజాతాది షణ్ముఖములు, క్రియా శక్త్యాది షట్‌శక్తులు, ఆచారాది షల్లింగములు మొ॥నవి ఈ మత శాఖలో ఏర్పడిన విశిష్ట 'దర్శనములు'. వీటిని తెలిసికొనకుండా ఈ మతంలో సాధన చేయడం అసాధ్యం. గురువు శిష్యునకు శాంభవ దీక్ష నిచ్చినప్పుడు, శక్తిపాతాన్నికూడా చేస్తాడు. ఈ శక్తిపాత ప్రక్రియను వ్యవస్థా బద్ధం చేసినది శ్రౌతశైవమే. క్రియాదీక్ష మంత్ర దీక్ష వేదాదీక్షలచేత సాధనచేయించడంద్వారా స్థూలసూక్ష్మకారణ దేహాలను, కార్మిక, మాయిక, ఆణవరూపంలోని మలత్రయాన్ని దగ్ధం చేయిస్తాడు గురువు. ఇట్లా సాధకునికి పరమ ప్రయోజనాన్ని కల్గించే గురుశిష్య వ్యవస్థ ఈ మతంలో శివాద్వైత సిద్ధిని పొందడం కోసం ఏర్పడింది. ఈ రహస్యాలన్నీ ఈ గ్రంథంలో డా॥ ముదిగొండ శంకరశాస్త్రిగారు సాధకులకు ప్రేరణ కలిగించే పద్ధతిలో సమకూర్చారు. ఇంతేకాకుండా మంత్రోపదేశానికి, లింగధారణకు ఏయే తిథులూ, మాసాలూ శుభప్రదాలోకూడా తెలిపి జ్ఞానాన్ని అందరికీ శాశ్వతంగా అందుబాటులోకి తెచ్చారు శాస్త్రిగారు.

vi)

ఈ గ్రంథం శివపూజకు సంబంధించినదే అయినప్పటికీ, ప్రసక్తంగా ఆయా సందర్భాలలో గాయత్రీ మంత్రం నిత్యానుష్ఠానం ఎందుకు చేయాలి? సోమవారవ్రతనిత్య అనుష్ఠానంయొక్క ప్రాశస్త్యం ఏమిటి? గోసేవ-గోదాన వైశిష్ట్యం ఏమిటి? ఆచమనం అంటే ఏమిటి? దానివల్ల కలిగే సత్ఫలితాలేమిటి? కలశపూజ ఎందుకు? ఇట్లాంటి ప్రయోజనకర విషయాలన్నింటినీ డా॥ శాస్త్రిగారు వివరించారు. ఇంతేకాకుండా చిన్న చిన్న విషయాలను- అంటే శివపూజకు కావలసిన ద్రవ్యాల పట్టికలాంటి వాటినికూడా శాస్త్రిగారీ గ్రంథంలో పొందుపరిచారు. చివరకు విభూతిని తయారుచేసే విధానాన్నికూడా తెలిపారు! ఇదంతా ఎందుకు రాశారు? అంటే ఇవన్నీ సంప్రదాయంలోంచి లుప్తమయి ఒక శూన్యస్థితిలోకో, వ్యతిరేక స్థితిలోకో ఈ మతస్థులు జారిపోతున్నారు. అట్లాంటి ఈ సంధియుగంలో సంప్రదాయ పరిరక్షణ చేయడానికే ఇదంతా. మహావిద్వాంసులు, శివయోగులు అయిన ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారి సుపుత్రులు కావడం శాస్త్రిగారికి జన్మచేత సిద్ధించిన గొప్పవరం. మతపరమైన సంప్రదాయం వారింట్లో. వారి మేనమామల గృహంలోనూ, వారు అట్టి పెరిగిన ఓరుగల్లు నగరంలోనూ, దండిగా ఉండడంవల్ల కూడా ఏతద్విషయాలు వారి రక్తనిష్ఠ గుణాలయినవి. పోగాకాల ప్రభావంచేత శ్రౌతశైవులలో ఏర్పడుతున్న మతరాహిత్య స్థితి లేక అన్యమతాకర్షితులవడం అన్నవి వారిని కలిచివేసి ఇటువంటి అత్యంత ప్రయోజనకరమైన చక్కని సాధనా గ్రంథాన్ని భక్తి ప్రపత్తులతో రచింపజేసింది. ఇది కేవలం పరమేశ్వరానుగ్రహంచేత సిద్ధించిన సత్ఫలం. వారి గ్రంథంలోనే తెలిపిన ద్వాదశాచార్యుల కృపాఫలం ఇది.

ఇంత ప్రయోజనవంతమైన గ్రంథాన్ని పదవీ విరమణానంతరం

డా॥ ముదిగొండ శంకరశాస్త్రిగారు రచించి తన మతస్థుల సంప్రదాయాన్ని నిలబెట్టడానికి పూనుకొన్నందుకు శ్రౌతశైవులైన సాధకులు, శివభక్తులు వారికి ఋణగ్రస్తులు. ఈ ఋణం నిజంగా తీర్చలేనిది. ఇంకా నాలుగు కాలాలపాటు శ్రీ శంకరశాస్త్రిగారిల్లాంటి సత్కార్యాలు చేయగలిగే శక్తినీ, శాంత చిత్తాన్నీ పరమశివుడు వారికి కలిగించాలని పరమేశ్వరుణ్ని మనసారా ప్రార్థిస్తూ

విధేయుడు

ముదిగొండ వీరభద్రయ్య

కేంద్ర విశ్వవిద్యాలయం

హైదరాబాద్.

హైదరాబాద్,

27-3-1994.

# విషయసూచిక

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 7 | ష్వంసక్త ! | ష్వసక్త! |
| 13 | 20 | షట్త్రంశ | షృట్త్రింశ |
| 14 | 1 | ష త్రిం | షట్త్రిం |
| 65 | 5 | సాధనము | ధారణము |
| 92 | 5 | క్షమాస్తోత్రము | క్షమాపణస్తోత్రము |
| 14 | 7 | 41 | 14 |
| 128 | 12 | వైతమపరం | వై అతఃపరం |
| 137 | 15 | ఇష | ఇహ |
| 154 | 7 | లోజామ్ | లోజాను |
| 154 | 19 | ధ్యాం | య |
| 157 | 13 | స్వీకురుష్వం | స్వీకురుష్వ |
| 158 | 18 | యోగగుకు | యోగురు |
| 159 | 15 | శివసన్నిదేజ | శివసన్నిదౌజపతి |
| 161 | 4 | షట్త్రింశత్వ | షట్త్రింశత్ తత్వ |
| 163 | 1 | సందారియ | సంధారయ |
| | 14 | గంధాంత | గంధాక్షత |

## సంక్షిప్త పరిచయము

మొక్కులిడుదు సర్వమునకు సర్వాత్మకు శంకరునకు
అతనికింకరులకు
నీదు పాదములకు నిత్యంబు మ్రొక్కెద పాపభయవిభంగ
భావలింగ నిలువ
నీదు నన్ను నిమిషంబు నీమాట, దానికొఱకు పలుకబూని
నాను ఘనత
కొఱకు గాదు నేపలుకుట ॥అఖిలజీవసంగ । ఆత్మలింగ ॥

శంక బట్టకండి శాస్త్రజ్ఞుదను గాను పంకలెంచకండి
వైరమునను
మనసునిల్పి దీని మర్మంబు తెలియండి ॥అ॥ఆ॥

నాకు భయము లేదు నన్ను మీరేమన్నను
వారు వీరందరు నాకు ఆత్మప్రియులు
ఉన్నదున్నయటుల ఊహించి చెప్పెద ॥అ॥ఆ॥

జనన మరణమనెడి జాడ్యంబు మాన్పంగ
మందు ఇంతకంటె మహిని లేదు
తిన్న వారికెల్ల తీరును రోగంబు ॥అ॥ఆ॥

## Lxxxxi

మద్గురుండు యనెడి మంచివైద్యునిచేరి,
పరమభక్తియనెడి పద్యముండి
దీక్ష (శాంభవి)యనెడి మందు తినవలె, సుజనుండు ॥ఆ॥ఆ॥

దినము దినము తిన్న, తిన్న వారలకెల్ల
నొంటబట్టి, యున్న రోగమొదలగొట్టి
కపట జన్మవ్యాధి, కానరాకను జేయు
అఖిల జీవనసంగ, ఆత్మలింగ॥

# శివపూజా వివేచనము - ముఖ్యాంశ వివరణము

## 1. మానవజన్మ - దాని విశిష్టత

సకలస్థావర, జంగమ రూపజన్మలలోకెల్ల, మానవజన్మ అత్యుత్తమమైనది. మానవునకు పరమేశ్వరుడు, సమ్యక్ మనోబుద్ధుల ద్వారా సర్వవిషయములను వివేకంతో వివేచనము చేసుకొని, హంస ఏవిధంగా జలమును వేరుచేసి క్షీరమును మాత్రమే స్వీకరిస్తుందో, (క్షీరజలన్యాయము) ఆ విధముగా ధర్మాధర్మములను, మంచిచెడ్డల నుండి మంచిని, ధర్మబద్ధమైనదానినే తెలుసుకొని స్వీకరించే శక్తిని ప్రసాదించాడు. సంచిత విశేషపుణ్యఫలంగా, కొన్నివేలజన్మల అనంతరం దుర్లభమైన అత్యున్నతమైన మోక్షసాధనకు అతిసమీపమైన మానవ జీవిత అవకాశం కల్పించాడు. మానవజన్మ ప్రాశస్త్యమునుగూర్చి భగవత్పాదులు శ్రీశంకరాచార్యులు ఏమి సెలవిచ్చారో చూడండి.

''జంతూనాంనరజన్మ దుర్లభమతః
పుంస్త్వం, తతోవిప్రతా
తస్మాద్వైదికధర్మమార్గపరతా,
విద్వత్త్వమస్మాత్పరం !
ఆత్మానాత్మవివేచనం,

స్వానుభవో, బ్రహ్మాత్మనా
సంస్థితి, ర్ముక్తిర్నో శతకోటిజన్మసుకృతైః
పుణ్యైర్వినాలభ్యతే"

ఈ నరజన్మయందు పురుష శరీరప్రాప్తి దుర్లభము. పురుష శరీరప్రాప్తికల్గిననూ, బ్రాహ్మణత్వ విశిష్ట పురుషశరీరము దుర్లభము. బ్రాహ్మణత్వ విశిష్టపురుషశరీరము కల్గినను వేద ప్రతిపాద్యాధ్యయనాది, షట్కర్మమార్గ సనాతనధర్మ పరాయణతకల్గుట దుర్లభము. వైదికధర్మాచరణము కల్గిననూ, విద్వత్వము (పరోక్షజ్ఞానము) కల్గుట దుర్లభము పరోక్షజ్ఞానముకల్గిననూ, ఆత్మానాత్మ వివేచనము కల్గుట (నిత్యానిత్యవస్తువివేచనముకల్గుట) దుర్లభము, అట్టి వివేచనము కల్గిననూ ఆత్మయొక్క యదార్థజ్ఞానము (అపరోక్షజ్ఞానము) అనగా ఆత్మానుభవము కల్గుట దుర్లభము. ఆత్మానుభవము కల్గిననూ బ్రహ్మ రూపమునుపొంది (శివరూపమునుపొంది) నిరంతరము, నిరంతరాయముగా ఆత్మస్థితుడై, సంపూర్ణజీవన్ముక్తి అవస్థనుపొంది ఉండుట అత్యంత దుర్లభము. నూరుకోట్ల జన్మలయందు చేసుకొన్న పుణ్య పరిపాక ఫలముగాగాని, మోక్షము లభింపదు. (వివేకచూడామణి) మరియు దేవతలుగాని మానవులుగాని, క్షుత్ పిపాసా, శోకమోహ జననమరణ రహితులై మోక్షముసాధింపవలెనంటే, అది మానవ జన్మముద్వారానే సాధ్యపడుతుంది.

ఆ పరమేశ్వరుడు మనకు కాలుష్యంలేని కల్మషము తెలియని బ్రతుకును ప్రసాదించాడు. దానితోపాటు అతి ఆకర్షణీయంగా, అందంగా ఉల్లాసమును, ఉత్తేజమును, మరుపలేని సుఖమును కల్గించుభోగసాధన వలయాన్నికూడా మనచుట్టూ సృష్టించాడు. భగవత్ప్రసాదిత సుమనోబుద్ధులతో, వివేకంతో, ఆ

మాయామోహములకు బలికాకుండా చూచుకొని, నిత్యము నిరంతరాయమైన ఆనందప్రాప్తిని పొందుటకు, ఈ మోహవలయమును ఛేదించితేనే, పరమపదసోపానమును (ఆ మోక్షధామమును) చేరకల్గుతాడు. కావున సత్వగుణములైన శాంతము, బ్రహ్మచర్యము, ఓర్పు, సత్యము పలుకుట, అహింస, ఇంద్రియనిగ్రహము, దానశీలత, సర్వభూతములయందు సమదృష్టికల్గి, భగవద్భక్తులైన సాధుజన సత్సాంగత్యముతో నిత్యము జీవించుటద్వారానే మోక్షకాంత మోహితయై మానవునకు వశమవుతుంది. కావున మానవుడు అట్టి ఉత్తముడుగా ఈ ప్రపంచములో తయారుకావటం మానవుని కనీసధర్మము. తన ఆదర్శ జీవనముద్వారా మానవాళికి చిత్తశాంతి సౌభాగ్య ప్రదాతగావాలి.

ఎ) దుర్జనులై, స్వార్థ జీవనవ్రతాదులై, అహంకార సౌధాన్ని నిర్మించుకొని, వంచకరూపులై, మాయాలోభులై, మోసగించుటయే జీవనధర్మమై మోసానికి మారుపేరై, ఇతరులసుఖాన్ని సహింపలేక, తమ దుఃఖాన్ని ఇతరులపై రుద్దుతూ జీవిస్తూ, పాములా కరుస్తూ, తేలులాగా కుట్టుతూ, జీవించే దుష్కర్మానుష్ఠాన పరులుకాకూడదు.

బి) అయోమయ జీవులై, మనస్సుకు దాసులై, కోరికలకు దాసులై పరిసరాలకు తలవంచుతూ, ఒకక్షణం మధుర పదార్థములమీద, మరొక క్షణం మలినపదార్థములపైన వ్రాలుతూ జీవించే ఈగలాంటివారై, ఎటు గాలివస్తే అటు ఎగిరిపోయే పులి విస్తరిలాంటివారు కాకూడదు. ఈ మిశ్రమ ధర్మానుష్ఠానపరులు ప్రతిక్షణం ఆత్మవంచన చేసుకొంటూ జీవించటం మానవజీవితానికే కళంకము.

సి) మానవుడు నిత్యము చిత్తశాంతికి దూరుడై కుడితిలోపడ్డ ఎలుక లాగా, గిలగిలకొట్టుకుంటూ, కృతజ్ఞతను మరచి, మంచిని మరచి వంచనను పంచుటకే సిద్ధపడ్డాడు పాధ్యతను విస్మరించి, బల హీనతలకు దాసుడైనాడు. తాత్కాలిక సుఖమునకై దుఃఖకారక మైన ఇంద్రియ విషయజీవన మాధుర్యంలో మునిగి తేలుతూ శాశ్వత శాంతికి దూరుడై, ప్రగతిమార్గమునకు అతి దూరుడై నాడు తిరిగి ఇవ్వడంలోగల అధికశోధను చేకూర్చుకొని, ఉత్త ముడుకాలేక, గ్రహించినదానినే యథాతథంగా అందిచే మధ్య ముడుకాలేక, పరమేశ్వర ప్రసాదిత దుర్లభమైన మానవజీవి తాన్ని పాడుచేసి అందించే అధముడుగా మిగిలిపోయాడు.

(చంద్రభాగా నదీతీరాలు) దీనికి పరిష్కారము ఏమిటి? సత్క ర్మానుష్ఠానపరులై, కర్మనాశనమునుకల్గించి, చిత్తశాంతిని ప్రసారించే సులభ, సుగమ, శీఘ్రఫలదాయి అయిన అడుగులదాటియే ఏకైక మార్గము. అదియే నిత్య శివపూజాచరణము. మహామనీషి ధూర్జటి తమ కాళహస్తీశ్వర శతకంలో ఇట్లు తెలిపినారు.

"సంపద్వర్గము ద్రాలద్రోలి, రిపులన్ జంకించి,
యాకాంక్షలన్ దంపుల్వెట్టి కళంకముల్ నఱికి,
బంధక్లేశదోషంబులన్ చింపుల్‌చేసి,
వయోవిలాసములన్ సంక్షేపించి,
భూతంబులన్ చెంపల్వేయక
నిన్నుగానన గునా? శ్రీకాళహస్తీశ్వరా.
ఈ పనులు ఎన్నడో చేయుదుమన్న అట్లుగాదు సుమా!

5

"దంతంబుల్పడనప్పుడే
తనువునందార్ఢ్యంబు నున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడే,
జరాక్రాంతంబు గానప్పుడే
వింతల్మేన జనింపనప్పుడే,
కురుల్వెల్వెల్ల గానప్పుడే
చింతింపన్ వలెనీ పదాంబుజములన్
శ్రీకాళహస్తీశ్వరా :

## 2. సంసారం సాగరం దుఃఖంకాదు. వివేకంతో, అమృత, ఆనందమయ మవుతుంది.

సంసారం సాగరం దుఃఖం అని పెద్దలు చెప్పుతారు స్త్రీపురుషలిరువురు కర్మజీవులే. వారి వారి సంచితకర్మల ననుభవించుటకై జీవిత చక్రంలో పుట్టుతూ, చస్తూ ఉంటారు కర్మక్షయం కాగానే మోక్షలబ్ధి కల్గుతుంది. స్త్రీ పురుషులకు, జనన మరణ వివాహములు భగవన్నిర్ణయం ప్రకారమే జరుగుతవి. అందే పురుషునియొక్క- పూర్వజన్మ పుణ్య పాపకర్మానుభవ శేషము అనుభవింపచేయుటకు పత్నీసుతాదిరూపంతో జీవితభాగస్వాములుగా అవుతారు. అట్లే స్త్రీచేసిన పూర్వజన్మ కృతపుణ్య పాపశేష ఫలమును అనుభవింపచేయుటకు పతి, సుతాదిరూపంలో జీవిత భాగస్వాములు అవుతారు. భగవంతుడు సర్వస్థావర జంగమములకన్న మిన్నగా మనోబుద్ధులను, విచక్షణాజ్ఞానాన్ని మానవునకు ప్రసాదించాడు. సద్బుద్ధికలవాడై సత్వగుణోపేతుడై, ధర్మనిరతుడై జీవించమని కాలుష్యం లేని జీవితాన్ని ఇచ్చాడు. మరియు మానవజన్మ అతిదుర్లభము అతి శ్రేష్ఠమైనది. మానవుని సుఖదుఃఖాలు, అతను మంచిబుద్ధితో వివేకంతో తన జీవిత భాగస్వాములతో, సంతానంతో ప్రవర్తించే తీరుతెన్నులపై ఆధారపడి ఉంటుంది. సంసారజీవితాన్ని సుఖమయము దుఃఖమయము చేసుకోవటం ఆ యా వ్యక్తుల మనోబుద్ధులు, విచక్షణాజ్ఞానంపై ఆధారపడి ఉంటుంది. జీవితాన్ని వివేకంతో సత్వ, సత్య, సద్బుద్ధులతో అమృతమయం చేసుకొనే అవకాశం భగవంతుడు మానవునకు ఇచ్చాడు. కాని ఏ మానవుడైతే దుర్బుద్ధితో, రజోతమో

గుణప్రేరితుడై విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయి, ఓర్పులేకుండా ప్రవర్తిస్తే నిజంగా ఆ జీవితం దుఃఖమయమే అవుతుంది.

ఆ పరమశివుని చూడండి, తలపై గంగ. ఒంటిలో పార్వతి దేవి, మెళ్లో వాసుకి అనే సర్పాభరణం, కుడిప్రక్కన సర్వగణాధిపతి అయిన విఘ్నేశ్వరుడు మూషికవాహనుడు (మూషికం సర్పమునకు ఆహారం) ఎడమప్రక్కన సర్వదేవసైనాధిపతి అయిన కుమారస్వామి మయూరవాహనుడు (మయూరమునకు సర్పము ఆహారం. అన్నింటికన్న మిన్నగా కంఠములో గరళమును ధరించాడు. అది పైకిపోయిన పైన ఏడులోకాలు, క్రిందకు వదలిన క్రిందఏడు లోకాలు భగ్గుమంటాయి. వృషభ వాహనుడు ఇన్నిరకముల విషమ పరిస్థితులున్నా, సృష్టి స్థితిలయములను క్రమబద్ధంగా చేయుచునే ఉన్నాడు. పై విషయం ఏమి తెలుపుతుందంటే మహాబుద్ధులను వివేకంతో, సత్వగుణోపేతుడై, ఆచరిస్తే జీవితంలో ఒడుదుడుకులు లేకుండా సక్రమంగా నడుపుకోగల్గుతాడు.

దేవరాక్షసులు దితి, అదితివల్ల కాశ్యపునికి కల్గినసంతానం. వారి మధ్య స్పర్ధలవల్ల, వారు అమృతాన్ని సాధించాలని అది ఎవరు సేవిస్తే వారు జరామరణములు లేని, అమరులు కాదలిచారు.

మేరుపర్వతాన్ని కవ్వంగా, వాసుకిని త్రాడుగా కట్టి సముద్ర మథనాన్ని ప్రారంభించారు. ముందు తీవ్రమైన విషముద్భవించింది. అందరు పారిపోతూ ఆ పరమశివుని వేడుకొంటే, లోకకల్యాణానికై ఆ పిచ్చిశివుడు ఆ విషాన్ని త్రాగి, కంఠములోనే నిల్పుకున్నాడు. తర్వాత ధన్వంతరి, లక్ష్మీదేవి ఐరావతము, అమృతం ఉద్భవించాయి. కాబట్టి, మానవజీవితసంగ్రామంలో కల్గే దుఃఖపరంపర అనే విషాన్ని ఓరిమితో దాటితే అమృతం లభిస్తుంది. ఆ విషాన్ని దాటాలంటే సుబుద్ధివివేకం

సత్వగుణసంపద ఓర్పు అవసరం. జీవిత భాగస్వాముల యొక్క బలహీనతలను ఆసరాగా తీసుకొని, రెచ్చగొట్టి అవస్థలపాలుకాకుండా వారియందలి సత్సంస్కారమును మంచితనాన్ని పెంచుతూ తెలివితో, వివేకంతో, ప్రవర్తిస్తే, జీవితం అమృతమయమవుతుంది. అట్లుగాక సంసార దుఃఖసాగరాన్ని తెలివిగా దాటటానికి ప్రయత్నించకుండా బలహీనతలకు దాసుడైతే, ఆ జీవితం దుర్భర నరకం, జీవితందుఃఖమయమవుతుంది.

అతిదుర్లభమైన విశిష్టమై లభించిన ఈ మానవజీవిత అవకాశ సమయమును నిత్య శివారాధన చేయుటద్వారా అమృతమయము. ఆనందమయముగా చేసుకోవటం మానవ కనీసధర్మం కూడా.

## 3. చతుర్విధ పురుషార్ధసాధనకు వలయు సామాగ్రి

ధర్మ, అర్ధ, కామ, మోక్షములనెడి చతుర్విధ, పురుషార్ధములను సాధించుటకు 'శరీరమాద్యంఖలు ధర్మసాధనం'. ఆరోగ్యవంతమైన శరీరమును (జీవాత్మయొక్క భోగసాధనము) ప్రప్రథమమున ఆత్యవసరము. ఆయుర్వేదీయ జీవనవిధానమును నిత్యం అనుసరించుట ద్వారా అది సాధ్యము, "నిత్యంహితాహార విహారసేవనసమీక్ష్య కారీ విషయేష్వసక్త; దాతాసమ; సత్యపరో క్షమావాన్ ఆప్తోపసేవీ భవత్యరోగ;" అనగా నిత్యము హితమైన ఆహారమును మితముగా సేవించుట ప్రతి విషయమును క్షుణ్ణముగా పరిశీలించి తదుపరి ఆచరించుట, విషయాసక్తుడుకాకుండుట, దాతృత్వగుణముకల్గి సర్వభూతములయందు సమదృష్టి కల్గియుండుట, సత్యవాక్పాలనము కల్గియుండుట-భూదేవి వంటి సహనశక్తిని కల్గియుండుట నిత్యము సత్సాంగత్యమునుకల్గి ఆప్తులను సేవించువాడు నిరోగ రోగరహితుడైయుండగలడు (అష్టాంహృదయము).

తదుపరి కార్యసాధన కల్గవలెనన్న 1. పురాకృత పుణ్యకార్య ఫలము. 2. స్వయంకృషి (ప్రయత్నము) 3. దైవకృప అను మూడును తప్పక సమకూడవలయును. దీనినే ప్రస్థానత్రయమని పేరు. అందు దుర్లభమైన మానవజన్మ కల్గుట పూర్వజన్మకృతపుణ్య కర్మఫలమే కదా :

మానవుడు తప్పక ఆక్రందనతో కృషిచేయుట అవసరము 'గాలిలో దీపముంచి దేవుడా నీ మహిమ' అనుభావనతో అకర్మణ్యుడు కారాదు. కాయ పండినప్పుడేకదా తినుటకు యోగ్యమగుచున్నది? ఈ

పూర్వజన్మ సుకృతము. స్వప్రయత్నము ఉన్ననూ తప్పక దేవాశీ ర్వాదమవసరము (అదృష్టము) (దైవకృప)ను నిత్యభక్తి శ్రద్ధలతో భగవంతుని కొలుచుటద్వారానే తప్పక సాధింపవలె. దానిని నిత్య గాయత్రాది మంత్రానుష్ఠానముద్వారా, భక్తితో భగవంతుని పూజించి అర్చించుటద్వారా సాధకుడు తప్పక సాధింపవలెను. పురాకృతపుణ్య కర్మఫలము, స్వయంకృషి, దేవాశీర్వాదమును (అదృష్టము) అను మూడును సమకూడినప్పుడు మాత్రమే కార్యసిద్ధి కల్గును. పూర్వ జన్మ కృతపుణ్యఫలముగా కొందరికి ఈ జన్మయందు కాకతాళీయ న్యాయముగా పనులు నెరవేరుట మనము చూచుచున్నము అనగా ప్రస్థానత్రయమును పూర్వజన్మయందే సంపాదించుటయే కారణము.

ఏ కార్యసాధన చేయవలెనన్న 2 మార్గములను అనుసరింపవలసి యున్నవి.

భజంతియే మహాదేహపరమాత్మా సముచ్యయా ।
కర్మణాపున సావాచా తే భక్తా ఇతి కీర్తితా ॥

**భక్తి మార్గము :-** సాధనయందు భక్తిమార్గము శ్రేష్ఠమైనది. ఈ కలియుగమందు ఆచరణీయము, "స్మరణం, కీర్తనం, పాద సేవనం ఆత్మార్పణం ఇత్యాది నవవిధ భక్తితో సర్వజగత్సృష్టికర్త యగు చిచ్ఛక్తియుత పరమశివుని నిత్యము కొలుచుట అత్యావ శ్యకరము. నిత్యము కృతజ్ఞులమై యుండవలయును.

**జ్ఞానమార్గము :-** వేదాధ్యయనాదులవల్ల శృతి స్మృతిపురాణేతి హాసములనుండి. నిశ్చితనిర్మల శోక మోహహర జ్ఞానసముపార్జనము చేసి నిత్యము షడక్షరీ ఇత్యాది మంత్రజప అనుష్ఠానము ద్వారా ఆ పరమేశ్వరుని కొల్చి మోక్షమును, సర్వకార్యసిద్ధిని పొందగలరు.

అయితే కార్యసాధనకు, మోక్షసాధనకు భక్తిజ్ఞానములనునవి రెండు చక్రాలై శ్రద్ధా అనే కాడితో, మనోబుద్ధులనే ఎద్దులతో, కర్మ అనే బండిని లాగుతే తప్పక అది మోక్షద్వారం చేరుతుంది. భక్తిలేని జ్ఞానము అహంకారానికి మూలము. జ్ఞానములేని భక్తి మూర్ఖత్వానికి కొలబద్ద. సన్మార్గములుగా మానవులకు ఉపయోగింపబడే వేదాంతము చతుషష్ఠికళలు, అష్టాదశ పురాణములు, శృతిస్మృతులు మొదలగు సాధనములు విశ్రాంతి సమయంలో చర్చించుకునే నిత్యకర్మలలో ఒకటై మానవులను మోసగించుటకు, కాలక్షేపమునకు, భుక్తిభోగ సాధనలుగా ఈ ఆధునిక కాలంలో ఉపయోగింపబడుతున్నది. దినదినం అతి కలతచెందుతున్న సమాజంలో భక్తుయుమాత్రము ఎంతకాలం తమభక్తిని కాల్పోచుండా ఉండగలరు? పిల్లలకు పాఠశాలల యందుగాని, కళాశాలలయందుగాని, సమాజమునందుగాని భక్తి జ్ఞానముల ఆవశ్యకతను గూర్చి తెలియచేయబడుటలేదు ఇంటియందు తల్లిదండ్రుల ప్రవర్తన, సరళియుఅంతే అందువల్ల పిల్లలు మూర్ఖత్వానికి, అహంకారానికి బానిసలై తమ జీవనగమ్యమును తెలుసుకొనలేక పోతున్నారు. ఇట్టి స్థితిలో మానవ అహంకార నిర్మూలనకై ప్రయత్నించాలి. హృదయంలో భక్తి నన్నగిల్లటంవల్ల అట్టి భక్తి జ్ఞానయుతవాతావరణం ఇండ్లలో, వ్యక్తులలో లేనందువల్ల అహంకారం ఉదయిస్తుంది. హృదయాలు భక్తితో పరమేశ్వరార్పణ బుద్ధితో నిండితేనే, ఈ అస్తవ్యస్త ధోరణులు సమసిపోతాయి. హృదయ కవాటం తెరచి మానవులయందు భక్తి, జ్ఞానములను వృద్ధిచెందించుటయే అహంకార, మూర్ఖత్వ, నిర్మూలనకు ఏకైకమార్గం.

మానవ జీవితప్రమాణం నూట ఇరవైఏండ్లు అందు నూరు సంవత్సర కాలము ఆరోగ్యవంతంగా ఉంటుంది. ఎంతోదుర్లభమైన

## 12

ఈ ఏకైక మానవ జీవిత అవకాశాన్ని ఈ జీవితమందే పురుషార్థ సాధకుడై సాధించాలి. వచ్చేజన్మ ఎటువంటిది వస్తుందో ఎవరికి తెలుసు ? అందువల్ల నిశ్చల కార్యోన్ముఖులై, నిష్కామ యుతులై ఈ భగవత్ప్రసాదిత మానవ అవకాశంలోనే సాధించాలి. మన కర్తవ్యం ?

## 4. స్థలమనగా నేమి? ఎన్ని విధములు?

శ్లో॥ యస్మిన్ బ్రహ్మణిలీయేత ప్రపంచస్త త్స్థలంవిదుః ।
మోక్షమార్గకసోపానం పరమాహేశ్వరాదృతం ॥

తా॥ ప్రపంచమంతయూ ఎవ్వనియందు లీనమగునో అట్టి మహాలింగమున జేరుటకు, సోపానము అనగా మెట్టు అని నిర్ణయింబడినది. ఇవి ఆరు-

శ్లో॥ ఆదౌభక్తస్థలం ప్రోక్తం తతో మాహేశ్వరస్థలం ।
ప్రసాద స్థలమన్యత్తు ప్రాణలింగస్థలం తతః ।
శరణస్థలమాఖ్యాతం షష్ఠమైక్యస్థలం విదుః ॥

ఇచ్చట శైవులు గ్రహించదగిన మరి కొన్ని విషయములు.

1. షట్స్థలములు- భక్త మాహేశ్వర ప్రసాద ప్రాణలింగ శరణ ఐక్యస్థలములు.
2. షట్లింగములు- ఇష్ట, ప్రాణ, భావలింగములే $3 \times 2$ ఆచార లింగ గురులింగ శివలింగ చరలింగ ప్రసాద లింగ మహాలింగములుగ విభజించబడినవి.
3. షడక్షరీ - ఓం నమశ్శివాయ
4. షడూర్ములు - జరా-మృతి-శోక-మోహ-క్షుత్-పిపాసాః ॥
5. షడధ్వలు - తత్వ-కళా-భువన-మంత్ర-పద, వర్ణాధ్వలు
6. షట్చక్రములు- ఆధార- స్వాధిష్ఠాన- మణిపూరక - అనాహత- విశుద్ధ ఆజ్ఞాచక్రములు.

షట్ $\times$ షట్ $=$ 36 షట్త్రింశ త్తత్వములు.

# 5. షట్త్రింశత్ తత్వోపచార, షట్త్రింశత్ తత్వసూచీ పట్టిక

| దేవోపచారములు | తత్వసంబందితము |
|---|---|
| 1. (భస్మ) ఆసనం | మనస్తత్వము |
| 2. ఆహ్వానము | బుద్ధితత్వము |
| 3. పాద్య, స్నానాభిషేకా, | జలతత్వము |
| 4. అర్ఘ్యము | గంధతత్వము |
| 5. ఆచమనము | రసతత్వము |
| 6. అంగార తాపము | తేజోతత్వము |
| 7. వస్త్రము | త్వక్ తత్వము |
| 8. భస్మానులేపము | పార్థివతత్వము |
| 9. యజ్ఞోపవీతము | విద్యాతత్వము |
| 10. గంధాక్షతా | ఘ్రాణతత్వము |
| 11. శుద్ధాక్షతాః | కాపతత్వము |
| 12. ఆభరణములు | కలాతితత్వము |
| 13. మాల్యధారణము | రాగతత్వము |
| 14. పుష్ప, బిల్వార్చన | సదాశివతత్వము |
| 15. ధూప సంజీరనం | వాయుతత్వము |
| 16. దీపం, హారతి నీరాజనం | రూపతత్వము |
| 17. ఛత్రము | శక్తితత్వము |
| 18. చామరము | స్పర్శతత్వము |
| 19. తాళవృంతం | నియతితత్వము |

| | |
|---|---|
| 20. దర్పణం | చక్షుతత్వము |
| 21. ఘంటానాదం | శ్రోత్రతత్వము |
| 22. శంఖనాదం | శబ్దతత్వము |
| 23. గీతగానము | మాయాతత్వము |
| 24. నృత్యము | మహేశ్వరతత్వము |
| 25. వాద్యము | జిహ్వాతత్వము |
| 26. ప్రదక్షిణము | పాదతత్వము |
| 27. నమస్కారం | పాణితత్వము |
| 28. స్తుతి | వాక్తత్వము |
| 29. దూప ప్రసారణం | ఆకాశతత్వము |
| 30. యాచన | ఉపస్థ తత్వము |
| 31. విజ్ఞప్తి | వాయుతత్వము |
| 32. నైవేద్యము | శివతత్వము |
| 33. తాంబూలము | ప్రకృతితత్వము |
| 34. విసర్జనము | అహంకారతత్వము |
| 35. వస్త్రప్రావరణం | శుద్ధ విద్యాతత్వం |
| 36. అంగనివేశనము | పురుషతత్వము |

# షోడశోపచార పూజ

| | | |
|---|---|---|
| 1. | భస్మాసనము | మనస్తత్త్వము |
| 2. | ఆహ్వానము | బుద్ధితత్వము |
| 3. | పాద్యము, స్నానము, అభిషేకము | జలతత్వము |
| 4. | అర్ఘ్యము | గంధతత్వము |
| 5. | ఆచమనము | రసతత్వము |
| 6. | వస్త్రము | త్వక్ తత్వము |
| 7. | భస్మానులేపము | పృధివీతత్వము |
| 8. | యజ్ఞోపవీతము | విద్యాతత్వము |
| 9. | గంధాక్షతలు | ప్రమాణతత్వము |
| 10. | శుభ్రాక్షతలు | కాలతత్వము |
| 11. | ఆభరణములు | కలాతత్వము |
| 12. | పుష్పార్చన, బిల్వార్చన | సదాశివతత్వము |
| 13. | ధూపము | వాయుతత్వములు |
| 14 | దీపము | రూపతత్వము |
| 15. | నైవేద్యము | శివతత్వము |
| 16. | వస్త్రప్రావరణము | శుద్ధవిద్యాతత్త్వము |
| | నిర్మాల్య విసర్జనము | అహంకారతత్వము |
| | అంగనివేశనం | పురుషతత్వము |

| కలావిభాగము | తత్వ విభాగము |
|---|---|
| శాంత్యతీతకలా అధిదైవము-శివుడు | 1) శివతత్వము<br>2) శక్తి తత్వము |
| శాంతికలా అధిదైవము - సదాశివుడు | 3) సదాశివ తత్వము<br>4) ఈశ్వర తత్వము<br>5) శుద్ధవిద్యాతత్వము |
| విద్యాకలా కారణ శరీరాత్మకము అధిదైవము - మహేశ్వరుడు | 6) మాయాతత్వము<br>7) కాలతత్వము<br>8) నియతితత్వము<br>9) కలా తత్వము<br>10) విద్యా తత్వము<br>11) రాగ తత్వము<br>12) పురుషతత్వము |

ము

విశేషాంశములు

కాశము, నిర్గుణము, శివతత్త్వము నాద
కాన్వితము. ఆది మధ్యాంత రహితము,
ము దృక్వాఙ్మనోగోచరా తీతమై,
స్వరూపమైన, అకార, ఉకార, మకార
ఓంకారము పరిపూర్ణము లింగస్వరూపము
సినవారలు సారూప్య సాయుజ్యములబొంది
మోహరహితులై నిరతిశయ ఆనందము
దురు. బైందవము, రోధము అను పాశద్వయ
కలిగియుందురు.

ద్యోజాతాది పంచ బ్రహ్మాత్మకమై, బైంద
రోధము అను పాశద్వయమును కలిగి
దురు (పైవలెనే).

హేశ్వర తత్త్వము, సకలము నిష్కలము
కను చెందినవారు సర్వజ్ఞులు, సుఖదుఃఖ
తప్పవు. బైందవ, రోధ, అణవ కార్మికము
అను నాలుగు మలములను కలిగియుందురు.
హ మలవివర్జితులు, ఏకెని విజ్ఞానకలలు
దురు.

షడధ్వావిభాగము

| | |
|---|---|
| కలాధ్వ | 5 |
| మంత్రాధ్వ | 11 |
| పదాధ్వ | 81 |
| వర్ణాధ్వ | 51 |
| తత్త్వాధ్వ | 36 |
| భువనాధ్వ | 224 |
| | 408 |

## విశేషాంశములు

4. ప్రళయకాలాత్మక విభాగమునందలి వారలు. మల పరిపాకమునొంది ముక్తి నొందుట కర్హులై, కర్మవశమున పుర్యష్టకముతో (సూక్ష్మ దేహముతో) కూడి, సమస్తయోనులయందు చచ్చుచూ పుట్టుచూ యుందురు.

5. పంచవింశతి తత్వాత్మకము, ఇందలివారలు కించిజ్జత్వము, కించిత్కర్తృత్వము గలిగి అస్వతంత్రులై సుఖదుఃఖమోహములు, పాశ పంచకము గలిగి మలమాయా కర్మలతో గూడి చచ్చుచూ పుట్టుచూ, పుణ్యాపాపముల నాచరించుచు స్థావర జంగమ రూపమున కర్మభోగము ననుభవింతురు. (శైవాగమములు)

*

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| నాయక అధిపతి | బ్రహ్మ | విష్ణు | రుద్ర | జీవాత్మ | పరమాత్మ | గురుమూర్తి |
| సద్యోజాత హంసలు | వామదేవ | అఘోర | తత్పురుష | [illegible] | సదాశివ | [illegible] |
| ౬౦౦ కాలము | ౬౦౦౦ | ౬౦౦౦ | ౬౦౦౦ | ౧౦౦౦ | ౧౦౦౦ | ౧౦౦౦ |
| ఘ ౧-౪౦ | ౧౬-౪౦ | ౧౬-౪౦ | ౧౬-౪౦ | ౮-౪౬-౪౦ | ౨-౪౬-౪౦ | ౨-౪౬-౪౦ |
| ఆధారలింగం | గురు | శివ | చర | ప్రసాద | మహాలింగ | పరశివ |
| భక్త | మహేశ్వర | ప్రసాది | ప్రాణలింగ | శరణు | ఐక్య | కైవల్య |

కాశీనాధుని సుబ్రహ్మణ్యం అయ్యవారు, సరళ తత్త్వార్థదీపిక, పుటలు-66, 67

## లింగధారి ప్రతిదినము షట్ స్థలముల నధిగమించుటయే శివ పూజ

శ్లో॥ ముఖేమన్త్రం హృదిధ్యానం మస్తకే లింగధారణం ।
శిఖాసూత్రం తథాభస్మ హ్యేతద్బ్రాహ్మణ లక్షణం ॥

1. భక్తస్థలము - స్నానానంతరము శుభ్ర వస్త్రముల ధరించి, భస్మ రుద్రాక్షల ధరించి లింగ నిమజ్జన మొనరించుట అనగా సమంత్రకముగాగాని లింగమును కడుగుట అనగా లింగరూపు డగు తాను స్నానముజేయుటయే అని భావము.

2. మాహేశ్వరస్థలము - సత్య శౌచాది లక్షణములు గలిగి ఆస్తిక బుద్ధితో లింగైక్యము నొందవలెనను శ్రద్ధతో (దృఢబుద్ధితో) 1. గురుధ్యానము 2. లింగమున గురు, శివుల దర్శించుట 3. లింగమును సమంత్రకముగ నభిషేకించుట 4. గురు శివ పాదతీర్థ సేవనము లింగముపై సజల భస్మముంచుట 5. షడక్షరీ మంత్ర అంగన్యాస కరన్యాసముల జరిపి 108 గాని యథాశక్తి 1000 గాని జపించుట.

3. ప్రసాదిస్థలము - తన ఎడమ చేతియందు అంగుష్ఠ తర్జనీ

లపు మధ్యను జూచునట్లు లింగముయొక్క సోమసూత్రము (పానపట్టముముంచుకొని తన హృదయమున జేర్చి లింగ వీక్షణము - లింగాగముల నేకీ భావము గ "శివోహం" అని దలంచుచూ కొంతసేపు ధ్యానించుట. 2. పిమ్మట ఇష్టలింగమునకు ధ్యానావాహన అభిషేకము భస్మ గంధ అక్షతపుష్ప బిల్వ ధూప - దీప నీరాజనాదులొానర్చుట అవసర లేక మహా నివేదనగానించి తత్ప్రసాదము లభించినదని తలంచుట.

శ్లో॥ సమర్పిత ప్రసాదైక కారణత్వాన్మ హేశితుః।
ప్రసాదత్వేన విఖ్యాతః పరమానంద దాయకః॥ ఇతి

4. ప్రాణలింగస్థలము - తన లింగమే తన ప్రాణము గాన తత్ప్రాణలింగ తృప్తికే నివేదన అని దలంపుచూ తత్ప్రసాద స్వీకరణయే గాని తాను భుజించుటగాదను శివ జీవైక్య స్థిర బుద్ధితో నుండుట.

5. శరణస్థలము - మహానివేదనానంతరము కర్పూరనీరాజనమిచ్చి శిఖికర్పూరన్యాయమును దలంచుచూ ఆత్మప్రదక్షిణధ్యాన అనుచిన్తనాదులొానర్చి శరణునొందుట.

6. ఐక్యస్థలము - శివోహమను బుద్ధితో ప్రసాద స్వీకరణము

గావించి (ముగించి) తాంబూలాదులర్పించి తన్మయుడై సమాధిస్థితి నొంది లింగ మును స్వాంగే నివేశయామి అనుచూ తన హృదయ పేటికయందు భద్రపరచుట.

## ఇదియే నిత్యసంపూజనము

ఇట్లు నిత్యము భక్తితో పూజించుటయే లింగాంగ సామరస్య విధి. మఱికొన్ని విషయములు పెద్దల వలనను, ప్రమాణ గ్రంథ ముల వలనను దెలిసికొనదగియున్నవి. ఇట్లాచరించులింగ ధారి సదాశుచి :

**శివపూజా విధానములు :-**

1) మంత్రయోగము (a) పీఠపూజ (b) ఇష్టలింగపూజ ఇది ప్రారంభకులు ఆచరించు, సగుణరూప బాహ్యపూజ 2) లయ యోగము 3) హఠయోగము (ఆసనయోగము) 4) రాజయోగము.

రెండు, మూడు, నాలుగు విధానములు నిర్గుణరూప అంతరంగిక పూజ. ఇవి క్రమశః అలవరచుకొనవలెను.

బహిరంగపూజ తిరిగి ఐదు విధములుగ వివరింపబడుచున్నది. 1) ఏకోపచారపూజ 2) పంచోపచారపూజా 3) అష్టోపచారపూజా 4) దశోపచారపూజ 5) షోడశోపచారపూజ 6) షట్త్రింశత్తత్వోప చారపూజా.

**శివపూజకు వలయు సామగ్రి :-**

1) కుందులు 2) వత్తులు 3) నెయ్యిలేక నూనె 4) కలశము 5)

అభిషేకపళ్లెము 6) పంచపాత్ర ఉద్ధరిణె 7) ఏకార్తి 8) వత్తుల పట్టుకాడ 9) ఛత్రము 10) చామరము 11) తాళవృంతము 12) దర్పణము 13) ఘంట 14) శంఖము 15) ఢమరుకము 16) నాగాభరణము 17) మారేడుదళములు 18) పూలు 19) విభూతి 20) గంధము 21) అక్షతలు 22) ధూపవస్తువు 23) ముగ్గుకు బియ్యపిండి 24) నివేదనకుద్రాక్ష, ఖర్జూరము, కిస్మిస్ గుడము పాలు మిశ్రి 25) తాంబూలము 26) పంచామృతములు 27) లింగవస్త్రము 28) చేయితుడుచుకొనేవస్త్రము.

# ఇష్టలింగ పూజా సులభపద్ధతి

భక్తి ముక్తి సాధనము - అలసట జన్మ హేతువు పరాశరస్మృతౌ॥

శ్లో॥ అథవా దేవమీశానం భగవన్తం సనాతనం ।
ఆరాధయే న్మహాదేవం భావపూతేన చేతసా ।
రుద్రాధ్యాయేన గాయత్ర్యా ప్రణవేనాథవా సుధీః ।
తతోం నమశ్శివాయేతి మన్త్రిణే నాథవాయజేత్ ।
సద్యోజాతాది భిర్మంత్రై ర్భవాదిభిరథాష్టభిః ।
కారణాగమే ॥

శ్లో॥ భవ శ్శర్వస్తథేశానః పశుపత్యుగ్రనామకౌ ।
రుద్రో భీమోమహాదేవః కథితా స్త్వష్టమూర్తయః
జలం పుష్పం తథాగంధ మథవా భస్మనిక్షిపేత్ ।
నివేదయే త్తతోభోజ్య మాచారాది సులింగకైః ॥
త్రికాలం మేకకాలంవా భస్మనావాసుపూజయేత్ ॥

తా॥ రుద్రాధ్యాయముచే గాని, సద్యోజాతాది పంచ బ్రహ్మ మంత్రములచేగాని, అష్టమూర్తి మంత్రములచేగా 1. భవాయ దేవానమః । 2. శర్వాయ దేవాయనమః । 3. ఈశానాయ దేవాయనమః 4. పశుపతయే దేవాయనమః । 5. ఉగ్రాయ దేవాయనమః । 6. రుద్రాయ దేవాయనమః । 7. భీమాయ దేవాయనమః । 8. మహాదేవాయ దేవాయ నమః అనిగాని ఓం నమశ్శివాయ అనుచూ గాని షోడశోప చారములను లేక దశ పంచోపచారముల విభూతితోనైననూ జరిపి పూజించిన పిదప నైవేద్యమును ఆచారాది లింగ ముల కర్పించి భుజించవలయును. (శైవధర్మ ప్రదీపిక)

# అష్టావరణములు

ఆవరణము అనగా రక్షక కవచములు. 1 విభూతి 2. రుద్రాక్ష 3. మంత్రము 4. గురువు 5. లింగము 6 జంగమమహేశ్వరుడు 7. తీర్థము 8. ప్రసాదములను అష్టావరణములు అని అందురు. ప్రతి నిత్యము అష్టావరణవిధిని శివపూజ చేయుటద్వారా ఉపాసకుని సంసారబిరుత్వముపోయి, చిత్తశాంతియుతుడై ధర్మ అర్థ కామ మోక్షములను చతుర్విధ పురుషార్థసాధనను సులభముగా శీఘ్రముగా చేయకల్గును శివసాయుజ్యమును సాధింపగలడు.

**1. విభూతి ధారణము విశిష్టత :** గోమయముచే చేయబడిన విభూతిని, ఎడమచేతియందుంచుకుని, సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రముచే అమృతత్వసిద్ధిని (ముక్తి దాయకముగా) పొందించి;

"సద్యోజాతం ప్రపద్యామి సద్యోజాతాయవై నమో నమః
భవేభవేనాతిభవే భవస్వమాం భవోద్భవాయనమః ॥

వామదేవాయనమో జ్యేష్ఠాయనమో శ్రేష్ఠాయనమో
రుద్రాయనమః కాలాయనమః కలవికరణాయనమో
బలవికరణాయనమో బలాయనమో
బలప్రమథనాయనమః,
సర్వభూత దమనాయనమో మనోన్మనాయనమః ॥

అఘోరేభ్యో థఘోరేభ్యో ఘోర ఘోరతరేభ్యః
సర్వేభ్యః సర్వసర్వేభ్యో నమస్తేఅస్తు రుద్రరూపేభ్యః

తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి
తన్నోరుద్రః ప్రచోదయాత్॥ ఈశానః సర్వవిద్యానాం
ఈశ్వరః సర్వభూతానాం బ్రహ్మాధిపతిః
బ్రహ్మణోధిపతిః
బ్రహ్మ శివోమేఅస్తు సదాశివోమ్॥"

కుడిచేతి బొటనవ్రేలుచే, ఎడమచేతిని మూసి, 'అగ్నిరితి భస్మ వాయురితి భస్మ' అను మంత్రముచేత ప్రణయకాల యజ్ఞ ప్రసాదముగా సిద్ధింపజేసి;

"అగ్నిరితిభస్మ వాయురితిభస్మ జలమితిభస్మ
స్థలమితిభస్మ వ్యోమేతిభస్మ సర్వగ్ం హవా
ఇదగ్ం భస్మ మాన్మన ఇత్యేతాని చక్షూగ్ంషి
కరణాని భస్మాని".

మానస్తోకే తనయే ఇతి మంత్రముచేత విభూతిని పవిత్ర్యము పొందించి;

"మానస్తోకే తనయే మాన ఆయుషి మనోగోషు
మానో అశ్వేషు రీరిషః। వీరాన్మానో రుద్రభామితో
వధీర్హ విష్మంతో నమసా విధే మతే"

విభూతిని తడిపి "త్రయంబకం యజామహే" అను మంత్రముచే మృత్యుంజయత్వమును పొందించి;

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం
ఉర్వారుకమివ బంధనాత్
మృత్యోర్ముక్షీయమామృతాత్

ఏతే సహస్రమయుతంపాశా
మృత్యోర్మర్త్యాయ హంతవే
తాన్ యజ్ఞస్య మాయయా సర్వానవయజామహే
మృత్యవేస్వాహా మృత్యవేస్వాహా ॥

పై విధముగా అమృతత్వముగను, త్రయంబకయజ్ఞ ప్రసాదముగను రుద్రత్వమును, మృత్యుంజయత్వమును పొందింపబడిన ఆ విభూతిని ఋగ్ యజు, సామవేద ప్రతిపాదితమై, జమదగ్న్యాది ఋషులతో అనుష్ఠింపబడినదిగా స్మరిస్తూ;

"త్రిరాయుషం జమదగ్నేః కశ్యపస్య త్రిరాయుషం
యద్దేవానాం త్రిరాయుషం తన్మేఅస్తు త్రిరాయుషం

అని పఠించుచూ, ఆ విభూతిని మూడు రేఖలుగ అడ్డముగ ఫాలభాగమున, నొసటను, శిరస్సునందు, కంఠమునందు, శిఖస్థానములయందు, వక్షస్థలమునందు, ఉదరమునందు, మోచేతులయందు మడికట్లయందు, ఊరువులయందు, మోకాళ్ళయందు, పాదముల పైన ధరించవలెను శరీరమందలి ప్రతిపరమాణువు శివమయమే కదా। అట్లు ధరించిన ఉపాసకుడు శివుడే అగుటను పసిమము ముఖము రెండు చేతులు, హృదయము, నాభి పాదములపై ధరింపవలెను.

శివుని అష్టావరణములలో విభూతిధారణము ప్రథమ ఆవరణము నిత్యము నిరంతరము విభూతిధారణము చేయుట వలన ఈ క్రింది ఫలితములు కలుగును.

భూతిర్భూతికరీ పవిత్రజననీ పాపౌఘవిధ్వంసినీ
సర్వోపద్రవనాశినీ శుభకరీ సర్వార్థసంపత్కరీ

భూత ప్రేత పిశాచ రాక్షస గదారిష్టాది సంహారిణీ
తేజోరాజ్యవిశేష మోక్షణకరీ భూతిస్సదా దార్యంతామ్

**2. రుద్రాక్ష ధారణము :** రుద్రనేత్ర సంభవితమైన రుద్రాక్షను ధరించుట శివునికి అత్యంత ప్రీతికరము. మనోవాక్కాయ కర్మల యందలి ఆణవ, కార్మిక, మాయాది మాలిన్యత్రయమును నిర్మూలించు శక్తి రుద్రాక్షకు కలదు. "న రుద్రో రుద్రమర్చయేత్", శివ స్వరూపుడైన రుద్రుని అర్చించుటకు ఉపాసకుడు రుద్రుడు కావలసి యున్నది. అని శృతి చెప్పుచున్నది. అజ్ఞానరోగ నివృత్తికై : భారతీయ మహర్షులు ప్రసాదించిన సిద్ధౌషధము ఈ రుద్రాక్ష 32 రుద్రాక్షలుగల మాలను కంఠమునందు ధరించి శివపూజచేసుకొనుట వలన ఉపాసకుడు రుద్రుడు అగుటయేకాక సర్వమోహక్లేశ రహితుడగును. రుద్రాక్షలలో ఏకముఖి, ద్విముఖి, చతుర్ముఖి మొదలుగా 18 రకములు గలవు. వీని ధారణము, అందరూ అనగా, కులమత వర్ణ, లింగ వయోభేదములేక ధరించవచ్చును. నిత్యము రుద్రాక్ష మాలను కాని, రుద్రాక్షను కాని ధరించి దానిని విభూత్యాది అష్టాంగ పూజచేసి, జపించిన పరమ మూర్ఖుడు జ్ఞానవంతుడుగను, భక్తిహీనుడు పరమ భక్తుడుగను, క్రమశః మారును ఇది ముక్తిదాయకము. సర్వ రోగహరణము. సర్వాభీష్ట సిద్ధిదాయకము. ఆ పరమశివుని కర్పించు అష్టావరణములలో రుద్రాక్ష ధారణము రెండవ రక్షకకవచము. రుద్రాక్షమాలయందు ముత్తెము, పగడము, స్ఫటికము, వైడూర్యము, బంగారు పూసలను చేర్చిన మాలతో జపముచేసిన విశేష ఫలము నొసంగును.

**3. షడక్షరిమహామంత్రము దాని విశిష్టత :** ఓం అనునాదము శివస్వరూపము. బిందువు చరాచర జగత్స్వరూపమైన శక్తి."అ"కార

"ఉ"కార, "మ"కార నాద బిందురూపమున "ఓంకారము సూక్ష్మ పంచాక్షరి అని చెప్పబడుచున్నది. ఇది జ్ఞానాంగము. యజుర్వేద రుద్రాధ్యాయ మధ్యగత "నమఃశివాయ" అను మంత్రము స్థూల పంచాక్షరి అని చెప్పబడును. సూక్ష్మ, స్థూల పంచాక్షరి సంపుటియే షడక్షరి మహామంత్రమయినది. సప్తకోటి మహామంత్రములకిది మూలము. మంత్రరాజము. అట్టి షడక్షరి మహా మంత్రముతో ప్రతి నిత్యము విభూతి, రుద్రాక్షధారియై శివపూజ చేయువానిని, పాశుపత దీక్షితుడు లేక శాంభవ దీక్షితుడు అందురు. ఆ పరమశివుని అష్టావరణములలో ఈ షడక్షరీ మంత్రజపము మూడవ ఆవరణము.

అనేక జన్మల సంచిత పుణ్యఫలముగ మానవ జన్మము, కోటి జన్మల సంచిత పుణ్యఫలముగ శివభక్తియు అబ్బును. శివలింగము మాతాపితా జీవాత్మల స్వరూపము. అట్టి లింగమును ధారణచేసుకుని; ప్రతినిత్యము అష్టావరణ పంచాచార విధిగా షడక్షరీ జపముచే శివ పూజ చేయుటద్వారా ఉపాసకుడు "లింగధారీ సదాశుచిః" అని చెప్ప బడును.

**4. గురువు :** మాయామోహరూప అజ్ఞాన నివృత్తికల్గించి, కైవల్యజ్ఞానమునుకల్గించి, మోక్షసాధనమైన శాంభవీదీక్షను ఉపదేశించు మహాత్ముడు శివరూప సద్గురువగును. ఇదినాల్గవ ఆవరణము గురుముఖతః సిద్ధింపనిది ఏదియు ఫలింపదు. గురువు, ఆత్మాశ్రమియై శివాచార పరాయణుడుగా నుండవలెను గురువుయొక్క వ్యక్తిగత గుణదోషములెంచక "ఏకలవ్యుడు ఎట్లు నిశ్చలభక్తితో సేవించుట ద్వారా విలువిద్యయందు అర్జునునికన్న విశిష్టుడైనాడో "అట్లే నిశ్చల భక్తి తత్పరుడై అటలశ్రద్ధాభక్తులతో గురువును సేవింపవలెను. నియమ సదాచారముతో చేయబడు మంత్రము మాత్రమే సిద్ధించును.

**5. శివలింగం :** మహాప్రళయ సముద్ర మధ్యమున మంటల జ్వాలలతో వెలుగునదియే శివలింగము. ఇది అష్టావరణములలో ఐదవది. శివలింగము గాయత్రీదేవి, వేదవేదాంగమములు, చరాచర ప్రాణులు, ప్రళయకాలమునందు ఈ శివలింగమునందే లీనమై, సృష్టి కాలమున, మఱలలింగమునుండియే ఉద్భవించును. ప్రణవము పీఠము గను, నాదము పిండముగ శివలింగ మేర్పడినది. బిందునాదాత్మక శివ లింగమున - బిందువు దేవిగాను నాదము శివుడుగను, బిందుస్వరూపు రాలగు అంబిక - జగన్మాతగను, నాదాత్మకమగు శివుడు జగత్పతి గను పేర్కొన బడుచున్నందున, శివలింగము మాతా పితృ స్వరూప మగుచున్నది. దీనినే భావలింగమని ప్రాణలింగమని, ఇష్టలింగ మని అందురు. ఇందు భావలింగమును ఆత్మభావనతోనే గుర్తింపవలెను. ప్రాణలింగమును, మనోధర్మమగు మంత్రమున నమువలననే తెలియనగును. ఇష్టలింగమును చూపులోనే గుర్తించి ఆరాధింపవలెను. తిరిగి భావ, ప్రాణ, ఇష్టలింగములు ఆచార, గురు, శివ, చర, ప్రసాద మహా లింగములని ఆరుగా, తెలుసుకోన వలెను. ఇష్టలింగమునందే శివధ్యాన పూజనముల నొనర్చు వారికి శివుడు శీఘ్రముగా ప్రసన్నుడగును. ఎన్ని ఇబ్బందులు కలిగినను శివలింగార్చనము మానరాదు.

**6. జంగమ (మహేశ్వరుడు) :-** పరమేశ్వరుని మొదటి రూపము శివలింగముకాగా, రెండవరూపము జంగముడు అని తెలియ వలెను. ఇది ఆరవ ఆవరణము. జంగమము, మాంత్రికము 2సహజము అని రెండువిధములు. మహేశ్వరులు ధరించు శివలింగములు, పీఠ పూజ్యమానమగు బాణలింగములు మొదలగునవి మాంత్రికములు. ఇక మహేశ్వరుడే సహజరూపుడని తెలియనగును. పరమేశ్వరుడు తన

యందు భక్తిగల మాహేశ్వరులను తనకంటె అధికులుగా భావించును. శివుడు భక్తులకామితములను నొసంగును. భర్గుడు భక్తపక్షపాతి.

**7. పాదతీర్థము :** ఇది ఏడవ ఆవరణము శివునియొక్కయు గురునియొక్కయు, మాహేశ్వరునియొక్కయు పాద తీర్థమును శిరస్సుపై చల్లుకొని, ప్రాశనము చేసిన అకాలమృత్యుహరము నానా విధ శరీరరోగహరము, సర్వపాపహతము.

**8. ప్రసాదము :** ఇది ఎనిమిదవ ఆవరణము గురు, లింగ, జంగములయొక్క భుక్తశేషము ప్రసాదమనబడును. శివ నివేదిత ముకానిది ప్రసాదము కాదు. శివ, గురు, చరుల ప్రసాదమును భక్తితో సేవించిన వారిపై శివానుగ్రహముశీఘ్రముగా కల్గును.

# పంచాచారములు (నిత్యజీవన విధానములు)

లింగాచారము, సదాచారము, శివాచారము, గణాచారము, భృత్యాచారము ననునవి- శైవశాస్త్రమున పంచాచారములనఁబడును.

1. లింగాచారము-తనకు గురుండొసఁగిన లింగమునకంటె నింకొక దైవము లేదను నిశ్చయము గలిగియుండుట.

2. సదాచారము-ధర్మము తప్పకుండ సంపాదించిన ద్రవ్యముతో గురు లింగ జంగముల నారాధించుట,

3. శివాచారము-సృష్టి స్థితి లయ తిరోధాన అనుగ్రహములు అను పంచకృత్యముల నాచరించు శివుఁడే పరబ్రహ్మము, ఆ దేవుని కంటె వేరొకగతి లేదను నిశ్చయము కలిగియుండుట,

4. గణాచారము-శివుఁడు శివధర్మము శివశాస్త్రము మొదలగు వాని యొక్క నిందను వినకుండుట.

5. భృత్యాచారము-శివలింగధారులై శివునారాధించు భక్తులకు నేను భృత్యుడనను నిశ్చయము గలిగియుండుట.

# మంత్రోపాసన - మోక్షసాధనయందు దానిపాత్ర

"దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనం తు దైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం, బ్రాహ్మణో మమదేవతా"

ఈ పిండాండ బ్రహ్మాండ సృష్టిని, ఆ పరమేశ్వరుడు లీలా మాత్రం గాసృష్టించాడు. సత్వరజస్తమోగుణ యుక్త జీవాత్మకు ప్రతిక్షణం నశించే స్వభావం, అచేతన మయినప్పుడు కుళ్ళి కృశించే స్వభావంకల ఈ శరీరాన్ని పుణ్యాపాపకర్మల భోగసాధనంగా చేకూర్చినాడు. కర్మఫలభోగము నశిస్తేనేగాని మోక్షము సిద్ధించదు. అప్పటివరకు పునరపిజననం పునరపి మరణం, చక్రంలాగా జరుగుతూనే ఉంటుంది. అయితే భగవద్దత్తమైన మనోబుద్ధులను వివేచన, విచక్షణలను, సద్వినియోగం చేసుకొంటే, సృష్టియందలి సర్వజంతు జాలమును తనొక్కడే నిగ్రహించి, సన్మార్గగామిగా చేయగలడు. సాధకుడు శ్రద్ధా భక్తులతో సజ్జన సాధుసాంగత్యంతో కూడి యున్నచో సత్వగుణములైన శాంతము, ఓర్పు సర్వభూతదయ ఇంద్రియనిగ్రహము అహింస సత్యవాక్పాలనము తపోధ్యానములు అతని యందు క్రమశః జనించి, మోక్షకాంతను మోహపరచి వశపరచుకోకల్గుతాడు. కాని రజోగుణములైన కామాది అరిషడ్వర్గము, రాగాది ఉపశత్రువులను జయింపలేక, నిత్యము మంత్రోపాసనచేయుట వల్ల, విశ్వామిత్రునివలె సృష్టికి ప్రతిసృష్టి చేయగలదేమోగాని, సర్వశక్తులను స్థంభింపచేయగలదేమో గాని, ముక్తి కాంత అతనికి ఎండమావులవంటిదే.

ఈ మానవజీవన ప్రమాణం నూరుసంవత్సరములు మాత్రమే.

ఈ మానవజన్మ అనేక వేల జన్మల పుణ్యఫల విశేషంగా లభించింది కదా! ఈ కొద్దికాలంలో, మానవజీవన ధ్యేయమైన మోక్షము సాధించ వలెనంటే పరమేశ్వరార్పణబుద్ధితో మంత్రోపాసనచేయుట ఒక్కటియే మార్గము. బ్రహ్మజ్ఞాన సంపన్నుడైన, నిత్యమంత్రానుష్ఠాన పరులకు మాత్రమే, మానవ జీవిత కాలము మోక్షసాధనముగా ఉప యోగ పడుతుంది.

**మంత్రము :** "మననాత్ త్రాయత ఇతి మంత్రః" మననము వల్ల నిత్యము జపించుటవల్ల రక్షించునది మంత్రము, మరియు జీవాత్మైక్యసంధానమును (మోక్షమును) కల్గించునది మంత్రము అని పేరు. సర్వజగత్తు మంత్రోపాసకునికి దాసోహం అవుతుంది. బ్రహ్మ జ్ఞానసంపన్నుడైన బ్రాహ్మణునకు సద్గురోపదిష్ఠ షడక్షరీ మంత్రో పాసకునికి, నిష్కామకర్మల నాచరించు సాత్వికునకు, మోక్షకాంత దాసురాలు అవుతుంది. అతను ఎట్టి ఇహపరభోగములకు చలించడు అణిమాది సిద్ధులు అతనిని చలింపచేయలేవు.

నిత్యవిభూతి రుద్రాక్ష దారణము, సద్గురోప దిష్ఠషడక్షరీ జపా చరణము, గురులింగ, శివలింగ చరలింగముల పూజించి అర్చించి, వారి పాద తీర్థప్రసాద స్వీకరణవల్ల నిరహంకారియై, ప్రపంచ మునకు చిత్తశాంతి ప్రదాత అవుతాడు. సర్వజగత్తునకు పూజ్యుడు సన్మార్గగామి విధాత అవుతాడు.

మంత్రమును రహస్యముగా ఉంచుకొని ఆచరింపదగినది. సద్గురోపదిష్ఠ మంత్రమే సత్ఫలమునిస్తుంది.

"ఆయుర్విత్తం, గృహచ్ఛిద్రం మంత్రమౌషధసంగమో।
దానమానావ మానాశ్చన వగోప్యామనీషిణ ॥

3)

మంత్రోపాసన కర్మక్షయ కరము కూడా;

హరిణాపి హరేణాపి, బ్రహ్మణాపి సురైరపి
లలాట లిఖితారేఖా పరిమార్తుం నశక్యతే"

ప్రారబ్ధం భోగతోనశ్యేత్, ఆగామితత్వదర్శనాత్
సంచితం ద్వివిధం ప్రోక్తం, తేద్వేష్టి హితవాదిన;

1. ప్రారబ్ధ కర్మానుభవము. బ్రహ్మద్విష్ణ్వాదులకు, దేవతలకు కూడా తప్పదు. నొసట వ్రాయబడిన కర్మవిశేషము అనుభవింపక తప్పదు.

2. "ఆగామి" రూపకర్మ, నిత్యమంత్రానుష్ఠానము వల్లను,నవ విధ భక్తితో శ్రద్ధగా ఏకాగ్రతతో ఆపరమేశ్వరుని ప్రార్థించుటవల్ల తత్వదర్శనముకల్గి, నశించును.

3. సంచితకర్మ, మనము నిత్యముచేయు పుణ్యకర్మ వల్ల పుణ్యము, ద్వేషము ఇత్యాదులవల్ల పాపకర్మమును నిత్యము సంచిత మగును కదా! పుణ్యకర్మల క్షయమువల్లనే మోక్షము సిద్ధించును. కావున మనముచేయు ప్రతికర్మఫలమును పరమేశ్వరార్పణచేయుట వల్ల, నిత్యము సత్యగుణ సంపన్నుడగుట వల్లను, సంచిత కర్మ క్షీణించును. అందువల్ల సంధ్యావందనము ప్రతినిత్యము త్రికాల ముల ఆచరింపవలయును. హృదయమును భక్తి జ్ఞానయుతముగా చేయుట వలన, మూర్ఖత్వము, అహంకారము నశించి, మోక్షసాధ నకు మార్గమేర్పడును.

# సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్ర విశిష్టత

ఈ సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రములు సప్తకోటి మహా మంత్రములలోను శ్రేష్టమైనవి. పంచాక్షరి, మోక్షసాధనకును, మరియు పంచబ్రహ్మ మంత్రములు, సర్వకార్య కారణరూపమైన అఘోర శివ రూపములు కలిగి, దుష్టశిక్షణ శిష్టరక్షణకొఱకై ఉద్దేశింపబడి నవి. దైవభక్తులు కానివారికి, భయంకరముగను, శివభక్తులకు అభయప్రదాయకముగాను ఈ మంత్రములున్నవి. సృష్టికి కారణ భూతములై పంచభూతాత్మకములై వున్నవి. శివుడు షట్త్రింశత్ తత్వయుతుడు. మాయామోహితుడైన జీవుడు కూడ షట్త్రింశత్ తత్వయుతుడే. విభూత్యాది షట్త్రింశత్ తత్వోపచారముల ద్వారా లింగాంగ సంధానము గావించి పూజించుటవలన భక్తుల హృదయ మందు పూజాసమయమున ఆవిర్భవించి శివపూజా శక్తిని కలిగించి భక్తులను హింసించు శత్రువులకు భయంకరుడై, క్రమశః కైవల్య జ్ఞానమును భక్తులయందు, మనోబుద్ధులను, నిర్మలముగా చేయుట ద్వారా కలిగించును. షడధ్వ శివసృష్టిలో నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి కళల దశలనుండి, కర్మబద్ధుడైన జీవుని, మాయ, కార్మిక, అణవమల రహితునిగా నిత్యానుష్ఠానము వల్ల చేసి, మోక్షప్రాప్తిని సులభతరముగ చేయగల్గిన మంత్ర రాజమిది. ఉపాసకునకు నిత్యము తోడునీడై, మంచి స్నేహితునివలె సన్మార్గగామిగా చేయును.

# నిత్యశివారాధన చిత్తశుద్ధి చిత్తశాంతిదాయకము

పరమాత్మ నిరాకార నిరంజన, నిర్గుణ చిదానంద స్వరూపుడై సత్వగుణ సంపన్నుడైన ఆ ఆదిదేవుడు పరమశివుడే. జీవుడు ప్రారబ్ధ, ఆగామి, సంచితములు అను త్రివిధ కర్మబద్ధుడు.

మనస్సు బంధమోక్ష హేతువు, చంచలము. ఈ మనస్సు సత్వగుణోపేతమైన, ఉపాసకుని వశమగును. అట్లుకాక రజోగుణయుక్తమైనచో మోక్షరహిత సర్వసిద్ధులు లభించినను, ఉపాసకునియందు గల కామాది అరిషడ్వర్గములను పెంపొందించి పతితునిచేయును. తమోగుణయుతమైన మనస్సునుగూర్చి ఇక చెప్పునదేమున్నది.

ఉపాసకుడు నిత్యము శివారాధనను అష్టావరణ పంచాచార విధిగా నవవిధభక్తితో ఆచరించవలెను.

బొమికెలు, మాంసఖండములు బొక్కలు
మురిగినడొక్క ప్రేగులున్,
చిమ చిమలాడు నెత్తురును, చీము
నరాలు పురీష మూత్రముల్,
అమరిన తోలుబొమ్మ యిది;
ఘనమైన సువర్ణఘటంబు కాదు.
దుర్భ్రమపడి మోసపోక త్రిపురారిని
కొల్చి తరించు చిత్తమా !

కాశీ, ప్రయాగ అలహాపురి, సింధు అయోధ్య తీర్థముల్
భాసర,కంచి, రంగపురి పర్వతద్వార పట్టణాది దిగ్దేశము
లెన్ని తిరిగినను, దేవుడు ఎక్కడ కానరాడు, ఆక్రంద
నమునందు కన్పడును రాన
పురారిని చేరి తరించు చిత్తమా!

## షట్స్థల బహిరంగ శివపూజావిషయ సంగ్రహము

దుఃఖమయ సంసారము ఎల్ల ప్రపంచిన అశాంతి, నిర్లిప్తతల వల్ల మానవుడు కృంగి కృశించి చిత్తశాంతి కరువై నిరాశాజీవనం గడపటం మనం చూస్తూనే యున్నాము. అట్టి భీరుత్వాన్ని పోగొట్టు కొని నిశ్చల కార్యోన్ముఖుడు కావాలంటే, చిత్తశాంతితో జీవనం గడపాలంటే, మోక్షసాధన సామాగ్రిలో శ్రేష్ఠమైన భక్తిమార్గము ద్వారా ఆ పరమశివుని అరదుగుల నాటపై పయనించి పూజించి, అర్చించుటయే ఏకైకసుగమ సులభమైన మార్గము.

## భక్తస్థలము - ప్రథమ సోపానము మొదటిమెట్టు దాని విశిష్టత

ఉపాసకుడు సదాచారములతో, నిత్యవిభూతి రుద్రాక్షధారియై, నిశ్చల, నిర్మల, శివభక్తి తత్పరులైన భక్తులను, నవవిధ భక్తితో (శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం సఖ్యతా ఆత్మనివేదనం) సేవించి తీర్థప్రసాదుల సేవించుట వలన

1. దుఃఖమయ సంసార భీరుత్వం నశిస్తుంది.

2. ఈ విషవలయ రూపసంసారమును దాటుటకువలయు శక్తి సామర్థ్యములను పొందగల్గుతాడు.

3. ఇనుము స్పర్శవేది స్పర్శవలన క్రమశః బంగారమైనట్లుగా దుష్ట శీలుడుదుర్మార్గుడైన ఉపాసకుడు కూడ, సత్పురుషుల సత్సాంగత్యమువల్ల క్రమశః నిశ్చల భక్తితత్పరుడై సంధ్యా షట్కమును, (సచ్ఛీలము, సచ్చరిత, వినయము, భగవద్భక్తి భ్రాతృభావము, సహనము) సాధించి సన్మార్గగామి అవుతాడు. తదుపరి మనో బుద్ధి ఇంద్రియాదులను ఆ పరమేశ్వరుని యందే లగ్నము చేయుటద్వారా శమాది షట్కమును (శమము, దమము, ఉపరతి, శ్రద్ధా, తితీక్ష, సమాధానము) అలవడి మోక్షసాధనా యోగ్యతను పొందును. అందువల్ల ఈ జీవన సముద్రములో ఎన్ని కష్టనష్టములు, ఒడుదుడుకులు అల్లకల్లోలములు కల్గినను, వానిని లెక్కచేయక స్థిర చిత్తుడైనిశ్చల కార్యోన్ముఖుడౌతాడు. పిపీలిక (చీమ)వలె తన కాళ్లపై తాను నిలబడగలుగుతాడు.

## మహేశ్వరస్థలము-ద్వితీయసోపానము రెండవమెట్టు విశిష్టత

అన్ని దుఃఖములకు కారణభూతములైన అవిద్యా రూపమాయా మోహములను (లింగాచారములో సద్గురువు నిత్యసేవన వల్లను, సద్గురోపదిష్టనిత్య షడక్షరాది మంత్రజప అనుష్ఠానమువల్ల) వీడి, సుజ్ఞానరూప మోక్షమార్గగామియై సద్గురువునకు దగ్గరవుతాడు

క్రమశః తన గురువును ఇష్టలింగమూర్తి యందు ప్రత్యక్షము చేసుకొని సేవించి తన్మయుడౌతాడు.

## ప్రసాదిస్థలము - తృతీయసోపానము - మూడవమెట్టు విశిష్టత

ఉపాసకుడు శివభావములో దశాపధాన విధముగా శివాచారవిధిగా లింగనిరీక్షణమును దృక్ త్వక్ మనస్సుల ద్వారా, నిత్యము ఉచిత కాలము అభ్యసించుటద్వారా, జీవుని శరీరమునకు గల భాగములకు, పరమాత్మలోని లింగభాగములకు తాదాత్మ్యము ఏర్పడి, లింగాంగ సంగి అవుతాడు. నిర్గుణరూప అంతరంగికపూజా విధానాచరణము నకు ప్రథమసోపానమిది. అందే ప్రప్రథమున సగుణరూప బాహ్య శివపూజను ఆచరించుచూ, క్రమశః అంతకంటె మిన్నఅయిన లయ యోగ, హఠయోగ రాజయోగములు అను అంతరంగిక శివపూజా ధ్యానము పొందుతాడు. ఈ దశాపదాన విధానమును సద్గురువు ద్వారా క్రిలక మెడెగి ఆచరింపబడగినది, ఇందువల్ల ఉపాసకుడు శివసారూప్య మును పొందుతాడు.

## చతుర్థసోపానము - నాలుగవమెట్టు - దాని విశిష్టత

ప్రాణలింగిస్థలము : షట్త్రింశత్ తత్వయుతుడైన శివునియందు, జీవాత్మయందుగల షట్త్రింశత్ తత్వములను భావించి, లింగాంగ సంగి అయిన తరువాత షట్త్రింశత్ తత్వోపచారములచే ఆ పరమ శివుని పూజించి అర్చించుట ఈ స్థలవిశేషత. తద్వారా శివసాలోక్య మును పొందుతాడు.

ప్రాణము, ఇంద్రియములు నేను-నాది అను అహంకారమును విడి, ఇదంతయు మోహమయము అని తలచుచూ, మనస్సును అహంకారమును ప్రవేశింపనీయక, లింగసమర్పణము గావించి, ప్రాణలింగ స్థలమున విహారము గావింపవలెను. ప్రాణమునందు లింగమును, లింగమునందు ప్రాణమును చేర్చి సుఖ దుఃఖ భయములు నావికావు అని తలంచవలెను.

ప్రాణలింగము మనస్సుచేతనే, గ్రహింపతగినది. ఉపాసకుడు వామకరతలమున ఉన్న ఇష్టలింగమును శరీరమందున్న ప్రాణలింగ స్థానమున నిలుపుకొని, అభేదభావమున లింగార్చనము చేయవలెను.

## పంచమ సోపానము-5వ మెట్టు దాని విశిష్టత

**శరణుస్థలము** :- శివజ్ఞాన బలమువలన లింగమే పతియనియు, తాను సతిననియు, భృత్యాచారవిధానముగా పరిచర్య నొనర్పవలెను. పంచజ్ఞానేంద్రియ సౌఖ్యమువీడి, ఆనందించు లింగాంగికి శివుడే పతి. ఈ ఇరువురి సంయోగానందమే శరణుస్థల విశేషత. శరణుస్థలమును పొందిన వారు కామాది అరిషడ్వర్గ, రాగాది సప్త ఉపశత్రువులచే విడువబడినవారై ఉందురు- జరామృతి శోక మోహ క్షుత్ పిపాసాదులనువీడి షడుర్మ్యాది రహితులు అయి ఉందురు. అభిమాన క్లేశములనువదలి సుఖముగా జీవింపకల్గుదురు.

## షష్ఠమసోపానము- ఆరవమెట్టు- విశిష్టత

**ఐక్య స్థలము :-** నేను, నీవు అను భేదభావములేక, ప్రాణము దేహము-ఇంద్రియములు, పంచభౌతికములే కాని నాకు సంబంధించి నవికావు- భ్రమాత్మకములు; అను, అనుభూతిపొంది, "శివోహం" "తత్వమసి"అను అనుభూతిని పొంది, ఆనందమయ జీవనమును గడుపుదురు. ఇదియే ఈస్థలవిశిష్టత. ఐక్యస్థలికి పుణ్యపాపఫల భోగములు లేవు. శిఖికర్పూరన్యాయమున ఉపాసకుడే శివుడగును.

షట్ చక్రములను, షట్ శక్తులను, షణ్ముఖములను, పంచ భూతములను, పంచ తన్మాత్రలను, జ్ఞాన కర్మేంద్రియములను, షడ్లింగములను, పంచ వాయువులను, ప్రతినిత్యము మహాలింగమునందును. తదుపరి ప్రకృతియందును లయమొనర్చుట ద్వారా జీవాత్మైక్య సంధానమును, ఉపాసకుడు సాధింపకల్గును. అనగా శివ సాయుజ్యమును పొందగల్గును.

శ్రీభగవత్పాదుల శంకరాచార్యులు భజగోవింద కీర్తనలో ఇట్లు సెలవిచ్చినారు.

"సత్సంగత్వేనిస్సంగత్వం । నిస్సంగత్వేనిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం । నిశ్చలతత్వే జీవన్ముక్తిః"

జ్ఞానులయిన సజ్జన సాధుభక్తుల సాంగత్యము వలన సంసార బంధము వీడుతుంది. నిస్సంగత్వము వలన అజ్ఞానాదూలచే మోహముచే విడువబడి సుజ్ఞానవంతుడౌతాడు. నిర్మోహత్వము వలన నిశ్చలతత్వజ్ఞానము సిద్ధిస్తుంది. నిశ్చల తత్వజ్ఞానసిద్ధి వలన మానవజీవన పరమార్ధమైన జీవన్ముక్తి (మోక్షము) లభిస్తుంది.

## 1. రాజయోగ ఆశయము

**రాజయోగమార్గము - ముఖ్యాంశములు :-** మనస్జ్ఞానమునకంతకును అనుభవమే మూలాధారము ఆస్తికతకు సర్వజన సామాన్యమైన మూలాధారమొకటి కలదు. స్మృత్యాదులను రచించిన ఋషులు తాము తత్వదర్శనము చేసితిమని చాటుచు, తాము కనిన తత్వములనే లోకమునకు బోధించుచున్నారు. జ్ఞానమున కంతకును ప్రత్యక్ష అనుభూతియే మూలాధారము స్వానుభవము కలిగిననేకాని మనుష్యుడు పారమార్థికుడు కానేరదని యోగశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. మనకు ఈ అనుభూతి కలుగు విధానమును బోధించునట్టి శాస్త్రమే యోగశాస్త్రము. మానవుడెప్పుడును సత్యమునేకోరును. తదనుభవమునకై వాని మానసము పరితపించును. సత్యమును గ్రహించి అంతరాత్మయందు తదనుభవమును పొంది, మోక్షమార్గము ద్వారా సత్య సందర్శనము చేసినప్పుడే సమస్త సంశయములును తెగి, అజ్ఞానముదూరమై, సమస్త కర్మలు నశించునని వేదములు చాటుచున్నవి ఈ తత్వ దర్శనార్థము, శాస్త్రసిద్ధమైన రాజమార్గమును మానవకోటికి చూపుటయే రాజయోగ ఆశయము.

## 2. సత్యాన్వేషణమునకు జిజ్ఞాస అవశ్యకము

ప్రతి శాస్త్రమునకును స్వతంత్రమైన శోధన విధానమొకటి కలదు. లోకకల్యాణముకంటె మరియొక సంకల్పములేని పవిత్ర చరిత్రులైన ఋషులు, వచించిన సత్యములివి. "ఇంద్రియములచే వ్యక్తమగునట్టి తత్వముల కంటె మహత్తరమైన తత్వమొకటి కలధని, తాము కనుగొంటిమని, ఘోషించుచు, తాము చెప్పిన మార్గమును

జిజ్ఞాసతో స్వీకరించి, సత్యనిష్టతో సాధనము చేయుడని చెప్పు చున్నారు. నియమిత విధుల, ననుసరించి శ్రద్ధతో కృషిచేసినచో, తప్పక వికాసము కలుగును. జ్ఞానోపలబ్ధికి, పరిశీలనము మూలాధారము ముస్ముందు అంతరంగమునందలి విషయములను గమనించునట్టి శక్తి, సంపాదించునంత వరకు మనస్సును గూర్చియు మనుష్యుని ఆంతరంగిక ప్రవృత్తిని గూర్చియు, భావనా తత్వమును గూర్చియు జ్ఞానము ఎన్నటికిని కలుగదు. అంతరస్థితులను పరిశీలించుటకు సాధనములను మనకు చూపుటయే రాజయోగ ఆశయము.

## 3. ఏకాగ్రత సాధనలో మనస్సుయొక్కపాత్ర

మనస్సే ఏకాగ్రతను సంపాదించుటకు సాధనము. ఏకాగ్రతా శక్తిని, సక్రమ మార్గమునకు తెచ్చి ఆంతర ప్రపంచమువైపునకు మరల్చినపుడు అది మనస్సును విమర్శించి, మనకు తెలియని విషయములను ప్రకాశింప జేయుచున్నది. ఏకాగ్రతవలన మనశ్శక్తులు దీప్తి చెందును. జ్ఞానమునకు ఇదియే సాధనము బాహ్యాభ్యంతర ప్రపంచములు రెంటియందును ప్రతి మానవుడు ఏకాగ్రతాశక్తిని వినియోగించుచునే యున్నాడు. చిత్త ఏకాగ్రతకు విశేషమైన అభ్యాసము ఆవశ్యకము. చిన్ననాటనుండియు ఆంతర ప్రపంచ విషయములను విడిచి, బాహ్యవిషయములనే వీక్షింప నేర్చుకొని యున్నందున మనలో చాలామందికి, మనోయంత్రము ఎట్లు నడుచుచున్నది, గమనించు శక్తి చాలావరకు నశించినది. చిత్తవృత్తుల నరికట్టి, మనస్సును అంతర్ముఖము చేసి, సర్వ మానసిక శక్తులను ఏకాగ్రతకు తెచ్చి, మనస్సుపై పరపి, మనస్సును విమర్శించి, మనస్సు వలననే మన స్వభావమును గ్రహించుట కష్టసాధ్యమైన

పని, అయినను ఈ విషయవిమర్శకు శాస్త్రీయమైనపద్ధతి రాజయోగ మొక్కటియే ఏతత్ జ్ఞానోపలబ్ధివలన సర్వదుఃఖములును నివృత్తి ఆగుచున్నవి. అంతఃకరణమును శోధించి, తన్మూలమును నాశరహితమును, స్వతస్సిద్ధము(గ)ను నిత్యమును, నిష్కళంకమును, పరిపూర్ణమును అగు వస్తువును ప్రత్యక్షముగ దర్శించిన వానికి ఇక శోక మోహము లెక్కడివి? భయమును, తీరని కోరికలును, దుఃఖమునకు 'పుట్టినిల్లు' మృత్యువన్నది మిథ్యయని తెలియగనే మానవునకు మరణభయము తొలగుచున్నది. "పరిపూర్ణత"నని దాను గ్రహించినంతనే మానవునకు వ్యర్థవాంఛలు అంతరించుచున్నవి. ఈ రెండు హేతువులు నివరించుటచే ఈ శరీరమునందుండంగనే సర్వ దుఃఖములు నశించి సంపూర్ణానందము లభించుచున్నది. ఈ జ్ఞానమును పొందుటకు చిత్తైకాగ్రతయే తగు సాధనము. మనస్సుయొక్క సంకల్పశక్తికి పరిమితిలేదు. మనస్సు యెంతెంత ఏకాగ్రత చూపుచున్నదో, అంతంత విషయ పరిశీలన శక్తియు పెరుగుచున్నది. బాహ్య విషయములయందు మనస్సును నిలుపుటకు మనము అలవాటు పడినాము. మనస్సు ఉభయాత్మకము మరియు మానసిక శాస్త్రము, వేదాంతము అను విషయములయందు చూచువాడగు దృక్కును, చూడబడునదగు దృశ్యమును ఒకే వస్తువగుటచే మనస్సును ఏకాగ్రతగా నిలుపుట సులభసాధ్యముకాదు. అందువలననగా మనస్సే విషయము మరియు అంతరింద్రియముకూడా. మనస్సు చేతనే మనస్సును శోధింపవలసి యున్నది.

ఏకాగ్రమైన చిత్తమునందు అంతరాత్మలోనున్న నిగూఢ విషయములైనను నిర్భిన్నములై వెలువడుచున్నవి. జీవాత్మ యొక్క ప్రత్యక్ష అనుభూతిని కలిగించుటయే రాజయోగ ఆశయము నిరంతర అభ్యాసము ద్వారానే రాజయోగమును సాధింపగలము.

## 4. మనశ్శరీర అన్యోన్య సంబంధము

మనశ్శరీరములకు అన్యోన్య సన్నిహిత సంబంధము కలదు. సూక్ష్మమైన శరీరాంశమే మనస్సు మనస్సునందెట్టి మార్పు కలిగినను, తదనుగుణమైన మార్పు శరీరమునందు కనబడును. అట్లే శరీరమునం దనారోగ్యము కలిగినపుడు మానసిక అనారోగ్యము కలుగుచున్నది. మనస్సుపై స్వాధీనత కలుగుటకును మనశ్శరీరములను వశపరచుకొనుటకును శరీర సహాయము అవసరము. జీవాత్మ ఈ శరీరము ద్వారా చేసిన పుణ్యపాపముల ననుభవించుచున్నాడు. అందువలన తగినంత ప్రయత్నముతో శరీరారోగ్యమును సంపాదించి శరీర మనస్సులను నేర్పుతో[2] స్వాధీనము చేసుకుని, తనుకోరిన రీతిని తన శక్తుల నేకాగ్రత చేయునట్లు మనస్సును మరల్చవలెను.

తత్వ శాస్త్రజ్ఞుడు (తాను) మనః ప్రకృతులు అని చెప్పునట్టి తత్వములు కేవలము బాహ్య భేదములే అనియు, సద్వస్తువు ఒకటియే అనియు. గ్రహించును ఎయ్యది అనేక(త్వ)ముగా నున్నదో, ఎందుండి బహుత్వము నిర్మాణమగుచున్నదో, అట్టి ఏకత్వమును సాధించుటయే రాజయోగ ఆశయము.

## 5. సాంఖ్య దర్శన - రాజయోగ - ఆయుర్వేదములకు గల అన్యోన్యసంబంధము

సాంఖ్య దర్శనము, రాజయోగమునకును ఆయుర్వేదమునకును మూలాధారము. ఈ శరీరము 1. "పంచ మహాభూతములు (భూమి జలము, అగ్ని, వాయువు, ఆకాశము) 2. పంచ తన్మాత్రలు (శబ్ద

స్పర్శ, రూప, రస గంధములు), అపంచీకృత పంచమహాభూత సూక్ష్మాంశములు 3. పంచకర్మేంద్రియములు (వాక్, పాణి, పాద, వాయు ఉపస్థలు 4. పంచజ్ఞానేంద్రియములు (శ్రోత్ర, చక్షు, జిహ్వా, ఘ్రాణ, త్వక్‌లు.) 5. మనస్సు, బుద్ధి, అహంకారములు అను త్రివిధ అంతఃకరణ త్రయము 6. ప్రకృతి (సృష్టికి కారణము జడము) 7. పురుషుడు (జీవాత్మ) అను ఈ ఇరవై ఐదు తత్వములతో కూడుకొని యున్నది జగత్ సృష్టికి కారణ భూతములు వీని యందు పురుష డొక్కడే చేతనుడు. మిగిలిన 24 తత్వములు జడములు. కావుననే, ఆయుర్వేద జీవనవిధానము ఆచరించుట రాజయోగ సాధనకు అత్యావశ్యకరము.

## 6. జ్ఞానోపలబ్ధియందు త్రివిధ శరీరములపాత్ర

ఈ శరీరమును, గ్రహణ సౌలభ్యమునకై మూడు విధములుగ విభజింపవచ్చును. 1. స్థూలశరీరము ఇది పైన చెప్పిన పంచమహా భూతములతో కూడినది రసరక్తమాంసమేదో అస్థిమజ్జ శుక్రములు అను సప్తధాతువులతోను, వాతము, పిత్తము, కఫము అను త్రివిధ ధాతువుల (దోషముల) తోను, స్వేద, మల, మూత్రములను త్రివిధ మలములతోను, కూడియున్నది.

శరీరాంతర్గత పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియ ములు అను దశవిధ ఇంద్రియములు, మోక్షసాధనములు, భోగ సాధనములు, మలాయ తనములు. రెండు నేత్రములు, రెండు కర్ణములు రెండు నాశికలు, జిహ్వాఒకటి, గుదము ఒకటి ఉపస్థ ఒకటి అను నవ బాహ్య స్రోతస్సులతో కూడి యుండుటవలన ఈ శరీరమునకు నవద్వారపురి అని పేరు. ఈ స్థూల శరీరము అన్నము వలననే పుట్టి పెరుగుచున్నది. బాల్య, యౌవన, కౌమార జనన

మరణములు వర్ణాశ్రమ ధర్మ నియమములు, నానావిధ రోగాను భవములు స్థూల కృశత్వములు, మానావమానములు అను ధర్మములు కలది చతుర్విధ (ధర్మార్థకామమోక్షములు) పురుషార్థ సాధకము అన్నమయ కోశము పురుషునకు భోగసాధనము.

**సూక్ష్మశరీరము** :- ఇది అపంచీకృత మహాభూతముల నుండి జనించును. పూర్వజన్మ సంస్కారజనిత సుఖదుఃఖరూప కర్మ ఫలముల ననుభవించునది. ఇదియే లింగ శరీరము 1. వాగాది పంచ కర్మేంద్రియములు 2. శ్రోత్రాది పంచ జ్ఞానేంద్రియములు 3. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములను పంచవిధ వాయువులు 4. ఆకారాది పంచభూతములు, 5. అంతఃకరణ చతుష్ట యము 6. అవిద్య 7. కామము 8. కర్మము అను ఈ ఎనిమిదింటికి (కలిపి) పుర్యష్టకము అని పేరు. ప్రాణ, మనో, విజ్ఞానమయ కోశములతో కూడినది. 1. అవిద్య (అజ్ఞానము) 2. కామము 3. కర్మము 4. పృథివ్యాది పంచతన్మాత్రలు ఈ ఎనిమిదింటిని అష్ట వసువులందురు. ఒక శరీరమును విడిచి మరియొక శరీరమును ధరించునపుడు పూర్వజన్మప్రజ్ఞచే ఈ అష్ట వసువులతో సూక్ష్మశరీర మేర్పడును. పై అష్టవసువులు బ్రహ్మ జ్ఞాన సముపార్జనవల్లనే నాశనము చెందును. అవిద్యానాశము కలుగునంతవరకు పుట్టుట, చచ్చుట అను చక్రము తిరుగుచునే యుండును. అందువల్ల పై అష్ట వసువులు జన్మ హేతువులని తెలియవలెను. "ఘృణా, లజ్జా, భయం, శంకా, జుగుప్సా ఇతి పంచమీ, కులం శీలంచ జాతిశ్చ" అష్టౌపాశాః ప్రకీర్తితాః ఈ అష్టపాశ, అష్టవసువుల నాశనము బ్రహ్మ జ్ఞానము వల్లనే కలుగును హఠాది యోగాభ్యాసము వల్లకాని, చతుష్షష్టి లౌకిక విద్యల వల్లకాని, బహుప్రజ్ఞచేకాని ముక్తి జరుగునే కాని, ముక్తి కలుగ

నీరదు. (త్రివిధ వాసనలలో 1. లోకవాసన 2. శాస్త్రవాసన 3. దేహ వాసన) మోక్షప్రాప్తికి సహాయ సాధనములుకావు.

**కారణ శరీరము :-** ఇదే ఆనందమయ కోశము జీవాత్మ ఆనందమయకోశము కారణశరీరము కాదని, విజ్ఞానమయకోశము జీవాత్మయని, ఆనందమయుఁడు పరమాత్మయే యని శ్రీ నీలకంఠా చార్య సూక్తిని తదీయ ఆనందమయాధికరణమున గాననగును. వడ్లగింజముల్లు వంటి శరీరము కలిగి అణుస్వరూపుడై శరీరము నందు జరుగు సర్వకార్యములకు సాక్షీభూతమై ఈ శరీరమును కర్మ భోగమునకై, కలిగి యున్నాడు జీవుడు.

నిరాకారుడు, నిరంజనుడు, రూపరహితుడు, చిదానంద స్వరూ పుడు. కుండలినీ ఉపాసనాదులవల్లను, అచంచల భక్తివల్లను, అష్టో పాసన వల్లను, సంగీతసాధనవల్లను, బ్రహ్మజ్ఞాన సముపార్జన వల్లను, పూర్వజన్మ సుకృతము వల్లను సద్గురు కటాక్షమువల్లను, మూలాధార చక్రాశ్రిత కుండలినీ శక్తి ప్రబోధమై, ఊర్ధ్వ ముఖ ముగ గమనము కలిగినపుడు, క్రమశః, స్థూల శరీరసంబంధమైన, షుత్ పిపాసలు, సూక్ష్మ శరీర సంబంధమైన శోక మోహములు, పుణ్య పాపకర్మల క్షయమువలన జననమరణ నివృత్తి కలిగి, సహస్రా రచక్రాధిష్ఠితమైన ఆ పరమాత్మయందు లీనమగును.

సాంఖ్య మతానుసారము మానవునకు ("ఆత్మా మనసా సజ్యతే, మన ఇంద్రియేణా, ఇంద్రియ మర్ధేన") విషయజ్ఞానప్రాప్తి. ఇంద్రి యార్థములు ఇంద్రియములతోను, ఇంద్రియములు మనస్సుతోను మనస్సు ఆత్మతోను సంయోగము చెందుటచే కలుగుచున్నది.

పంచమహాభూతములలో ప్రతిభూతమునందును పంచభూత ములు కలవు. ఎట్లనగా ఉదా॥ పృథివీభూతము నందు సగభాగము,

పృథ్వీ తత్వము మిగిలిన సగభాగమునందు జల, అగ్ని, వాయు, రాకాశములు 1/8 విభాగములు కలిగియుండును. ఈ వ్యవస్థను పంచీ కరణమని అందురు. మానవుడు మృతిచెందినపుడు ఈ పంచ భూతాంశములు పంచభూతములయందు లయమగును.

శైవసిద్ధాంత ప్రకారము, మానవశరీరమున షట్త్రింశత్ (36) తత్వములు కలవు. పంచవింశతి తత్వములు + రాగ, విద్యా, కలా నియతి, కాల,మాయా, శుద్ధవిద్యా, ఈశ్వర, సదాశివ,శక్తి, శివతత్వ ములతో కూడి ముప్పదిఆరు అగును. షట్త్రింశత్ తత్వవిదుడైన ఆ శివునియందు షట్త్రింశత్ తత్వములతో కూడిన జీవుని, లింగాంగ సంధానము కావించి, షట్త్రింశత్ తత్వసంకేతములతో ప్రతి నిత్యము పూజ, అర్చనాదులు చేయుటవలన ఉపాసకుడు శివుడే అగును. అనగా క్రమశః శివసాయుజ్యప్రాప్తి; కలిగి, చిదానంద రూపుడగును.

## ౯. నేత్రవిషయము-షట్చక్రస్థితి-ముక్తికాంత

"చతుర్మధ్యేస్థితం గుహ్యం అంగుష్ఠం పరమాత్మకమ్"

నేత్రములకు మధ్యను గోప్యముగా అంగుష్ఠమాత్ర పురుషుడగు పరమాత్మ యున్నాడు.

"నీలతో యద మధ్యస్థా, విద్యుల్లేఖేవ భాస్వరా ।
నీవారశూకవత్తన్వీ, పీతా భాస్వత్యణూపమా ।
తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః॥
(తైత్తిరీయోపనిషత్ ।)

నేత్రస్థానమందుండెడి నల్లగుడ్డునకే నల్లకలువ అని చెప్పుదురు అందు మధ్యమున, నివ్వరి ధాన్యపు (వడ్లగింజపై) ముల్లువలెనే అతి సూక్ష్మమగు రంధ్రమున్నది. అందు విద్యుల్లేఖయనెడు మెఱుపుతీగ ప్రకాశించుచుండును. అదియే నిష్కళ, ఆ కళయే పరమాత్మ స్వరూపము. ఈ నేత్రస్థానమే పరమాత్మయని పెద్దలు చెప్పుదురు. ఈ కళయే ముక్తికాంత యనియు, జ్యోతియనియు స్వప్రకాశ మనియు చెప్పుదురు. ఈ ప్రకాశము వల్లనే, సూర్యునికి ప్రకాశము కల్గినది. సూర్యునివలన చంద్రునికి ప్రకాశము కల్గినది కావున వెలుగునకు కారణము కళయే అని తెలియనగును. ఇదియే హిరణ్మయ కోశము.

సూర్యునియొక్క కాంతి తెలుపుఅని సర్వత్రతెలిసిన విషయమే శుద్ధ సత్వప్రకాశము, సూర్యకాంతి ప్రత్యక్షముగా తెలుగు రంగు

గలదైనను, నిజముగా చూడగా వివిధ రంగులయొక్క చేరిక అని తెలియగలదు.

సూర్యకాంతి ముక్కోణపు అద్దముచే భాగింపబడి, వివిధ రంగులు నేత్రస్థానమందు (ఏడురంగులు) గల్గును

1. ఎఱుపు 2. నారింజపండు వర్ణము (ఎఱుపు పసుపుకలసిన వర్ణము) 3. పసుపుపచ్చ వర్ణము 4. ఆకుపచ్చ వర్ణము 5. నీల వర్ణము 6. సునీలవర్ణము, ఇదియే పాప, 7. ఇంద్రనీలవర్ణము.

ఈ ఏడు రంగులు సప్తచక్రములనియు, అందలి "కళ"యే సుషుమ్నయని, నిష్కళయే పరబ్రహ్మ స్వరూపమనియు పెద్దలు చెప్పెదరు; 2,3,4 రంగులుకలసి తెలుపుగా నెన్నబడును.

**ఎఱుపు :-** తెల్లగుడ్డు చుట్టు నుండునది, పృథివీ తత్త్వము-క్రియాశక్తి, బ్రహ్మాధిదేవత అకారం మాతృక, అన్నమయకోశము, సద్యోజాతముఖము.

**2. తెలుపు :-** తెల్లగుడ్డు ఆపోతత్వం జ్ఞానశక్తి విష్ణువు అధి దేవత, ఉకారం మాతృక, ప్రాణమయకోశము-వామదేవ ముఖము.

**3. నలుపు :-** తెల్లగుడ్డు మధ్యనుండు నల్లగుడ్డు- తేజోతత్త్వము ఇచ్ఛాశక్తి. రుద్రుడు అధిదేవత. మనోమయకోశము తత్పురుష ముఖము.

**4. సునీలము :-** నల్లగుడ్డు మధ్యనుండు నీలమైనపాప-వాయు తత్త్వము ఆదిశక్తి, ఈశ్వరుడు అధిదేవత, అర్ధమాతృక విజ్ఞానమయ కోశము- అఘోరముఖము.

**5. ఇంద్రనీలము :** పాపమధ్య వెలిగెడికళ- ఆకాశతత్త్వము,

పరాశక్తి. సదాశివుడు అధిదేవత, ఓంకారమాతృక, ఆనందమయ కోశము ఈశానముఖము.

6. (ఈ ఐదు రంగులు ఐదు చక్రములనియు, బిందువే ఆజ్ఞా చక్రమనియు, కళయే సహస్రారమనియు, నిష్కళయే పరబ్రహ్మ స్వరూపమనియు తెలియునది).

నల్లగుడ్డునకే అండాండమనియు, గంగయనియు చంద్ర మండలమనియు, నాదమనియు ఇడయనియు, కామాక్షి యనియు, స్థూలదేహమనియు జాగ్రదవస్థయనియు తమోగుణమనియు తెలియ నగును.

పాపకే, పిండాండమనియు, యమునయనియు, నీలతోయద మనియు, సూర్యమండలమనియు, బిందువనియు, పింగళయనియు, మీనాక్షియనియు, సూక్ష్మశరీర మనియు, స్వప్నావస్థ యనియు, రాజసగుణమనియు తెలియనగును.

పాపమధ్యన వెలిగెడికళకే బ్రహ్మాండమనియు, సరస్వతి యనియు, అగ్నిమండలమనియు, కళయనియు సుషుమ్నా యనియు, విశాలక్షియనియు, కారణదేహమనియు మహాకారణమనియు, చెప్పు దురు.

(ఈ కళలలో నిష్కళయే పరబ్రహ్మ స్వరూపము).

పృధివ్యాపస్తేజో వాయు రాకాశములనెడి పంచభూతములు క్రియాశక్త్యాది పంచశక్తులు, బ్రహ్మాది పంచఅధి దేవతలు అకార, ఉకార, మకార అర్ధమాతృక, ఓంకారమనియెడి పంచ మాతృకలు, అన్నమయాది పంచకోశములు, అండాండ, పిండాండ బ్రహ్మాండ ములనియెడి అండత్రయము, గంగ యమునా సరస్వతీ యనెడి

వేణీత్రయమును, సూర్యచంద్ర అగ్ని అను మూడు మండలములును నాద బిందుకళలు, ఇడ, పింగళ సుషుమ్నయనెడి మూడు అతి ముఖ్యమైన నాడులు, కామాక్షిమీనాక్షి, విశాలాక్షి యనెడి అక్షిత్రయ మును సత్వరజస్తమోగుణములనెడి త్రిగుణములును, మూలాధారాది సప్తచక్రములును స్థూల, సూక్ష్మకారణశరీరము లనెడి శరీరత్రయ మును. జాగ్రస్వప్న సుషుప్తులను అవస్థాత్రయమును నేత్రస్థానము నందే నిరూపింపబడినది. సమస్త వృత్తులును నేత్రస్థానమందే పుట్టును. సంగమమందవి కోరికయును ఇచ్ఛటనే కల్గును రేతోస్ఖ లనము ఈ స్థానసంబంధమునుంటి వల్లనే రేతోస్ఖలనమును, నీరసము, నిస్త్రాణ నేత్రములయందు బయటు కలుగును. ఈ విషయము స్వానుభవమువల్లనే తెలియనగును.

"అణోరణీయాన్మహతో మహీయానాత్మాగుహాయాం ।
నిహితోస్యజంతోః;" (తైత్తరీయోపనిషత్).

అతి సూక్ష్మమగు అణువును, అతి స్థూలమైన మహత్తుకంటె, ఎత్తునుఅగును. పరమాత్మ జంతువులయొక్క బుద్ధిగుహయందుం డును.

"జాల్యా సూర్యమరీచిస్థం, యత్సూక్ష్మతరం రజః ।
తస్య, మష్ఠాష్ఠభాగః అణురిత్యభిదీయతే ॥

ఇంటికప్పులోని సందులగుండా జారెడి సూర్యకాంతిలోని నలుసుయొక్క ఆరవభాగమునకు అణువని పేరు.

నేత్రమండలి పాపకు మధ్యన నివ్వరిముల్లుపంటి (వడ్లముల్లు నందు, అతి సూక్ష్మమగు రంధ్రమున్నది ఇక్కడి నుండియే నాడులు

కపాలమునకు పోవును. ఆ రంధ్రమధ్యమందు, ముక్తి కాంత యున్నది. దీనిని సశిసనాకమనియు, బ్రహ్మరంధ్రమనియు, మేరుశిఖ యనియు, సుషుమ్నానాడి యనియు చెప్పెదరు, అందుండు కళతే ముక్తికాంతయనియు కళ యనియు, ఆపోజ్యోతి యనియు అందురు. మనస్సును క్రమక్రమముగా లీనముచేసి, చూచువాడును చూడబడు నదియును లేక నిరామయుడై, తుర్యావస్థనుపొంది ముక్తినొంద వలెను.

ఆపోజ్యోతి :- రక్త, శ్వేత కృష్ణనీలవర్ణములమధ్యన ప్రకాశించు ఆపోజ్యోతి నీలతో యదమధ్యస్థ అయిన విద్యుల్లేఖ యనియు అక్షరుడనియు చెప్పుదురు. మరియు ఇది అంతర్లక్ష్యము గగనము శిఖాస్థానము, అగ్నిశిఖా; సర్వసాక్షి, చిన్మయ నేత్రస్థానము మేరు శిఖరము, కైలాసము సత్యలోకము వైకుంఠములంటే స్థానమని చెప్పుదురు.

అమృతమన్ననూ, ఆపోజ్యోతియన్ననూ బ్రహ్మమన్నను ఓంకార మన్నను, శివమన్నను, విష్ణువన్నను, పరమపదమన్ననూ పండితులచే వేదసిద్ధముగ శివలింగమని తెలియదగును.

(బ్రహ్మవిద్యా గ్రంథాధారము)
శివయోగసారము నుండి

## షణ్ముఖీ లక్షణము

ముఖము నందు ప్రాణవాయువును పూరింపవలెను. వహ్నిస్థానమున అపానవాయును ఆకర్షింపవలెను. ఈ రెంటిని జలింపనీయక స్థిరముగా నుంచవలెను.

రెండు చెవులను, రెండు నేత్రములను, రెండు ముక్కురంధ్రములను కరతలముంచేలను వేళ్ళచేతను నిరోధించవలెను. ఇటుల షణ్ముఖినవలంబించిన వారలు ప్రణవసౌధమున లీనమై తత్సుఖంబును గాంచుదురు.

ఇట్టివారు చంద్ర సూర్యకాంతుల కెదురుగానున్ననూ, గృహోపసమీపమున నున్నను, సూర్యేంద్ర సంగమదృష్టిగల ఆత్మలింగ చిహ్నంబులు స్ఫుటముగా వారికి కన్పించును. షణ్ముఖినభ్యసించినంతమాత్రముననే ఇట్లు కన్పించుచున్న- నిరంతరము శివలింగమును దర్శించు మహాత్ములకు కన్పించిన యాశ్చర్యమేల?

శివయోగసారము పరిష్కర్త తెలుగుచేత,
ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు
శైవప్రచారిణి.

## 8. నాడీమండలము

యోగశాస్త్రానుసారము శరీరమునందు కల వెన్నెముక యందు "ఇడ, పింగళ"లను రెండు నాడులు కలవు. ఆ రెంటి మధ్యమున అదృశ్యముగ "సుషుమ్న"అను నాడికలదు. వెన్నెముక పొడవునను బోలుగానుండు ఒక కాలువ కలదు. దీనిని యోగులు సుషుమ్న అందురు. ఈ కాలువ క్రిందిచివరన కుండలినీ శక్తి మూడున్నర చుట్లు పామువలె చుట్టుకుని, జడరూపమున మూలాధార చక్రాశ్రితమై యున్నది. వెన్నెముకకు ఎడమవైపు వుండు నాడికి "ఇడ"అని పేరు అది జ్ఞానకారకము. దీనికే చంద్రనాడీ అని కూడ పేరు. కుడి వైపున్న నాడికి పింగళ అనిపేరు. దీనినే సూర్యనాడి అని అందురు.

ఇది చలనకారకము. ఈ ఇడ, పింగళ నాడులయొక్క సమస్థితి ఆరోగ్యకారణము.

మానవ శరీరమందు మూలాధారము (గుదము) మొదలుకొని, మెదడునందలి సహస్రారచక్రము వరకును, వివిధములగు చక్రములు లేక పద్మములు కలవు. అవి ఎవ్వి అనగా, 1) మూలాధారచక్రము 2) స్వాధిష్ఠాన చక్రము 3) మణిపూరక చక్రము 4) అనాహత చక్రము 5) విశుద్ధిచక్రము 6) ఆజ్ఞాచక్రము 7) సహస్రార చక్రము ఈ చక్రము లన్నింటిలోను గుదాశ్రితమైన మూలాధారచక్రము, నాభిని ఆశ్రయించియున్న మణిపూరకము, మెదడు నందలి సహస్రారచక్రము గమనింపదగినవి.

యోగులు తమ అతీంద్రియ దృష్టిచే నాడీ మండల సంపూర్ణ స్వరూపమును దర్శించి, ఇట్లు వివరించిరి. "నాడీ మండలమునందు మూలాధారాది షట్ చక్రములు కలవు. శారీర మానసిక చైతన్య క్రియలకు ఇది మూలము. ఈ నాడీమండలమునందు మూడు కోట్ల డెబ్బై లక్షల నాడీ తంతువులు కలవు. వానిలో డెబ్బది రెండువేలు ముఖ్యములు. ఇందుకొన్ని ఊర్ధ్వముఖముగను, అధోముఖముగను తిర్యక్ ముఖముగను వ్యాపించియున్నవి. కొన్ని సహస్రారకమలము నుండి సంకేతములను ఇంద్రియములకు పంపును కొన్ని ఇంద్రియ ముల నుండి సహస్రారకమలమునకు షట్ చక్రములద్వారాపంపుచూ మానవ చేతన శరీరక్రియకు సహాయపడుచున్నవి.

వానిలో 1) ఇడ 2) పింగళ 3)సుషుమ్న 4) విశ్వోదరి 5) సరస్వతి 6) వారుణి, 7) పూష 8) హస్తి జిహ్వ 9) అలంబుస 10) యశస్విని 11) కుహు 12) శంఖిని 13) పయస్విని 14) గాంధారిలను 14 ముఖ్యములు. వీనిలో పది వాత వాహకములు.

తిరిగి ఈ పదునాలుగు నాడులలోను మొదటి మూడు నాడులు అతి ముఖ్యమైనవి. ఇడానాడి ఎడమ ముక్కు నాశ్రయించి యుండును. జ్ఞానకారకము, వాతధాతువుతో కూడినది. దీనికి చంద్రనాడి అని పేరు. పింగళానాడి కుడి ముక్కు నాశ్రయించి యుండును. సర్వ చలన కారకము పిత్తధాత్వాశ్రితము దీనికి సూర్యనాడి అని పేరు. ఇడా పింగళ నాడులు సమస్థితియందున్న ఆరోగ్యదాయకము. విషమస్థితి అనారోగ్యదాయకము. వీటి ద్వారా ప్రాణాయామము నాచరించుటద్వారా. కుండలినీ శక్తిని ప్రబోధింపవచ్చును, మరియు పై నాడులకు అన్యోన్య సంబంధము కలదు.

**సుషుమ్నానాడి :-** ఇది అగ్నిరూపిణి అదృశ్యరూపిణి సర్వ శక్తి మయము, స్త్రీ గర్భమునందు మూడవనెలలో బ్రహ్మరంధ్రము ద్వారా ఈ నాడి ప్రవేశించి అధోగామియై, షట్ చక్రములను రుద్ర విష్ణు బ్రహ్మగ్రంథులచుట్టుచూ సర్పము వలె ప్రదక్షిణము చేయుచూ, మూలాధారచక్రమున మూడున్నరచుట్లు చుట్టుకున్న పామువలె ఆశ్రయించి, క్రియారహితముగ యున్నది. ఇదియే కుండలిని అన బడును. సర్వశక్తిలో కూడుకొనిన కుండలినిని, జాగృతము చేసి, సహస్రారము వరకు తీసుకుని పోవలెను. ఓజశ్శక్తి మనుష్య శరీరము నందలి శక్తులన్నింటియందును, మహత్తర మైనదని యోగులు చెప్పుదురు. ఓజశ్శక్తి మెదడునందు సంగ్రహింపబడినది. ఓజశ్శక్తి అధికముగ నున్న కొలదియు మనుష్యునకు విశేషమగు శక్తి సామర్థ్యములును, బుద్ధిబలమును, ఆధ్యాత్మికశక్తియు కలుగును. శరీర శక్తులన్నియు ఉత్తమోత్తమస్థితి యందు ఓజశ్శక్తిగా మార్పుచెందును పరిశుద్ధ వర్తనులు మాత్రమే ఓజశ్శక్తిని మేల్కొలిపి మెదడునందు కూడబెట్టుటకు సమర్థులు.

సామాన్యముగా సుషుమ్నా నాడియొక్క క్రిందికొన మూసు కొని యుండును చిత్త ఏకాగ్రతను సాధించి, నిత్యము తీవ్రముగా అభ్యాసము చేయుటద్వారా కుండలినీ శక్తిని మేల్కొలిపి, ప్రాణ వంతముచేసి, సుషుమ్నానాడిని ఊర్ధ్వ ముఖముగా చరించునట్లు చేసినయెడల, కుండలినీశక్తి ఒకచక్రమునుండి మరియొకచక్రము నకు ఊర్ధ్వ ముఖముగా బోవునపుడు మనస్సుయొక్క పొరలు ఒక దాని వెంబడి ఒకటి నొకటిగా తొలగిపోవును. క్రమశః అతీంద్రియ జ్ఞానమును, ఆత్మ సాక్షాత్కారమును, దివ్యజ్ఞాన అనుభూతులును కల్గును. ఈశ్వరానుగ్రహముచేగాని, మహాపురుషుల అనుగ్రహము వల్లగాని, నిత్యానిత్య వస్తు వివేచన సామర్థ్యము వల్లగాని భక్తి, మంత్ర, జప, ధ్యానములవల్లగాని, నిత్య ప్రాణాయామ అభ్యాసము వల్లగాని, పూర్వజన్మ సుకృతము వల్లగాని, బ్రహ్మజ్ఞాన సముపార్జ నమువల్లగాని, కుండలిని ప్రబోధితమై శాశ్వతానందమునకు హేతు వగును.

## 9. జ్ఞానోపలబ్ధి సాంఖ్యమతమున.

సాంఖ్యమున సత్వరజస్తమో గుణముల యొక్క హెచ్చు తగ్గుల ననుసరించి జీవుడు సుఖ దుఃఖ రూప కర్మముల ననుభవించును. పై త్రిగుణములతో కూడిన అహంకారము మనస్సుచే సంకల్పించబడిన విషయమును, బుద్ధితో కూడినదై నిశ్చయజ్ఞానమును కలిగించును. మనస్సు అనిశ్చయ జ్ఞానమును, సంబంధిత ఇంద్రియ అధిష్టాన దేవతలద్వారా, ఇంద్రియములకును, ఇంద్రియములు ఇంద్రియార్థములకును, అందించును. అప్పుడు, ఆ జ్ఞానానుసారము, క్రియలు జరుగును.

## యోగశాస్త్రమున

1) యోగ శాస్త్రానుసారము జ్ఞానోపలబ్ధి సర్వ శరీర వ్యాప్తమైన, సూక్ష్మమైన, సర్వేంద్రియ క్రియలకు కారణమైన, నాడీతంతువులద్వారా కలుగునని తెలుగును. ఉ॥ మనము ఒక వస్తువుని చూచినపుడు ఆ వస్తువుయొక్క ఆకారములను జ్ఞానేంద్రియము గ్రహించి తదుపరి మనసుకు తెలుప జేయును. తదుపరి కర్మేంద్రియము జ్ఞానేంద్రియముచేత ఆవి [illegible]యు, సంశయాత్మక జ్ఞానమును కలిగించునట్లు మనస్సునకు తెలియజేయును. త్రిగుణాత్మక అహంకారముతో కూడిన బుద్ధి, మనస్సుద్వారా తెలియజేయబడిన విషయము యొక్క నిశ్చయ జ్ఞానమును, కర్మానుసారముగ కలిగించును (ఆత్మ మనగా సంయుక్త, మన ఇంద్రియ మూర్తిగ) పైన పేర్కొనబడిన నాడీ తంతువులద్వారా మూలాధారాది షట్ చక్రములకు తత్ సంబంధిత అంగ ప్రత్యంగములకు, కార్య నిర్వ

హణమునకై తెలియజేయబడుచున్నది. ఇది ప్రతిక్షణము శరీరమున జరుగు విధానము.

2) యోగులు తమ అతీంద్రియజ్ఞానముద్వారా ఈ జ్ఞాన సముపార్జనమును డైరెక్టుగా మనస్సుద్వారానే సుషుమ్నా నాడిద్వారా సాధించగలుగుచున్నారు. అందువలన సాధకుడు ఈ మానవజన్మమందే అల్పకాలమున మోక్షసాధనము చేయ గల్గుదురని చెప్పిరి. మంత్రలయ, ఆసన రాజయోగ సమన్వయముగా సాధనచేయుట ద్వారా మోక్షము సాధింపగలరు.

3) అతీంద్రియ సామర్థ్యము ననుసరించి సాధకుని జీవాత్మ ద్వారా తదితరుల జీవాత్మలను డైరెక్టుగా ప్రభావితము చేయుట ద్వారా శీఘ్ర తమముగా జ్ఞానోపలబ్ధిని, మనోబుద్ధి షట్చక్రములకు అతీతముగా కూడా యోగులు పొందకలరు.

## 10. ప్రాణాయామము ఆచరణావశ్యకత నాడీశౌచము

రాజయోగ అభ్యాసి, స్థిరాదిఆసనస్థితుడై ప్రప్రథమున నాడీశౌచ మను క్రియను అభ్యసింపవలెను. భగవత్పాదులు శంకరాచార్యులు "ప్రాణాయామముచే మనస్సునందలి మలినములు నశించినంతనే మనస్సు బ్రహ్మమునందు నిలుకడచెందును. అందుచే ప్రాణాయామము విధింపబడినది. నాడులను మొట్టమొదట శుద్ధిచేయవలెను. అప్పుడు ప్రాణాయామము అభ్యాసము చేయుటకు సామర్థ్యము ఏర్పడును బొటనవ్రేలితో కుడిముక్కు పుటమును మూసి, సామర్ధ్యము ననుసరించి ఎడమముక్కు పుటముచే గాలిని పూరింపవలెను. వెంటనే ఆలసింపక యెడమముక్కు పుటమును మూసి, కుడిముక్కు పుటము ద్వారా గాలిని వదులవలెను. ప్రాతః కాలము, మధ్యాహ్నము సాయంకాలము, అర్ధరాత్రి ఈ నాల్గువేళలందు మూడు లేక ఐదు సార్లు ఇట్లభ్యాసము చేయుచు వచ్చిన ఎడల ఒకపక్షము లేక నెల దినములలో నాడీ శౌచ మేర్పడును. ప్రాణాయామమప్పుడు ఆరంభమగుచున్నది"అని చెప్పినారు, అనారోగ్యము సంశయముల లెక్కింపక ఆచరించిన, ధైర్యోత్సాహములు కల్గును-విశ్వాసము ఇనుమడించును.

## 11. ప్రాణాయామము - ఆచరణ విధానము (యౌగిక ప్రాణనిరోధము)

ప్రాణాయామ మనగా, యౌగిక ప్రాణనిరోధము. దీర్ఘకాలము ప్రాణాయామము నభ్యసించుటచే సూక్ష్మచలనములను వశపరచుకొనగలము. 1) శరీరమునందలి రొమ్ము, మెడ, తల అను ఈ

మూడుభాగములను నిక్కించి (నిటారుగా నిలిపి)సదా నిలుపుగ నుంచవలెను. (పద్మాసనము, స్థిరాసనము) కాలది కాలము ఇట్లు ఆసనము నభ్యసించినంతనే అది సులభమగును. ఒకానొక పరిమితి ననుసరించి ఊపిరి పీల్చుచు విడుచుచుండుటయే ప్రాణాయామములోని ప్రథమ సాధనము (నాడీశౌచము) దీని వలన శరీరమునకు క్రమగతి ఏర్పడును. 2) ఉచ్ఛ్వాస నిశ్వాసములతో "ఓం"అను మంత్రమును ప్రాణాయామముతోచేర్చి మానసికముగా ఉచ్చరించుట, క్రమగతిలో శ్వాస పీల్చుట, విడుచుట వలన శరీరమునందు క్రమగతి కలుగ నారంభించును. అందువలన ఎంత బదలికచెందిన నాడులైనను ఉపశమనముపొంది విశ్రాంతినొందును. సాధకుని ముఖమై ఖరి ప్రశాంతముగా కనబడును. కోమలకంఠస్వరము కలుగును. 3) ఇడానాడి మార్గమున అనగా ఎడమప్రైపు ముక్కుపుటము ద్వారా ఊపిరి పీల్చుచు, మనస్సును ఆ నాడిపై ఏకాగ్రము చేసి, నెమ్మదిగా ఊపిరి తిత్తులను శ్వాసముతో నింపవలెను. దీనివలన మీరు నాడీప్రవాహమును వెన్నుబాము క్రిందిభాగమునకు పంపి మూలాధార చక్రము నందలి కుండలీస్థానమునకు ప్రబల సంఘర్షణము కలిగించుచున్నారు తరువాత కొంతసేపటివరకును నాడీవాహినిని అచ్చటనే నిలుపవలెను. పింగళానాడిద్వారా శ్వాసతోకూడ ఈ నాడీప్రవాహమును మెల్లగా లాగుకొనుచున్నామని భావించి అనంతరము నెమ్మదిగా కుడి ముక్కు రంధ్రముద్వారా శ్వాసమును విడువ వలెను. ఇందులకు సులభ ప్రక్రియ. "కుడి ముక్కును బొటనవ్రేలితో మూసి యెడమ ముక్కుద్వారమున మెల్లగా శ్వాసమును లోనికి పీల్చుము. అనంతరము బొటనవ్రేలితోడను తర్జని లేక చూపుడు వ్రేలితోడను రెండు ముక్కుపుటములను మూసి నాడీప్రవాహమును క్రిందికి పంపుచున్నామనియు దానిచే సుషుమ్నయొక్క తుదిభాగమును తట్టుచున్నా

మనియు భావింపుము. అప్పుడు బొటనవ్రేలిని తీసివైచి కుడిపుటమున శ్వాసమును విడువవలయును. అనంతరము ఎడమముక్కును తర్జనితో మూసి కుడిపుటమున శ్వాసమును పీల్చుకొనవలెను. పూరకమును (శ్వాసపీల్చుట) నాలుగు క్షణములతో ఆరంభించి మెల్లగా వృద్ధి చేయుచుపోవుట మంచిది. నాలుగు క్షణములకాలము శ్వాసమును పీల్చి పదునారు క్షణముల కాలము శ్వాసమును లోననిలిపి (కుంభకము) ఎనిమిది క్షణములలో శ్వాసను విడువవలెను (రేచకము)ఇది యేకప్రాణాయామమగును. ఇట్లు ప్రాణాయామము చేయుచు, మూలాధారచక్రమును గూర్చి భావింపవలెను. 1) పైన చెప్పిన సంఖ్యా నియమము ననుసరించుచూ శ్వాసమును మెల్లగా పీల్చుకుని, వెంటనే నెమ్మదిగా విడిచి, స్తంభించి యుండవలెను. మూడవ ప్రక్రియ యందు శ్వాసమును కుంభించుటయు, నాల్గవప్రక్రియ యందు స్తంభించుటయు జరుపుట భేదము.

ఈపైరీతిత్తుల నారిచే నింపబడియుండు సుందర ప్రాణాయామమును ఉదయము నాలుగుసార్లు, సాయంకాలము నాలుగుసార్లు మాత్రమే అభ్యసింపవలెను. సామర్థ్యము ఉత్సాహము కలుగుచున్న కొలది క్రమముగా వృద్ధిచేయవలెను. క్రమము తప్పిన హానికరము.

మొదటిపద్ధతి ననుసరించి అభ్యసించినకొలదియు మనశ్శాంతి కలుగుచుండును. కేవలము ఓంకారము గూర్చి భావించిన చాలును. పనిచేయు కాలమును కూడ ఈ సాధనను అభ్యసింపగలరు. ఓంకార భావన మిక్కిలి తోడ్పడును. పూనికతో సాధన నభ్యసించినయెడల ఒకానొక దినమున కుండలినీశక్తి మేల్కొనును.

దినమునకొకట రెండు మారులు సాధనము చేయువారికి మనశ్శాంతియు శరీరస్వాస్థ్యమును చక్కని కంఠస్వరము మాత్రము లభించును.

మంత్రలయ ఆసన, రాజయోగములను సమన్వయ పరచిన నిత్యము, నిరంతరము షడక్షరీమంత్రజపము, శివపూజను ఆచరించుట వలన, అతిదుర్లభమై లభించిన ఈ మానవ జన్మలోనే ఉపాసకుడు ఆ పరమపద సోపానమైన మోక్షపదమును పొంది, నిరతిశయానంద సుధాంభోనిధిలో ఓలలాడగలడు.

## 12. అష్టాంగ సంక్షిప్త పరిచయము

రాజయోగసాధనకు అష్టాంగములను నిత్యము క్రమబద్ధముగా ఆచరించుట ఆవశ్యకము. అష్టాంగములెవ్వియన 1. యమము 2. నియమము 3. ఆసనము 4. ప్రాణాయమము 5. ప్రత్యాహారము 6. ధారణము 7. ధ్యానము 8. సమాధి.

**1. యమము :-** 1. అహింస 2. సత్యము 3. అస్తేయము (దొంగిలించుట) 4. బ్రహ్మచర్యము 5. అపరిగ్రహము (దానమును పుచ్చుకొనకుండుట) అను వాని ఆచరణమునకు యమమని పేరు.

**2. నియమము :-** 1. శౌచము 2. సంతోషము 3. తపస్సు 4. స్వాధ్యాయము 5. ఈశ్వరప్రణిధానముల నాచరించుట నియమ మనబడును.

**3. ఆసనము :-** పద్మాసనము, స్థిరాసనము వజ్రాసనము ఇత్యాది దీర్ఘాయువును కలిగించు ఆసనమున స్థితుడై రాజయోగసాధన చేయుట.

**4. ప్రాణాయమము :-** (ప్రాణనిరోధము) శబ్దా బాహ్య విషయములనుండి ఇంద్రియము లను మరల్చుట.



శ్రీపతి పండితారాధ్యుల మల్లికార్జున అయ్యవారు

ఆంతరంగిక శివపూజాదురంధరులు

శివయోగసిద్ధులు, ఆయుర్వేద వైద్య దురంధరులు

శరభ సాళ్వ మంత్రోపాసకులు

గ్రంధకర్తకు ఆయుర్వేద జిజ్ఞాస ప్రేరకులు

67వ పేజీ చూడండి.



శ్రీపతి పండితారాధ్యుల రామలింగేశ్వరరావు

అనుభవ యోగాభ్యాసకులు

యోగపరిశోధకులు, నిత్య శివారాధకులు

67 వ పేజీ చూడండి.

**5. ప్రత్యాహారము :-** మనశ్శక్తుల సమీకరించుట మనస్సు యొక్క బాహ్యవిషయములైన వ్యాపారముల నరికట్టుట ఇంద్రియ దాస్యమునుండి మనస్సునకు విమోచనము కల్గించుట.

**6. ధారణము :-** చిత్తమును మనస్సును ఒకలక్ష్యముపై నిలుపుట హితాహారమును మితముగా సేవించుటవల్ల సాధనము శీఘ్రఫల ప్రదమగును.

**7. ధ్యానము :-** ఏకాగ్రతయే రాజయోగమునకు పరమార్గము దీనిని గూర్చి బోధించు సూక్ష్మసాధనయే ధ్యానము ఏదైన ఒక లక్ష్యముపై మనస్సును నిశ్చలముగా నిల్పకల్గినంతనే. చిత్తము "ఆ లక్ష్యము వైపు అవిచ్ఛిన్నముగా" ప్రవాహరూపముగా పోవునట్టి శక్తిని పొందుటకే ధ్యానమని పేరు.

**8. సమాధి :-** ఇంద్రియానుభవమునందలి బాహ్యాంశమును తొలగించి, అంతరాంశమగు అర్థమును మాత్రమే, ధ్యానించునంతటి తీవ్ర మనశ్శక్తి, కలిగినప్పుడట్టి స్థితి సమాధి యనబడును.

మొట్ట మొదట నొక అవలంబముపై (లక్ష్యముపై) చిత్తము ఏకాగ్రత పొందవలయును. అట్టి ఏకాగ్రస్థితియందు చిత్తమును కొంత సేపు నిలువవలెను. అట్టి అవిచ్ఛిన్న ధ్యానముచే, ఇంద్రియానుభవము నందలి యే బాహ్యాంశము అవలంబ రూపమగు లక్ష్యముపై యున్నదో, అట్టి బాహ్యాంశమును విడిచి, అంతరాంశమునందు మాత్రమే చిత్తము నిలుపవలెను. ఇట్టి చిత్తమునకు సర్వము వశమగును.

యమనియమాది సాధనముల నభ్యసించుటవలన చిత్తస్థైర్యము కలుగును. మనోనిగ్రహ మేర్పడును. దానివల్ల సూక్ష్మలక్ష్య గ్రహణ

సామర్థ్యమేర్పడును. అట్టి చిత్తమును ధ్యానమునందు వినియోగింప వలెను. ధ్యానమునకు స్థూలమైన అవలంబనములతో ప్రారంభించి క్రమముగా సూక్ష్మావలంబనములను (లక్ష్యములను) గ్రహించుచూ కడకు నిరాలంబముగా చేయవలెను. మనస్సుముఖ్యందుగాచే సుఖదుఃఖాది సంవేదనములయొక్క బాహ్యాకారణములను, అనంతరము అంతశ్చలనమును, పిమ్మట మనఃప్రతీకారమును పరిశీలింపవలెను. ఇంద్రియానుభవముల బాహ్యాకారణములను చక్కగా గ్రహించినంతనే సూక్ష్మ పదార్థములను, సూక్ష్మ విషయములను సూక్ష్మరూపములను కనుగొనగలము. శరీరాంతర్గతములగు చలనములను యథారూపముగా పట్టింపగల్గినంతనే మనోవృత్తులు, భౌతికశక్తులుగా మారుటను ముందుగనే, మనస్సు వానిని నిరోధింపకల్గును. ఇంద్రియగోచరమగు ప్రతివిషయమును, ప్రతిభావమును, మనః ప్రతికారమువలనకల్గు ఫలితమునే కావున మనఃప్రతీకారమును పూర్ణముగా గ్రహించినంతనే యోగి సర్వజ్ఞుడగును. మనస్స్వరూపము అతనికి కట్టెదుట పన్పడును. సంపూర్ణ మనోనిగ్రహము సిద్ధించును. అనేక యోగసిద్ధులు అబ్బును. కాని వీనిచే మోహితుడైనచో వాని పురోభివృద్ధియిక అంతటితో సరిభోగ కాంక్షలు మహా విపత్కరములు. ఇట్టి దివ్యశక్తుల సహితము నిరాకరింప కల్గిన యెడల, యోగి సంపూర్ణమగు చిత్త వృత్తినిరోధమును సాధింపకలడు. రాజయోగము (రామకృష్ణ మతము).

మనస్సును, దృష్టిని అంతర్ముఖముచేసి, ప్రాణలింగస్థాన మైన హృదయముపై కేంద్రీకరించి జపముచేసిన శీఘ్రముగా మోక్షసాధన చేయకల్గును.

# ఆంతరంగిక శివపూజ-విషయ సంగ్రహము

ఉపాసకుడు ప్రారంభమున సగుణరూపమైన బాహ్య శివపూజా విధానమును ఆచరింపవలయును. దీనినే మంత్రయోగము అందురు. మంత్రయోగముకన్న లయయోగము, లయయోగముకన్న హఠ రాజయోగ విధానములు శీఘ్రఫలదాయకములు. ఈ ఆంతరంగిక శివపూజయందు లయయోగ, హఠయోగ, రాజయోగములను, ఉపాస కుడు భావాత్మకముగా అంతరంగమున సాధించు విధము వివరింప బడుచున్నది.

బాహ్యశివపూజ నిత్యము ఆచరించుటవల్లను క్రమశః దశావధాన విధానముగా లింగ నిరీక్షణమును, దృక్, త్వక్ మనో అవధానముల నిత్యము ఆచరించుట ద్వారా, ఉపాసకునికి ఆంతరంగిక శివపూజకు ప్రవేశము కలుగుచున్నది.

శైవశిద్ధాంతమున షట్త్రింశత్ తత్వములు పరమాత్మరూపు డైన శివునకును, జీవుడైన మానవునకును చెప్పబడినవి. ఈ లయ యోగమున ప్రతినిత్యము మానసికముగ, మూలాధార, స్వాధిష్ఠాన మణిపూరక, అనాహత, విశుద్ధి, ఆజ్ఞాచక్రాశ్రిత ఆచారలింగ, గురు లింగ, శివలింగ, చరలింగ ప్రసాదిలింగ మహాలింగముల యందు ఈ షట్త్రింశ తత్వోపచారముల ద్వారా పృథ్వీఆప తేజోవాయురా కాశములు అను పంచతత్వములను, ఆరవదియైన ఆత్మతత్వము నందు పూజించి, అర్చించి, లయమొనర్చుట ద్వారా లింగాంగ సంధా నము జరుగుచున్నది. మరియు భక్తస్థల, మహేశ్వరస్థల ప్రసాది స్థల, ప్రాణలింగిస్థల, శరణుస్థల, ఐక్యస్థలములను ఆరు సోపానము

లను, పంచాచార విధానమున, అష్టావరణవిధిని పూజించి అర్చించుట ద్వారా జీవాత్మైక్య సంధానము (ముక్తి) కలుగును.

హఠ(ఆసన) యోగ అభ్యాసము వలన దీర్ఘాయువు, శరీరపుష్టి కలిగి శివపూజ నిత్యముచేయుటకు తగు ఆరోగ్యము కలుగును.

ప్రతినిత్యము నాడీశౌచము, యోగిక ప్రాణాయామము ఆచరించుట ద్వారా, మూలాధారచక్రమున నిద్రించుచున్న కుండలినీశక్తిని షడక్షరీమంత్ర నిత్య జపోపాసనవల్ల (మానసికముగ) మేల్కొల్పవలెను. కుండలినీశక్తి (సుషుమ్నానాడి) ఊర్ధ్వగామియై మూలాధారాదిషట్ చక్రములను, బ్రహ్మ, విష్ణు, రుద్ర గ్రంధులను భేదించుకొని, క్రమశః సహస్రారస్థితుడైన కామేశ్వరుని యందు లయమొందును. భక్త్యాది షట్సోపానములయందు యధావిధిగ భావాత్మకముగ నిత్యము పూజించి, అర్చించుటద్వారా భ్రమరకీటక న్యాయమున, కర్పూర శిఖి న్యాయమున జీవాత్మైక్యసిద్ధి కలుగును.

మానవజీవిత ప్రమాణము అల్పమగుటవల్ల మంత్ర, లయ, హఠ, రాజయోగ సమన్వయమున 21000 షడక్షరీ జపమును నిత్యమును ఆచరించుట ద్వారా, దుర్లభమైన అనేక జన్మల అనంతరము కల్గిన ఈ మానవజీవిత ప్రమాణమునందే జీవాత్మైక్య సిద్ధిపొంది సదానందరూప మోక్షప్రాప్తి కలుగును.

## దశావధానములు

అవధానమనగా మనోనిశ్చలత. స్థూల సూక్ష్మ, కారణములనెడి దేహత్రయంబును, లింగ నిమగ్నత నొందించుటయే ఇందలి ప్రధా

నాంశము. దీనివలన ఈశ్వరత్వ- వశిత్వము లనెడి సిద్ధులు గలుగ గలవు.

**ఆచరణ క్రమము :-**

1. **లింగ నిరీక్షణము :-** 1. దృక్పటుత్వము = లింగమున దృష్టిని ఏకీభావ మొనరించుట.

   2. దృగ్విన్యాసము = వికారశూన్యంబగు నిరీక్షణము గలిగి యుండుట.

   3. దృగ్విలీనత దృక్కును జలక్షీర న్యాయమున లింగము నందు విలీనము చేయుట.

   4. దృక్స్థిరత్వము = నిర్దిష్ట స్థితియందు తప్ప ఇతరమును గనకుండుట దృష్టిమాంద్య, బిందుస్ఫారతలు, లేకుండుట.

2. దృక్పూజ (అష్టవిధము) దృక్కుచేతనే స్నాన-వస్త్ర-గంధ-అక్షత-పుష్ప-ధూప-దీప-నైవేద్య సమర్పణమును సమర్పించుట.

3. **త్వగ్వ్యాప్తి :-** త్వగింద్రియము ద్వారా కలిగిన స్పర్శానందము.

4. **స్తుతి :-** పరమేశ్వరుని నిగ్రహానుగ్రహ స్తోత్రములను వాగింద్రియముచే నిర్వహించుట.

5. **మనోవ్యాప్తి :-** లింగమునందు (పరమేశ్వరునందు) మనస్సును లీనమొందించుట. వీని ఆచరణమున అణిమా, మహిమా, గరిమాది సిద్ధులు లభ్యముకాగలవు.

6. **సానురాగమనోర్చన** :- ఇంద్రియాధిష్ఠానమగు మనస్సును శివునకు జేయు పాంచభౌతికార్పణము యందు స్థిరత్వము నొందించుట.

7. **గణప్రణామము** :- సర్వమును లింగమయము (బ్రహ్మమయముగా) నెంచి ప్రాపంచిక జీవగణమునందు శివస్వరూపమును భావించుచూ శరణుజేయుట.

8. **గణస్తుతి** :- అందరిని పరమేశ్వరుని ప్రమధ గణములుగా భావించి స్మృతియందుంచుకుని స్తుతించుట.

9. **గణలీలా నిమగ్నత** :- ప్రపంచము శివలీలానందమయముగ తలంచుచూ, సమరసీ భావమున నిమగ్నుడగుట.

10. **లింగ నిమగ్నత** :- అంతరింద్రియములను సార్వకాలికముగా లింగమున (శివతత్త్వమున) లీనమొనర్చుట. ఇట్టి భావము సడలకుండుటయే శివ జీవైక్యసిద్ధి యనబడును.

**లింగనిరీక్షణానంతర ధ్యానము** :-

శ్లో॥ చైతన్యం పరిపూర్ణమేకమచలం
జ్యోతిర్మయం వ్యాపకం ।
తత్పంచాక్షర మన్త్రి భావ్యమమలం
సూక్ష్మాతి సూక్ష్మం పరం ॥
లింగం బ్రహ్మ సనాతనం
సుమనసాధ్యాతవ్య రూపం సదా ।

71

బాహ్యాభ్యంతర సంస్థితం
పరశివం ప్రాణేశ్వరం భావయే ॥

కించిత్ నివేదనము చేసి, పుష్పము, బిల్వము, విభూతిని ఇష్ట లింగమూర్తిపై వుంచి, శరణుచేసి, ఆ ప్రసాదమును స్వీకరింప వలెను. గురుముఖత : దీని నాచరింప వలయును.

(శైవాగమములు)
శివయోగసారము

దృష్టిని రెండు కనుబొమ్మల మధ్యమున భ్రుకుటి కేంద్రీక రించి, జపముచేసిన మనస్సు శీఘ్రముగా వశపరచుకొనగలడు.

నాసికాగ్రముపై కేంద్రీకరించి జపముసల్పిన మనో ఏకా గ్రత, చిత్తశాంతి కలుగును.

# హఠయోగము

శరీరమందలి సర్వస్థూల సూక్ష్మ అవయములు, నాడీ మండలము ద్వారా ప్రవర్తింప చేయబడుచున్నవి. అందు ముఖ్య సాధనములు, షట్ చక్రములు. మస్తిష్కము మఱియు వెన్నెముక. ప్రతిక్రియయందును వీని సహాయము అత్యావశ్యకరము. కావున శీర్షాసనము, పద్మాసన, స్థిరాసనము, వజ్రాసనము, హలాసనము, భుజంగాసనము, సర్వాంగాసనము, మయూరాసనము, నౌళి, ధౌతి ఇత్యాదిప్రక్రియలను నిత్యం ఆచరించుట ద్వారా శరీరము మలరహితమగును. క్రియాసామర్థ్యము పెరుగును. వెన్నెముకను (straight) నిటారుగా ఉంచుట, కంఠ శిరస్సులతో సహా నిలువుగా ఉంచుకొని దిన కార్యక్రమములు జపాదులు ఆచరించుట ద్వారా శీఘ్రతరసత్ఫలితములు కల్గును. పతంజలిచే రచింపబడిన యోగశాస్త్రమున ఇట్లుదహరింప బడినది. యోగేన చిత్తస్య పదేన వాచా మలం శరీరస్యచ వైద్యకేన యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలిరానతోస్మి" అనగా మానవుడు చేయు క్రియలు 3 విధములు. 1. మానసికము 2. వాక్ సంబంధితములు 3. శరీరమునకు సంబంధించినవి. మనోవాక్కాయ కర్మలకు త్రికరణములు అనిపేరు. అందు మనస్సంబంధమైన వికారములను యోగాభ్యాసము వల్లను, వాక్ సంబంధమైన వికారములు తర్క వ్యాకరణాదిశాస్త్ర జ్ఞానమువల్లను, మరియు శరీర సంబంధమైన మలవికారములను (ఆయుర్వేద) వైద్యచికిత్సల వల్లను నిర్మూలనము చేసుకొనవలెను. మునులందఱిలోను శ్రేష్ఠుడై నట్టియు, యోగశాస్త్ర ప్రవక్త అయిన ఆ పతంజలి మహర్షికి అందరి కన్నముందుగా, మనోవాక్కాయ కర్మలచే త్రికరణశుద్ధితో సాష్టాంగ ప్రణామమాచరించుచున్నాను" అని చెప్పబడినది. కావున దీర్ఘాయు

వును, సుఖాయువును కోరు మానవులు తప్పక ప్రతినిత్యము యోగ ఆయుర్వేద జీవన విధానముల నాచరించుటవల్లనే, అది సాధ్యము ఎందువల్ల? సర్వస్థావర జంగమ సృష్టికి, స్థితికి. పృథి, వ్యాపస్తేజో వాయురాకాశములను పంచమహా భూతములు మూల కారణములు. యోగ ఆయుర్వేదములు రెండును పంచభూతాత్మకములే. కావున ఆరోగ్యరక్షణయందు, వ్యాధినివారణయందు, పంచభూతాత్మకమైనట్టి ఆహార విహార ఔషధములను, పంచాభూతాత్మికమైన, అతిసున్నితమైన సహస్రారకమలయుత షట్చక్రములను ప్రతినిత్యము ఆసనాదుల ద్వారా శుద్ధినొందించుట అత్యుత్తమమైన మార్గము. శరీరము జీవునకు కర్మభోగ సాధనము. ఈ జన్మయందే కర్మరహితుడై మోక్షమును సాధింపవలె నన్న ధర్మ, అర్థకామ మోక్షసాధనకు శరీర ఆరోగ్యస్థితి జీవన ప్రమాణము అతిముఖ్యములు. మానవ స్వల్ప జీవన ప్రమాణంలో కర్మక్షయము కలుగవలె నంటే మంత్ర, రాజ, హఠలయ యోగ నిత్యాచరణ మొక్కటియే సాధనము.

గీ॥ యోగమభ్యసింపరా హాయిహాయిగ ఉందరా
జీవాత్మ పరమాత్మ ఏకమవుతారురా
ఆసనాలు వేయరా ఆరోగ్యముగానుండరా
ఆసనాలు చేస్తుంటే రోగాలు రావురా
,, ,, ,, క్రొవ్వుకాస్త కరుగురా
షట్క్రియలు చేయరా దేహమంతా శుద్ధిరా
మలకణాలన్ని తొలుగురా షట్క్రియలు చేయరా
ఆరుక్రియల మహిమరా పరమశివుడు చెప్పెరా

కుంభకాలుచేయరా ఆయుష్షె పెఱుగురా
,, ,, ,, జ్ఞాన శక్తి పెఱుగురా
యోగమభ్యసించరా శక్తి నీకు కల్గురా
,, ,, శాంతి నీకు కల్గురా
,, ,, కర్మమారిపోవురా
,, ,, మనసు నీకు వశమురా
,, ,, కుండలిని లేచురా
కుండలిని లేచిందా కోరినది దొఱకురా
ఆనందం ఆనందం ఒకటే పరమానందం
ఏకాంతం ఏకాంతం మనసంతా బహుశాంతిరా
యోగమభ్యసించరా హాయిహాయిగ ఉండరా

(యోగ విశ్వనాథ్)

## (లయయోగము) సృష్టిక్రమము

సృష్టికి కారణభూతములైన పృథివ్యాపస్తేజో వాయురాకాశము లెడు పంచమహాభూతములను ఆ సృష్టికి కారకుడైన ఆ పరమశివుని యందు లయమొనర్చుటే లయయోగ ఆశయము.

మనోవాక్, కాయములను త్రికరణములచే మూలాధారాది చక్రములందున్న పృథివి, జలము, అగ్ని వాయువు ఆకాశము అను తత్వములను క్రమశః తిరిగి నిత్యపూజ సమయమున చిచ్ఛక్తియుత మహాలింగమునందు లీనమొనరించుట ద్వారా (పూజించి, అర్పించుట ద్వారా) ఈ మానవజీవిత స్వల్పప్రమాణమందే కర్మవిముక్తుడై మోక్షమును సాధింపగల్గుతాడు. ఇదియే అంతరంగిక పూజ. (లయ యోగ విధానము).

| సృష్టిక్రమము | | | లయక్రమము |
|---|---|---|---|
| ఆకాశము | ↓ | | ↑ మహాలింగమునందు |
| వాయువు | | | ప్రకృతి (చిచ్ఛక్తి)యందు |
| అగ్ని | | | ఆకాశతత్వమునందు |
| జలము | | | ↑ వాయుతత్వమునందు |
| పృథివి (భూమి) | ↓ | | అగ్నితత్వమునందు |
| ఓషధులు | | | జలత్వమునందు |
| అన్నము | | | పృదీవీతత్వమును |
| పురుషుడు | ↓ | → | ↑ |

# లయ యోగాచరణ విధానము

అంతరంగిక శివపూజ - మూడు విధములు 1) లయ యోగము 2) ఆసనయోగము 3) రాజ యోగము. లయ యోగము నకు షట్కాల శివపూజయనియు పేరుకలదు. ఇందు ఆ పరమశివుని భావించి మానసికముగా దర్శించి, (పూజించి) అర్చించుట ముఖ్యాంశము. మరియు నిత్యము మూలాధారాది షట్ చక్రములను తత్స్థిత సద్యోజాతాది షణ్ముఖములను క్రియాశక్త్యాది షట్ శక్తులను, ఆచారాది షట్ లింగములను భక్తస్థలాది షట్ స్థలములను, పంచభూతాది తత్వములయందు తిరిగి దానిని ఆరవ తత్వమైన ఆత్మయందు (మహాలింగమునందు) క్రమశః షట్కాల పూజద్వారా లీనమొనర్చుటయే యీ లయయోగ ప్రధానాంశము. ప్రారంభమున సాధకుడు సగుణరూప శివుని మంత్రయోగమున పూజించి, అర్చించి, లింగనిరీక్షణ విధానముద్వారా. (అంతరంగిక శివపూజ చేయుటకు దృక్మనో కాయముల ద్వారా) అభ్యసించును. పైన పేర్కొన్న లయ విధానరూప అంతరంగిక పూజ భావనాత్మకమై, నిర్గుణమై అతి శీఘ్ర ఫలప్రదము సులభ ఆచరణయోగ్యము అగును. సత్వగుణయుతుడైన ఉపాసకుడు పైవిధానముగా అంతరంగిక పూజనుజరుపుటద్వారా శీఘ్రముగా మోక్షమును ఈ జన్మమునందే పొందకలుగును. అట్లుకాక కామాది అరిషడ్వర్గమును, రాగాది ఉప శత్రువర్గమును కల్గించు రజోగుణయుతుడైనచో, అతనికి ముక్తి కలుగుట దుర్లభము. అది ఏకాగ్రతతో సాధించినను చిరకాలము నిలువక ఉపాసకునికి అహంకారము, దర్పము । యుక్తాయుక్త జ్ఞాన రాహిత్యము, దంభము, రాక్షసత్వము మొదలగు గుణములను కలిగించి

న్మత్తునిగా చేయుటకే సహకరించును. ఇక తమోగుణయుక్తుని హెచ్చి చెప్పనేల. అతనికిది అసాధ్యము.

## షట్ చక్రములు - వివరణ

**మూలాధారచక్రము :-** పిండాండ బ్రహ్మాండమంతయు పృధివ్యాపో స్తేజోవాయురాకాశాత్" అను పంచభూతములలో ఏర్పడుచున్నది. గుదస్థానమున ఈ మూలాధార చక్రమున్నది, అచ్చట జీవరూపుడైన శివుడు, క్రియాశక్తిరూపమగు కుండలినీ (ఈ) చక్రమును ఆశ్రయించి యున్నారు. ఇచ్చట నుండియే నాద బిందు, హంసాదులు ఉద్భవించుచున్నవి. ఇది కామఫలప్రదమగు కామరూపపీఠము, ప్రధానముగా పృథ్వీఅంశము కలది. వ, శ, ష, స అను నాలుగు దళములు లేక బీజాక్షరములతో కూడుకుని యున్నది. పాదాది జానుపర్యంతము దీని వ్యాప్తి గలదు. ఆచార లింగమునకు, క్రియాశక్తిస్థానము. నకార బీజముకలది సద్యోజాత ముఖము గంధ ద్రవ్యముచే తృప్తి పరచవలెను. ఇది భక్తస్థలము క్రియాశక్తిని ఉపాసించుటవలన అస్థి గత రోగనివృత్తికల్గును పృధిపీఅంశకలది. పృథివీతత్వము "లం" అను బీజాక్షరముతో కూడుకుని యున్నది. మహాగణాధిపతి దీని కధిపతి. ఉపాసకుడు నిశ్చలభక్తివల్లను, నిత్య మంత్ర, జపాదుల అనుష్ఠానము వల్లను, అక్షరోపాసనవల్లను, లయ ఆసన యోగసాధన వల్లను, మహాత్ముల అనుగ్రహమువల్లను, సద్గురు కటాక్షమువల్లను, పూర్వజన్మకృత పుణ్యఫలము వల్లను, జడరూపము నిద్రాణము, మోహమాయాదుఃఖములకు కారణము అయిన పరాశక్తి రూపకుండలినిని జాగృతమొనర్చి (ఊర్ధ్వగామిగా షట్ చక్రములను, త్రివిధ గ్రంధులను భేదించి,) సహస్రారకమలమున

కామేశ్వరునిలో కలియును, ఈ మూలాధార చక్ర ప్రబోధమువల్ల, సత్వగుణయుతుడైన ఉపాసకునకు అణిమాది అష్టసిద్ధులు సులభముగా సిద్ధించును. ఆయురారోగ్య జ్ఞానములు కలుగును, ఉపాసకుడు ఆ సిద్ధులకు లోలుడుకాక పరమేశ్వరార్పణం చేసి, నిత్యోపాసన చేయుటద్వారా మోక్షమును సాధింపగలుగును.

అట్లుకాక కామాది అరిషడ్వర్గము, రాగాది ఉపశత్రు వర్గములో కూడి రజోగుణయుతుడైనచో అణిమాది అష్టసిద్ధులు లభించగనే వానికి ప్రలోభపడి ప్రవర్తించును. తద్వారా తన ధ్యేయమును సాధింపలేక పోవుటయే కాక నిత్యసాధనము వలన అతనియందు దంభము (కపటం) దర్పము (గర్వము) అహంకారము, క్రోధము ఈర్ష్యాద్వేషములు యుక్తయుక్తా విచక్షణాజ్ఞాన రాహిత్యము, మదము (తనకంటే గొప్పవారు లేరనుభావన) కల్గును. చంచలచిత్తులై, ఉన్మత్తులై వ్యవహరింతురు. తమోగుణయుతుడైన సాధకుడు ఏమియు సాధింపలేడు.

అరుణోదయ కాలమున, షడక్షరీ జపమును, పిపీలికా యోగమున పద్మాసనస్థితుడై 600 (హంసలు) చేయవలెను.

**స్వాధిష్ఠాన చక్రము** :- ఇది మూత్రస్థానము నాశ్రయించియున్నది. వామదేవ ముఖ, జ్ఞానశక్తియుత గురులింగస్థానము, "మ"కార బీజము తపనోదయ కాలమున 6000 హంసల జపము చేసి రసద్రవ్యముచే తృప్తి పరచవలెను. జలతత్వయుతము జలాంగము జాన్వాది నాభిపర్యంతము వ్యాపకము కలది "వం" జలతత్వ బీజాక్షరము బ, భమ య,ర,ల"అను ఆరుదళములు కలది మహేశ్వరస్థలము మేదో ధాత్వాశ్రితము బ్రహ్మ దీని కధిష్ఠానదేవత జ్ఞానశక్తి స్తోత్రపఠనము, మేధారోగహరము తపనోదయకాలమున

పద్మాసనస్థితుడై మర్కట యోగమున, షడక్షరి జపమును 6000 చేయవలెను.

**మణిపూరక చక్రము :-** నాభిస్థానము నాశ్రయించి యున్నది. అఘోరముఖ, ఇచ్ఛాశక్తియుత శివలింగస్థానము. 'శి'కార బీజము. సంగవకాలమున 6000 షడక్షరి జపముచేసి రూప ద్రవ్యముచే తృప్తి పరచవలెను. తేజోతత్వము కలది. తేజోంగము నాభ్యాది హృదయ పర్యంతం వ్యాపనము కలది. "రం"బీజము."డ,ఢ,ణ,తథ,దధన,పఫ" అను పది దళములు కలిగియుండును. మాంసధాత్వాశ్రితము. విష్ణువు అధిష్ఠానదేవత. ప్రసాదిస్థలము. ఇచ్ఛాశక్తి స్తోత్రము పఠన మాంస ధాతు గతరోగహరము. సంగవ కాలమున గోవత్సయోగమున 6000 షడక్షరి జపం పద్మాసనస్థితుడై చేయవలెను.

**అనాహత చక్రము :-** హృదయము స్థానము నాశ్రయించి యున్నది.

అనాహతస్య శబ్దస్య, తస్యనాదస్య యోధ్వనిః,
ధ్వనిరంతర్గతో జ్యోతి, జ్యోతి రంతర్గతంమన,
తస్మనో నిలయం యాతి తద్విష్ణో పరమం పదం"ఇతి

ప్రాణలింగ స్థలము. తత్పురుషముఖ, ఆదిశక్తియుత చరలింగ స్థానము. "వ"కార బీజము. మధ్యాహ్న కాలమున 6000 పంచాక్షరి జపమునుచేసి స్పర్శ ద్రవ్యముచే తృప్తిపరచ వలెను. వాయు తత్వము. వాయువాంగము హృదయాది భ్రూమధ్య పర్యంతము వ్యాపకము కలది. "యం" బీజము. క,ఖ,గ,ఘ,ఙ,చ,ఛ,జ,ఝ,ఞ, ట,ఠ అను 12 దళములతో కూడినది. రుద్రుడు దీని కధిష్ఠాన దేవత. రక్త ధాత్వాశ్రితము. ఆదిశక్తి స్తోత్ర పఠనము రక్తధాతుగతరోగ హరము.

మధ్యాహ్న కాలమున విహంగ యోగమున 6000 షడక్షరి పద్మాసనస్థితుడై చేయవలె.

**విశుద్ధి చక్రము :-** కంఠము నాశ్రయించి యున్నది. ఈశాన ముఖ పరాశక్తియుత ప్రసాదలింగ స్థానము యకార బీజము. సాయంకాలమున 1000 హంసలు షడక్షరీజపము చేసి శబ్ద ద్రవ్యముచే తృప్తిపరచవలెను. ఆకాశ తత్వము ఆకాశాంగము. భ్రూమధ్య బ్రహ్మరంధ్ర పర్యంతము వ్యాపకము గలది. "హ"కార బీజము. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఐ, ఓ, ఔ, అం, అః అను 16 దళములు కలది. పరాశక్తి విశుద్ధి చక్రాశ్రితయై వామాంగియై త్వక్ ధాత్వాశ్రితయై యున్నది. మహేశ్వరుడు దీని కధిష్ఠానదేవత పరాశక్తి స్తోత్రపఠనము రస(త్వకగత రోగహరము.

సాయంకాలమున మత్స్యయోగమున 1000 షడక్షరి పద్మాసనస్థితుడై చేయవలెను.

**ఆజ్ఞా చక్రము :-** భ్రూమధ్యము నాశ్రయించి యున్నది. హృన్ముఖ, చిచ్ఛక్తియుత మహాలింగమునకు స్థానము. ఇది ఐక్య స్థలము "ఓం" బీజము. ఆనందద్రవ్యతృప్తి. అర్ధరాత్రియందు 1000 షడక్షరి చేయవలెను. ఆత్మతత్వము. ఆత్మాంగము కలది. చిచ్ఛక్తి వామాంగియై మజ్జో ధాత్వాశ్రితమై యున్నది. హం, షం అను ద్విదళములు కలిగియున్నది. చిచ్ఛాప్తి స్తోత్రపఠనము మజ్జా దాతుగత రోగహరము.

అర్ధరాత్రి కచ్ఛపయోగమున 1000 షడక్షరీ పద్మాసనస్థితుడై చేయవలెను.సదాశివుడు అధిష్ఠాన దేవత.

**సహస్రార చక్రము :-** కామేశ్వరి కామేశ్వరులకు నిలయము

ఓజోశక్తి ఇచ్చట కేంద్రీకరింపబడి ఘనీభవించి యుండును. నిత్య షడక్షరీ ఉపాసనద్వారా కుండలినీశక్తి ప్రబోధితమై (కామేశ్వరీ రూపియై) షట్చక్రములను, మూడు గ్రంధులను దాటి సహస్రార మందు, బిందురూపమైన కామేశ్వరునితో జీవాత్మైక్య సంధానము పొందినపుడు, ఓజోశక్తి ద్రవించి శరీరమందలి సర్వధాతువులను తృప్తిపరచును. మరియు సుమనోబుద్ధులను ఆ పరమాత్మయందు కేంద్రీకరించుట ద్వారా సర్వప్రపంచ విషయములను తెలిసికొనుట, నిగ్రహానుగ్రహ శక్తి కలుగును. సత్వగుణోపేత ఉపాసకుడు ఆ శక్తిని సద్వినియోగ పరచుకొని జీవితమును సార్థకముచేసుకొని, మోక్షమును సాధింపగలడు. ప్రతి నిత్యము 1000 షడక్షరి చేయ వలెను.

ఆ. కనుల చూపునిలిపి కాంతిని గమనించి
కాంచవలెను చిత్రకళలు దాటి
కోట కొమ్మచేరి కోర్కులదంపరా
విశ్వదాభిరామ వినుర వేమ!

ఆ. కనుల రెంటి నడుమ గాసంత నిలిపిన
బొమల మీది చూడ్కి బొందచేయు
క్రమమెటింగి లోని కాంతిని పట్టుము
విశ్వదాభిరామ వినుర వేమ!

ఆ. కన్నుమిన్ను చేసి కాంతిని గమనించి
తన్ను నిలిపి చూచి తలపు వదలి
యున్నవాడు పరము గన్నవాడెయగు
విశ్వదాభి రామ వినుర వేమ!

ఆ. కరతలంబు నెత్తి కాలి నదిమి పట్టి
ఉర్ధ్వ దృష్టి చేత నారన నిల్పి
సర్వమై త నరుట చాల నాయువు కల్గు
విశ్వదాభి రామ వినుర వేమ !

ఆ. చంద్ర సూర్య గతుల జర్చించి వేగమే
రంధ్రముననను జొచ్చి రంగుమోర
చంద్రశాల చేరి చైతన్య మందరా
విశ్వదాభి రామ వినుర వేమ !

20. ప్రస్థాన త్రయమంటే ఏమి ? వాటిని సాధించే దెలా ?

1. పూర్వ జన్మ సంచిత కర్మ ఫలము.

2. స్వయం కృషి.

3. దైవ కృప అను మూడింటి సంపుటికి ప్రస్థాన త్రయ మని పేరు. పూర్వ జన్మార్జిత పుణ్య ఫల శేషము వల్ల మనకు, సృష్టిలో అతిఉన్నతమైన, అతిదుర్లభమైన మానవజన్మ పరమేశ్వరుడు ప్రసాదించాడు. మానవుడు సన్మార్గగామియై సద్బుద్ధితో మనో వాక్కాయ కర్మలను త్రికరణముల శుద్ధితో స్వయం కృషి చేస్తే ఆపరమేశ్వరుని కృప వలన శీఘ్ర కార్యసాధనకు మార్గము గోచర మవుతుంది. మరియు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులను చతు ర్వర్ణములు మానవుని పూర్వజన్మసంచిత కర్మ శేషము వల్లనేకల్గును, మానవుడు నిత్య భగవదారాధనవల్ల కార్య సాధనచేయకల్గుతాడు

క్రమశః ఇనుము స్పర్శ వేది సంపర్కము వల్ల బంగారముగా మారి నట్లుగా బ్రహ్మజ్ఞానియై, మోక్షసాధన చేయకల్గుతాడు.

**2. స్వయం కృషి:** "గాలిలో దీపముపెట్టి దేవుడానీ మహిమ" అని తలంచుచూ అకర్మణ్యుడు కారాదు. చిత్తశుద్ధితో సద్బుద్ధితో కృషి చేస్తే, ఆకృషి క్రమంగా ఫలిస్తుంది.

**3. దైవకృప :** కార్యసాధనకు, పూర్వజన్మ సుకృత ఫల శేషము, స్వయం కృషి అను రెంటిని సాధించినను తగు ఫలము సిద్ధింపదు. దైవకృప (అదృష్ట)రూపమైన ఆ భగవదాశీర్వాదము, పై రెంటితోపాటు లభించుటవల్ల కార్యము సఫలమవుతుంది. దైవ కృప సాధనోపాయాలు రెండున్నవి.

1. నవవిధభక్తితో ఆపరమశివుని నిర్మల చిత్తముతో ఆరా ధించటం.

2. సద్గురువు కటాక్షము వల్ల మంత్రోపదేశమునొంది ప్రతి నిత్యము మంత్రజప అనుష్ఠానం చేయుట ద్వారా (గాయత్రీ మహా మంత్రము) జ్ఞానోపలబ్ధి కల్గి ఆ పరమేశ్వరి అనుగ్రహమునకు పాత్రత సద్బుద్ధి, సుజ్ఞానము లభిస్తాయి.

పూర్వజన్మ సుకృతము, స్వయంకృషి మరియు దైవకృప అను మూడునూ పై విధంగా సాధించుట వల్ల సర్వ అభీష్టసిద్ధికల్గు తుంది.



## 21. గాయత్రీ మంత్ర నిత్యానుష్ఠాన అవశ్యకత

ఈః ప్రపంచములో జరిగే కార్యములు ఉదా: 1. వర్షపాతము 2. జననమరణములు, 3. సూర్యచంద్రాది క్రమగమనము అదృశ్య రూపమైన ఆ హిరణ్మయి, అయిన చిచ్ఛక్తి చేత లోకకల్యాణము నకై నిర్వర్తింపబడుయున్నవి. ఆచిచ్ఛక్తియే మాతృ స్వరూపిణి అయిన మూలప్రకృతి పరమశివుని అర్ధాంగి. వారిరువురు మాతృ పితృ రూపమున సర్వసృష్టి, స్థితికి అవసాన కాలమునలయమునకు కారకులు. మనకు అతిదుర్లభమైన మానవ జన్మను ప్రసాదించేదివారే ఆదిదంపతులు కావున ప్రతినిత్యము నిరంతరము ఆదిమాతా పితరు లకు వినమ్రులై కృతజ్ఞులై జీవించటం కనీస మానవకర్తవ్యము.

జీవి యొక్క ప్రారబ్ధము స్వయంకృత పుణ్య పాప ఫలమే, కావున మానవుడు సన్మార్గగామియై సుబుద్ధితో తన కృత్యములను నిర్వర్తిస్తూ క్రమశః ధర్మ, అర్ధకామ మోక్ష సాధన చేయకల్గుతాడు. అటులగాక రజోతమో గుణప్రభావితుడై చరిస్తే, నిత్య భగవదారాధన చేస్తే, భోగ భాగ్య దశవిధ (పశు, పుత్రాది) సంపన్నుదౌతాడు గాని మోక్షసాధకుడు కాలేడు. కావున ప్రప్రథమమున, మానవుడు సద్బుద్ధి భావనను నిత్యము ఆచరణం ద్వారా సాధించాలి. సర్వపాప పుణ్య ఫలములకు మనోబుద్ధులే కదా కారణములు ? ఆ సద్బుద్ధి సాధన, తద్వారా చతుర్విధ పురుషార్థ సాధన కొఱకు నిత్యగాయత్రీ మంత్ర జపానుష్ఠానమవుసరము. ఆ చిచ్ఛక్తియే గాయత్రీ దేవి సుమా! ఆ దేవి ప్రాతః కాలమున గాయత్రీ అనియు, మధ్యాహ్న సమయమున

సావిత్రీ అనియు, సాయంకాల సమయమున సరస్వతీ స్వరూపముగా చెప్పబడుతుంది. "గాయంతంత్రాయత ఇతిగాయత్రీ" అంటే నిత్య స్మరణాదుల వల్ల మానవుని ఆధోగతి పాలుకాకుండా రక్షించునది గాయత్రీ అని అర్థం "గాయత్ర్యా నవరంధ్యానం, గాయత్రాన పరం శృతం గాయత్రాన పరం జపం, గాయత్రాన పరం తపః" అంటే, గాయత్రీ దేవి ఉపాసనకన్నమించిన, జప, తప, ధ్యానములు లేవని శాస్త్రములు చెప్పుచున్నవి.

నిత్య గాయత్రీ అనుష్ఠానం వల్ల కల్గు ఫలితములు.

1. సత్శీలము, సత్యత, సహనము, భగవద్భక్తి భ్రాతృభావము సద్బుద్ధి ఉపాసకునికి సిద్ధిస్తాయి.

2. సద్భావన, సద్బుద్ధి జనించుటవల్ల ధర్మాచరణము అలవడుతుంది. అది పుణ్య ఫలప్రాప్తికి క్రమశః మోక్ష సాధన హేతువౌతుంది.

3. అష్టవిధ దరిద్రములు నశిస్తాయి.

4. 1. శమ, 2. దమము, 3. తితీక్ష, 4. శ్రద్ధా, 5. ఉపరతి, 6. సమాధానము అను శమాదిషట్కము ఉపాసకుని యందు జనించి మోక్ష సాధనాసక్తుడౌతాడు.

5. తనను నరకము నుండి ఉద్ధరించుకొనుటయేకాక లోక కల్యాణ కారకుడౌతాడు.

6. శతవిధ, అపమృత్యుహరము, మంచి స్నేహితుని వలె వెన్నంటి ఉపాసకునికిరక్ష, నిత్య సంధ్యోపాసన వల్లనే ఆ గాయత్రీ ఆశీర్వాదము, కృప పొందగల్గుతాము.

## 22. సంధ్యోపాసన - దాని ఆవశ్యకత :

"సంధ్యోపాసతే సంధ్యా" వందనమని పేరు. సూర్యోదయ, మాధ్యాహ్నిక, సూర్యాస్తమాన సంధికాలముల యందు ప్రతినిత్యము సూర్యమండలాంతర్వర్తియైన చిచ్ఛక్తియుత హిరణ్మయ రూపుడైన ఆ పరమ శివుని అర్చించుటయే నిత్యశివారాధనమే సంధ్యోపాసన. దీనిని మానవుడు సద్గురువు వల్ల మంత్రోపదిష్టుడై మాయామోహ రూప అజ్ఞాన నివృత్తికై, కైవల్య జ్ఞాన సిద్ధికై ఆచరింపవలయును, సూర్యోదయాస్తమానముల సంధియందు ఆచరింపబడును గాన సంధ్యా అని పేరు. ఈ సంధి కాలముల జ్ఞాన ప్రాప్తికై చేయబడు మంత్ర జపోపాసనయే సంధ్యోపాసన. మంత్ర జప అనుష్ఠానము ద్వారా మూలాధారాశ్రిత జడరూప కుండలిని జాగృతము చేసి, షట్చక్ర ములను బ్రహ్మవిష్ణు రుద్రగ్రంధులను, అధిగమించి (సుషుమ్నా నాడిని) సహస్రారస్థిత సదానందరూప ఆ పరమశివునియందు లయ మొనర్చుటయే సంధ్యోపాసన విశిష్టత, అది ఎట్లు సాధించాలి ?

అమృతమయులు అతిపవిత్రులు లోకకల్యాణ కారకులైన చిచ్ఛక్తియుత పరమశివుని, ఉపాసకుడు బాహ్యాభ్యంతరశుచియై సద్భావనచే, చిత్తశుద్ధితో నిత్యము ఆరాధించుటయే ఏకైక తరుణోపాయము.

**సంధ్యోపాసన మూడు భాగములు.**

**సంధ్యాంగములు**

1. అర్ఘ్యప్రక్షేపము దీని వలన ఉపాసకుడు నిత్యము పవిత్రుడౌతాడు.
2. గాయత్రీ మంత్రజపానుష్ఠానము-దీనివల్ల సద్బుద్ధి, సద్భా

వనశక్తి, ధర్మాచరణము సంధ్యాషట్కము, శమాదిషట్కము అలవడుతాయి. ''ధర్మోరక్షతి రక్షతః''

3. **సూర్యోప స్థాపనము:** మాతాపితాగురువులకు, తనకు జన్మ ప్రభృతి చతుర్విధ పురుషార్థ సాధకులగు సూర్యాది నవ గ్రహములకు, ఋషి,మున్యాదులకు కృతజ్ఞతాభివందనము చేయుట.

## 23. ఆచమనమంటే ఏమిటి? ఆచమనమువల్ల కల్గు ఫలితములు

మానవునకు బాహ్యాభ్యంతర స్రోతో శుద్ధినికల్గించుట. అతిపవిత్రుడైన ఆ చిచ్ఛక్తియుత పరమశివుని పూజించే అర్హతను, ఉపాసకుని పవిత్రునిగా చేయుటవల్ల కల్గించుటకు, అతిముఖ్యమైన సాధనమే ఆచమనము. అశుచియై ఎట్టి కార్యము నాచరించిననూ, అది నిష్ఫలము, అల్ప ఫలయుతమే అగును. అందువల్ల సర్వదా అతి పవిత్రరూపమైన జలమును మంత్రించి, ఆ మంత్రోదకమును ముమ్మారు లోనికి పుచ్చుకొనుట శరీరాంగములపై దురితక్షయ కారకముగా ప్రోక్షణ (మార్జనము) చేయుటవల్ల బాహ్యాభ్యంతర శుద్ధి ఉపాసకునికి కల్గుతుంది.

ఈ ఆచమనము నాల్గు విధములు. 1) శ్రౌతాచమనము 2) పురాణాచమనము 3) స్మృత్యాచమనము 4) మంత్రాచమనము. ముమ్మారు జలమును లోనికి పుచ్చుకొనుట వలన ఋగ్వేదమును, రెండు మార్లు క్రింది పెదవిని పైపెదవిని స్పృశించుటవలన యజుర్వేదమును, రెండుపెదవులను ఒకేమారు స్పృశించుట వలన సామ

వేదమును, ఎడమ హస్తమును, రెండు పాదములను, శిరస్సుపైన జలప్రోక్షణము చేసుకొని, చక్షునాసిక, కర్ణరంధ్రముల పైనను హృదయమును స్పృశించుట వలన అథర్వణవేదమును, బ్రాహ్మణ ఇతిహాసపురాణ కల్పగాథా సారాంశములను, అనగా తదంతర్గత చిచ్ఛక్తియుత పరమశివుని సంతృప్తివరచినవాడు అగును. ఒకమారు ఆచమనము చేయుటవల్లనే ఇంత ఫలముకల్గును.

**1. పురాణాచమనము :-** వాత, మూత్ర, పురీషోత్సర్జనానంతరము భోజనానంతరము, అస్పర్శనీయ పదార్థ స్పర్శానంతరము ఆచరించుట. సంధ్యావందనమునందు శాశ్వత శివ ఇత్యాది పంచ వింశతి శివనామోచ్చారణ వలన శరీర బాహ్యాభ్యంతర శుచికలుగును.

**2. శ్రౌతాచమనము :-** శంకరాయ స్వాహా, శాంతాయ స్వాహా, శంభవేస్వాహా అని ఉచ్చరింమటవలన, బ్రహ్మయజ్ఞము లోను,దర్శపూర్ణ మాసాది శ్రౌతకర్మల యందును, సంధ్యావందనము నందును ఆచమనము చేయుటవలన ఉపాసకుడు పవిత్రుడగును.

**3. స్మృత్యాచమనము:-** (స్మార్తాచమనము) శ్రౌతాచమనము వలెగాని పురాణాచమనమువలెగాని "శంకరాయస్వాహా"ఇత్యాది శివ నామోచ్చారణములేకుండా కేవలము పురాణాచమనము వలె జలప్రోక్షణ, ప్రాశనాదుల నాచరించుటయే స్మృత్యాచమనము.

**4. మంత్రాచమనము :** మలమూత్ర అపానవాత విసర్జనానంతరము జ్ఞాతాజ్ఞాతములుగా సంభవించునవియు, అభక్ష్యభక్షణ, అపేయపాన, అగమ్యాగమ్యగమనాదుల వలన ప్రాప్తించునవి యగు సమస్త దురిత (పాప) క్షయార్థము, మంత్రాచమనము ఆచరింప వలెను.

మార్జన మనగా శరీరాంగములపై అపవిత్ర పదార్థ స్పర్శ వలన కల్గు పాపమును మంత్రజలప్రోక్షణము. చేయుటవల్ల ఆ పదార్థములు పవిత్రవంతములగును.

## కలశపూజ ఎందుకుచేయాలి

సృష్టిలో అతిపవిత్రమైనవి, ప్రతినిత్యము మానవాదులుప్రాణ రక్షణకై వాడబడేవి ముఖ్యమైనవి ఐదు పదార్థములున్నవి 1.జలము 2. నెయ్యి 3. పెరుగు 4. పాలు 5. శర్కర. వీనిని పంచామృత ములు అని పిలుస్తారు.

అతి పవిత్రుడైన ఆ పరమశివుని ఆరాధించాలంటే, ఉపాస కుడు, పూజోపయుక్త పదార్థములు, పూజాస్థలముకూడా పవిత్రము లుగా ఉండాలి కదా?

జలము పంచామృతములలో ముఖ్యమైనది. కలశపాత్ర (బం గారు, వెండి, రాగి)తో చేసినదిగా ఉండాలి. అందు పవిత్రజలమును సేకరించి, దానిని మంత్రోచ్చారణచే అమృతమయముగా, సర్వతీర్థ సమముగా, శివాత్మకముగా, సర్వసృష్టికి, సర్వదేవతా, సర్వయజ్ఞ ఫలప్రసాదముగా రూపొందించి. ఆ తీర్థముతో సర్వపూజా ద్రవ్యము లను, దురితాక్షయ కారకములు (సర్వపాపక్షయకరము)గా మం త్రించి భగవదార్చనకై వినియోగించాలి.

ఆ పవిత్రోదకమును కొంచెము ఆచమన పాత్రయందు వేరే తీసుకొని పూజకు ఉపక్రమించాలి. ఆ కలశమును అలంకరించి, పుష్పము, గంధము, విభూతి అక్షితలను ఉంచి, ఆమంత్రిత జలమును భగవసాన్నిధ్యంలో ఉంచాలి. అపవిత్రమైన పదార్థములను అతి పవిత్రముగా రూపొందించే దివ్యసాధనమిది.

పూజా, వ్రత, యజ్ఞాది సత్కర్మల నాచరించుటకు ప్రప్రథమంగా కలశారాధన తప్పక ఆచరించాలి. అట్టి మంత్రిత పవిత్ర జలప్రోక్షణ ఆచమనాదులచే, ఆ పరమశివునికి అర్చనాదులాచరిస్తే 1. శివప్రీతి 2. శివానుగ్రహము తప్పక కల్గుతుంది.

## 25. సర్వకార్య సాధనయందు త్రికరణశుద్ధి సద్భావనా ప్రాశస్త్యము

పరమేశ్వరుడు జీవునికి 1. మనస్సు, 2. వాక్ 3. కాయ కర్మలను మూడింటిని (త్రికరణములను) ప్రసాదించాడు. ఎందుకు? ఈ మూడు ఉపకరములను చతుషష్టి కళల ఆచరణ ద్వారా నవవిధ భక్తి ఆచరణము ద్వారా, స్వాత్మికమై సద్భావనతో, ఆ పరమోన్నతమైన శివసాయుజ్యం సాధించాలి.

1. త్రికరణములలో మనస్సు అతి ముఖ్యమైనది సూక్ష్మమైనది. బంధమోక్షములకు కారణము కోతివలె అతి చంచలమైనది. అట్టి మనస్సును సత్వగుణోపేతుడై సద్భావనా సత్క్రియావలంబకుడై నవవిధ భక్తి, మంత్రజప నిత్యానుష్ఠానం ద్వారా వశపరచుకుంటే, ఆ మోక్షకాంత పాదాక్రాంత మౌతుంది. లేనిచో ఆ మనస్సే ప్రతి మానవుని పతనహేతు వౌతుంది.

2. వాక్, కర్మేంద్రియము-జిహ్వ జ్ఞానేంద్రియము. తియ్యని వాక్-స్నేహితులను-కఠినమైన దుర్భాషణము శత్రువులను సమకూరుస్తుంది. నిత్యము నిరతము ఆ భగవన్నామస్మరణ చేస్తే శీఘ్రముగా

మోక్షప్రాప్తి లభిస్తుంది. అష్టవిధ పుష్పసాధనద్వారా వాక్శుద్ధి లభిస్తుంది. ఏది చెప్పుతే అది జరిగితీరుతుంది. బ్రహ్మజ్ఞాన సంపన్నులైన మహర్షుల దుష్టవాక్కు శాపముగను, మధురవాక్కు ఆశీర్వచనరూపముగా లోకకల్యాణ కారకమౌతుంది— అమోఘము.

3. శారీరక కర్మలద్వారా ఆయురారోగ్యములను సాధింపవచ్చు వానిని భగవత్ సేవయందు వినియోగిస్తే, మోక్షసాధకమౌతుంది. అట్లుగాక మనోవాక్కాయ కర్మలను చతుష్షష్టి కళలను లౌకిక భోగసాధన ద్రవ్యములుగా వినియోగిస్తే భోగభాగ్యములు, సర్వజన వశీకరణము సాధింపవచ్చు; కాని మోక్షమును సాధింపలేదు.

సద్భావన :- "యద్భావనా తత్భవతి" త్రికరణ శుద్ధితో సద్బుద్ధితో మనస్సులో ఆక్రోశిస్తే ఆ ఆది దంపతులైన చిచ్ఛక్తియుత పరమశివుడు ఉపాసకుని ముందు ప్రత్యక్షమై ఉపాసకుని సర్వకార్య సాధన చేస్తారు. ఆ భగవంతుడు భక్తవత్సలుడు. కరుణాసముద్రుడు. ఆర్తత్రాణపరాయణుడు. జగన్మాతా పితరులకన్న మన శ్రేయోభిలాషులు ఎవరుంటారు?

## 26 నిత్య పితృ మాతృతర్పణము - కుటుంబ శ్రేయోదాయకము

ప్రతి జీవి పుట్టగానే ఈ భోగవలయమైన ప్రపంచములోనికి ఎందుకు వచ్చానా? అని బాధపడుతూ తన మానవజన్మకు, ఇహలోక ప్రాప్తికి కారణమైన నిత్యకరుణామయులయిన మాతా పితరులను తలచుకొని 'అమ్మా' అని ఆక్రోశిస్తాడు. మాయామోహితుడై తన పూర్వజన్మ స్మృతినిమరచి, తనకుకల్గు ప్రతి కష్టమునందు తల్లినే

స్మరిస్తాడు ఎందువల్ల? 'నహి మాతృసమో దేవః నహి పితృ సమో గురు'. అనగా తల్లివంటి దైవము తండ్రివంటి గురువు లభించటం కష్టముకాబట్టె, తల్లితండ్రు లెట్టివారైన (వారి వారి పుణ్యాపాప ఫల ముగా) తమ శిశువుయొక్క శ్రేయస్సును త్రికరణశుద్ధిగా కోరుతారు. అందుకనే అపరాధక్షమాస్తోత్రములో 'కుపుత్రో భవతినకు మాతా' అని చెప్పబడినది.

అట్టి ఆదిదంపతులై, మానవజన్మ ప్రసాదించిన పార్వతీ, పరమేశ్వరులకు, ఇహలోకములో నవమాసములు మోసి కని నిత్యము తన బిడ్డ ఉజ్వలభవిష్యత్తుకై ఆక్రోశించే ఇహలోక మాతా పితరులకు మనము నిత్యము నిరతము కృతజ్ఞులమై ఉండాలి.

ఊర్ధ్వలోక ప్రాప్తినొందిన మాతా పితరులకు ఒక్క రోజు మనకు ఒక్క సంవత్సరమౌతుంది. అందువల్ల ప్రతినిత్యము శివ సాయుజ్యమునొందిన మాతా పితరులకు జలతర్పణము, శివసాయు జ్యమునొందిన దినమున (అనగా సంవత్సరమున కొకదినమున) వారిని మహేశ్వరులయందు ఆహ్వానించి, అర్చించి షడ్రసోపేత భోజనమును (సద్యోజాతాది మంత్రములచే అమృతమయము అతి పవిత్రముగా నొనరింపబడిన ఆహారమును) శ్రద్ధా భక్తులతో అపరా హ్నమునందు ఆరాధన మంత్రములచే, వారి ప్రీతికై, అర్పించుటవల్ల వారి ఆశీర్వాదము లభించి ఆరాధకునికి కుటుంబశ్రేయస్సు, పుత్ర పౌత్రాభివృద్ధి కల్గుతాయి. నిత్య శివారాధకులకు మరణానంతరము ప్రేతత్వము లేదని, దైవత్వము లభించునని శాస్త్రములు చెప్పుచు న్నవి. ఇట్టి సాంప్రదాయం ఈ హిందూదేశమును మాతృభూమి అని భావించె హిందువులకు శాస్త్రసమ్మతము. భోగ భూములయిన ఇతర దేశములయందిట్టి ఆచారములు కన్పడవు. నిత్యము దేవఋషి ముని,

మాతాపితాది తర్పణమువల్ల కల్గు ఆశీర్వాదము. మానవ ఉన్నత ధ్యేయసాధనకు, భోగ భాగ్య మోక్షసాధనకు, రాజబాట.

## 27. నిస్వార్థ జీవిత సాధకము-చతుర్విధ ఆశ్రమావలంబనము

మనవుని జీవిత పంథాలో నాల్గు ఆశ్రమములు పేర్కొనబడి ఉన్నవి. 1. బ్రహ్మ చర్యము, 2. గార్హస్త్యము, 3. వానప్రస్థము, 4. సన్యాసము. పుట్టుకతో జీవిపూర్తి స్వార్థ పరుడు. కాని పిన్న వయస్సులో తల్లిఒడిలో. బడిలో, మాటలలో, పాటలలో భక్తి భావనను ఆస్వాదిస్తాడు. అది, మాతృపితృ గురుదైవ భక్తి యుతులుగాశిశువును చేస్తుంది. నవవిధభక్తి మార్గాచారణము వల్లను, సద్గురోప దిష్ట మంత్ర జప అనుష్ఠానం వలన మానవునియందు సంధ్యా, శమాధి షట్కము జనించి, అతనిని క్రమముగా స్వార్థరహితునిగా చతుర్విధ పురుషార్థ సాధకునిగా ధర్మపథగామిగా మారుస్తాయి.

ఇరువది ఐదు సం॥ ప్రాయమునకు విద్యా భ్యాసము పూర్తి చేసుకొని వివాహితుడై తన కష్టసుఖములను, ధనార్జనాదులను పత్నీ సుత బంధుమిత్రులలో పంచుకుంటూ, అతిధి అభ్యాగతులకు శర ణార్థులకు, దీనజనావళికి ఆశ్రయముగా నిత్య కల్యాణం పచ్చ తోరణంగా చేసుకుంటాడు. కాని ప్రేమ అనురాగములు, కామాదులు అతనిని తన కుటుంబజీవనానికే బంధిస్తాయి. వివేక వంతుడైన మానవుడు సంతాన ప్రాప్తి అనంతరము, వారికి జీవితంలో వివాహాది కర్మల ద్వారా గృహస్థులుగా, చేసి తను ఆబంధము నుండి బయట పడుటకై ప్రయత్నించాలి. తన భవబంధక్లేశ విముక్తికై వానప్రస్థాశ్రమంలో భార్యయుతుడై తన సంతానానికి

దూరంగా జీవిస్తూ భవబంధ హేతువైన మనోబుద్ధులను, పరమేశ్వర సేవయందు మాత్రమే వినియోగిస్తాడు. అది సాధించిన తర్వాత తన జీవిత సదనుభూతిని, పరివక్వమనో బుద్ధుల ద్వారా తన జీవిత శేషానికిజోడించి మానవ జీవనములను ప్రభావితంచేసి, లోక కల్యాణానికి దోహదాకారి అవుతాడు. ఇది భారతీయ సంస్కారం సంస్కృతి. చివరిదైన మోక్ష సాధనకు రాజబాట. అంటే మానవజీవితము సంపూర్ణ ప్రగతి సాధింపకల్గుతుంది.

శైవమతావలాంబకులకు బ్రహ్మచర్య, గార్హస్థ, వానప్రస్థ అత్యాశ్రమములని నాలుగు చెప్పబడినవి.

బ్రహ్మచర్య గార్హ్యస్థ, వానప్రస్థ ఆశ్రమ ఆచరణము పైవిధంగానే ఆచరించాలి. ప్రతి నిత్యము గురోపదిష్ట ఇష్ట లింగార్చన ద్వారా ఉపాసకుడు స్పర్శవేది స్పర్శవల్ల ఇనుము క్రమశ బంగారముగా మారినట్లు పరిణితిచెంది. తను సతియనియు ఆచిచ్ఛక్తి యుత పరమ శివుడే పతియని, శరణుస్థలి అనుభవములో తెలుసుకొంటాడు. అంటే ఆ పరమశివుడు తప్ప మిగిలిన వారందరు కర్మ జీవులై కృష్ణ పరమాత్మను గోపికలవలె త్రికరణ శుద్ధితో సద్భావనతో శ్రద్ధా భక్తులతో అర్చించి సర్వం శివమయం అను, అనుభూతినొందుతారు. కాంతాసుతా బంధుమిత్ర పశుపక్ష్యాదులన్నియు శివస్వరూపముగా తెలుసుకుంటారు. ఇహలోక సంసార బంధము వీడి పరలోక(మోక్ష) అనుభూతి కలుగుతుంది. ప్రతి జీవియందును ఆచిచ్ఛక్తి యుత పరమశివుని భావించి, అర్చించి సాక్షాత్కారానుభవం పొంది. ప్రతి జీవియందలి ఆ పరమేశ్వర సేవయే మానవసేవగా ఆరాధిస్తాడు. ఇహలోక సంసార త్యాగము (భార్యను వదలుట) చేయకుండానే తన సహధర్మచారిణితో ఆపరమ శివుని నిత్య ఆరాధన యందు నిమగ్న

డై సచ్చిదానంద అనుభూతి పొందుతాడు. అందే సంసార భవ బంధనాశము క్రమముగా కల్గి మోక్ష సంసార సతి-పతి బంధము కల్గుతుంది. అట్టివారు అత్యాశ్రమి అని శైవ మతమున పిలువబడు తారు. "తలలు బోడియైన తలపులు బోడియా అని అన్నట్లు మానవులు సద్భావన, త్రికరణ శుద్ధి అష్ట పుష్ప సాధనముచేయనిది. సన్యాసియైనను, సంసారియైనను అత్యాశ్రమియైనను నిష్ప్రయోజనమే కదా !

ఈ చతుర్విధ ఆశ్రమ సాధన యందు మమత, అహంకార నివృత్తి కల్గనిచో శివారాధన చేడు ప్రవృత్తులకు దోహదకారి అయ్యే అవకాశం ఉంది. చతుషష్టి కళలను, నవవిధభక్తిని, మంత్రజప అనుష్ఠానం తమ తమ లౌకిక ప్రయోజనములకై ఉపయోగించుచుంటే అది భుక్తి, భోగ, భాగ్య, సాధనమే అవుతుంది కాని ముక్తి సాధనము కాదు.

భగవత్ప్రసాదిత మానవ జన్మ నిష్ఫలము అవుతుంది. శివయోగి వేమన తన మనస్తాపంతో, బాధతో ఏమన్నారో చూడండి.

ఆత్మ శుద్ధి లేని యాచారమదియేల ।
భాండ శుద్ధి లేని పాకమేల ।
చిత్తశుద్ధి లేని శివ పూజ లేలరా ॥విశ్వ॥

ఆరుమతము లందు నధికమైన మతంబు ।
లింగ మతము కన్న లేదు భువిని
లింగధార్ల కన్న భోగులు (దొంగలు) లేరయా॥విశ్వ॥

చదువరిమతి కన్న సాధకు మతిమేలు
వేదములకు లేదు వాదములకు
ఒడలు శుద్ధి చేసి యెదయని జూచేడు ॥విశ్వ॥

కల్ల గురువు గట్టు కర్మ చయము
మధ్య గురువు గట్టు మంత్ర చయము
ఉత్తముండు గట్టు యోగ సామ్రాజ్యంబు "విశ్వ"

హృదయము పదిలం బైనను
గుదిగొను సన్యాసమునకు కొమ్ములు గలవా
ఇది ఎఱుగరు చదువరులట
మదిముక్తికి నాస్పదంబు మహిలో వేమా.

## ఈ దుష్ట వృత్తుల నిర్మూలనకు, పరిష్కారమేమిటి ?

1. మానవుడు నవవిధ భక్తిమార్గా చరణము ద్వారా, సంధ్యోపాసన ద్వారా సత్సీలాది సంధ్యాషట్కము, శమాదిషట్కము సాధించాలి. ''ధర్మో రక్షతి రక్షతః''
2. త్రికరణ శుద్ధిగా సద్భావనతో సత్యగుణోపేతుడై సత్య వాక్పాలానాది అష్ట పుష్పములు సాధించాలి.
3. మమత్వ అహంకారనివృత్తుడు కావాలి.
4. చతుష్షష్టి కళలను తన మనో బుద్ధులను ఆపరమేశ్వరుని సేవయందే వినియోగించాలి.

సమాజములో ఉన్న సర్వ మానవులకు భక్తి జ్ఞాన ప్రబోధము చేసి ప్రాచీన గురుశిష్య పరంపరను పాటిస్తూ వారిని భక్తిజ్ఞాన యుతులుగా రూపొందించాలి కాని స్వార్థ ప్రయోజన పరులై శివారాధన

ఫలము స్వభుక్తి భోగశ్రేయోదాయకంగా వినియోగించటం వేమన శివయోగికి పూర్వమే ప్రారంభమై ఆ శివయోగి మనస్సును నొప్పించి నది. బసవేశ్వరుని కాలమునకు దురాచారము ప్రబలినప్పుడు సాక్షాత్ శివుడే సూక్ష్మకారణ శరీర అంతేవాసి స్థూలశరీర కర్మ వాసనా రహితుడు(అంటే మమత్వ, అహంకార, వర్ణాశ్రమాది స్థూల శరీరాభి మానరహితుడు) అయిన బసవేశ్వరుడుగా జనించి ప్రజలలో శివ భక్తి ప్రధానముగా ప్రచారముగావించి, బొందితోనే శివసాయు జ్యము పొందినట్లు చెప్పుతారు. వైదికపరమైన శివాద్వైతపరులకు ధూర్జటి ద్వాదశారాధ్యుల జీవితములే మార్గదర్శకులు. యదా దాహియ ధర్మస్య గ్లానిర్భవతి భారత, ధర్మసంరక్షనార్థాయ సంభ వామి యుగేయుగే' అని భగవద్గీత ఉవాచ.

ప్రస్తుత ఆదునిక సంస్కృతి సంస్కారములచే ప్రభావితులై స్వార్థాహంకార దురభిమాన ఆసక్తులైన సమాజంలో శివోపాసకులం దరు నడుముకట్టి, తమ జీవితంలోని ప్రశస్తమైన కొంత సమయాన్ని శివజ్ఞానప్రచారం - శివభక్తి ప్రచారమునకై వినియోగించుట అత్యావ సరం. భోగభాగ్య దశవిధ, పుష్టులసాధించుటకు కష్టపడి శివారాధన చేయనవసరం లేదు. తమతమ వ్యక్తిగత జీవితాన్ని ధర్మపథయుత ముగా మార్చుకొని, సమాజశ్రేయస్సే తమ శ్రేయస్సని భావించుచూ ధర్మరక్షణచేస్తే, ధర్మము మనను రక్షిస్తుంది. ఈ రోజు మనము ఎదుర్కొనే అనేక సమస్యలు మానవుని అధర్మాచరణ ఫలములే. ఈ ఆదునిక కాలంలో శైవమతోన్నతికి పాటుబడి శివసాయుజ్యము చెందిన మహేశ్వరుల జీవితములు చిరస్మరణీయములు వారు ధన్య జీవులు.

7)

## 28. సదాచారము ఎందుకు ఆచరించాలి ?

పెద్దలు "శరీరమాద్యం ఖలుధర్మసాధనం"అని సెలవిచ్చారు. అన్నింటికన్న ముందు శరీరరక్షణ విషయంలో శ్రద్ధతీసుకోవాలని, ఎందుకు? 1. మానవుడు మోక్షసాధన చేయాలంటే, శరీరమందున్న జీవుని పాపపుణ్యకర్మ క్షయముకావాలి కాబట్టి. 2. మానవశరీరము నిత్యము నశించే గుణముకల్గి, జీవాత్మ శరీరమునుండి బయటకు పోగానే పంచభూతాత్మకమైన ఈ శరీరం కుళ్ళి దుర్గంధయుతమై పంచభూతములలో కలిసిపోతుంది 3. కర్మానుసారం అనుభవించే భోగభాగ్యములు, సుఖదుఃఖములు ఈ శరీరానికి సంబంధించినవే కాని, జీవాత్మకు కాదు.

1. ఈ శరీరనిర్మాణములో, 9 బాహ్యస్రోతస్సులు. 13 అంతర్గత స్రోతసులు ప్రధానంగా ఉన్నవి. స్రోతమూల మిదం శరీరం. 2కండ్లు,2 చెవులు, 2 ముక్కులు, 1 నోరు, మలమూత్ర ద్వారముల ద్వారా శరీరమందలి స్థూలమలములు ప్రతినిత్యము అపానవాయువుచే బయటికి త్రోసివేయబడులాయి. ప్రాతఃకాలముననే నిదురలేచి, రాత్రియందు ఈ ద్వారములయందు నిలవయున్న మలములను, వెడలించుట అత్యవసరం. i. ముఖమును నీటిలో కడుగుకొనుట 2. దంతధావనము (పండ్లు తోముకొనుట) 3. నీరు పుక్కిలిపట్టి ఉమ్మివేయుట 4. ముక్కులు చీదుకొని శుభ్రపరచుకొనుట. 5. కండ్లపుసులను తీసి శుభ్రముగా నడుగుకొనుట మలమూత్ర విసర్జనము ప్రాతఃకాలముననే ఆచరించుట అత్యావశ్యము. అట్లుకాక ఆ మలములను ఎక్కువకాలము మలాశ్రయములందు ఆపుతే, ఆయా స్థానములు రోగ భూయిష్టములై, అనేక బాధలకు కారణమౌతాయి.

శరీరక్షయము శీఘ్ర తరమౌతుంది. స్త్రీలయందు అధికముగ గల బాహ్యస్రోతస్సులైన 2 స్తనములు, యోనివిషయము కూడా అంతే.

ii. శరీరాంతర్గముగా 13 విధములైన స్రోతస్సు లున్నాయి. ప్రతినిత్యము నస్యకర్మ, కర్ణపూరణము, అంజనము, గండూష కబళధారణములు, వ్యాయామము, ఉద్వర్తనము, అభ్యంగముల నాచరించుట అత్యావశ్యము. వానివల్లలోని మలములు బాహ్యస్రోతస్సులలోకి త్రోసివేయబడుతాయి. పై విధముగా స్వస్థవృత్తమును ఆచరింపనప్పుడు, అవి రోగనిలయములై శరీర ఇంద్రియములను, చెడుస్తాయి.

iii. మనోబుద్ధులు మానవకర్మానుభవానికి ప్రధాన దోహదకారులు. అది జీవుడుచేసిన పాపపుణ్యకర్మలపై ఆదారపడి యుంటుంది. మనసా, వాచాకర్మణా ఎవరు చేసిన పుణ్యపాపకర్మలు వారు తప్పక అనుభవింపవలసినదే. కాని సద్బుద్ధితో, నిరంహకారముతో మమత్వము లేకుండా నిత్య జీవన విధానాన్ని ఆచరిస్తే శరీర మానసిక ఆరోగ్యమునకు, మోక్షసాధనకు మిక్కిలి సహాయపడుతవి సద్బుధి కలగాలంటే పక్షపాయుదైన మానవుని యందలి మూర్ఖత్వం నశించాలంటే, అహంకారము నశించాలంటే మానవుడు నిత్యము శ్రద్ధతో నవవిధ భక్తితో, జ్ఞానముతో, జీవించటం అత్యవసరం. నిత్య భక్తి జ్ఞానమార్గ ఆచరణంవల్ల మానవుని యందు 1 సత్శీలము 2 సభ్యత, 3 సహనము, 4 సోదరభావము 5 మాతా పితా గురుదైవము లందు భక్తి జనిస్తాయి. అతిపవిత్రుడైన వానికే ఆ పరమ శివుని ఆరాధించే అధికారం ఉన్నది. ఆ భక్తి జ్ఞాన సముపార్జనకు అతిపవిత్రుడైన చిచ్ఛక్తియుత ఆ పరమశివుని, అతిపవిత్రుడై ఆరాధించుటయే ఏకైక శరణ్యము 'యద్భావనా తద్భ

వతి అని పెద్దలు చెపుతారు. సత్యసహ నాదులను సత్వగుణ యుతుడై ఆ శివుని ఆరాధిస్తే ఆ మోషకాంత పాదాక్రాంత మౌతుంది. అట్లుగాక కామాది అరిషడ్వర్గములో, రాగాది ఉపశత్రు సప్తకముతో ఆరాధిస్తే సుఖదుఃఖములకు, భోగభాగ్యములకు అతి సన్నిహితుడై, మోషమునకు అతిదూరుడై జనన మరణ చక్రములో పరిభ్రమిస్తుంటాడు అందువల్ల అత్యున్నతమైన ఈ మానవ జీవిత అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలంటే, సదాచారము, సద్భావన, త్రికరణశుద్ధిని ప్రథమతః సాధించటం అత్యావసరము.

## 29 గురువు-శిష్యుడు-దీక్ష

దుర్లభత్రయమేవైతద్దేవానుగ్రహకారణం,
మనుష్యత్వం, ముముక్షత్వం మహాపురుష సంశ్రయం

మానవజన్మ అతని యందు మోషమునకై తీవ్ర ప్రేరణ., మహాపురుష ఆశ్రయము (అనుగ్రహము) అను మూడునూ పూర్వ జన్మ సంచిత పుణ్యఫలశేషము వల్లనే లభించును. ''గుకారో అంధ కారస్తు రుకారో తన్నిరోధకృత్ అంధకారని వారస్యాత్ గురు ఇత్యభిధీయదే॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ఇతి

మోషసాధన సామాగ్ర్యాం, భక్తిరేవగరీయసీ
యస్యదేవేపరాభక్తిర్య థాదేవే తథాగురౌ

తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః అని గురువును

గూర్చి శాస్త్రము చెప్పుచున్నది. మూఢత్వము అహంకారములనెడి గుణయుక్తుడై, మాయామోహవివశుడై అజ్ఞానాంధకారమున తల్లడిల్లు ఉపాసకుడు, సద్గురు ప్రసాదిత జ్ఞానమనెడి అంజనమును ఉపయోగించుటవల్లను, మోక్షసాధనయందు ప్రధానమైెక భక్తి ఆచరణమువల్ల (నవవిధ భక్తి ఆచరణమువలన, మూఢత్వరాహిత్యము జ్ఞానమార్గా చరణమువలన అహంకార రహితుడై, దేవతలయందు, గురువుయందు, ఇహలోక జన్మనొసంగిన తల్లిదండ్రుల యందు భక్తి ప్రపమతుడగును. భక్తి జ్ఞాన మార్గములద్వారా వైరాగ్య పదగామియై సద్గురువు యొక్క అనుగ్రహమునకు పాత్రుడై ఆత్మజ్ఞాన, అనుభవమును పొందకలుగును.

సద్గురువు లక్షణములు :- 1. సత్వగుణసంపన్నుడు 2. బ్రహ్మజ్ఞాన సాధనయందు మాత్రమే ఇచ్ఛగలవాడు 3. కరుణాసముద్రుడు 4. శ్రోత్రియుడు. 5. గురువంశమునకు చెందినవాడు 6. బ్రహ్మజ్ఞాని. 7. సదాచారయుతుడు

అట్టి గురువు, శిష్యుని పరీక్షించి. భక్తి, జ్ఞానవైరాగ్యమార్గములనెడి త్రివిధ మోక్షమార్గములలో అతనికి తగిన మార్గమును నుపదేశించవలెను. శిష్యుడు గురువునందు అచంచల విశ్వాసము గలవాడై, మనసా, వాచా, కర్మణా ఏకాగ్ర చిత్తుడై సద్భావనాయుతుడై అనునిత్యము అనుసరింపవలెను.

భక్తిమార్గము :-

ఎవరికి, దైవభక్తి గురుభక్తి, మాతాపితరులపై భక్తిశ్రద్ధలు గలవో అతనికి జ్ఞానోపదేశమును సద్గురువు అనుగ్రహింపవలయును.

మానవునియందు. భక్తి ఆచరణమువల్ల మూఢత్వము నశించును. అతను జ్ఞానోపదేశమువల్ల ఆచరణమువల్ల అహంకార నివృత్తుడగును శిశువు జనించినంతనే కన్నతల్లితండ్రులు శిశువునకుదేవ, మాతృ పితృ, గురువు పెద్దలపై భక్తిని పాటలద్వారా మాటలద్వారా ఆచ రింపచేయుట ద్వారా ప్రభోధించటం అందరికి తెలిసిన విషయమే కదా! ఈ ఆధునిక యుగంలో సమాజం భక్తిభావనా రహితులగు టకు ప్రధానకారణం పిల్లలు అట్టి సత్ సాంప్రదాయములో సత్ సమాజంలో గృహవాతావరణంలో నివసించక పోవటం అది అతి దురదృష్టకరం. భక్తి జ్ఞానములు శిశువు హృదయములో చోటుచే సుకొంటే సుఖశాంతులకు కొదవ ఏముంది? భక్తివల్ల మూఢత్వ నివారణమును సాధించిన ఉపాసకునికి జ్ఞానమార్గ ప్రబోధం సద్గు రువు చేస్తే సరియైన కాలంలో, నాటిన భీజం ఎట్లామంచి పంటకు కారణమౌతుందో అట్లే ఆ ఉపాసకుని జీవితము సన్మార్గముగా ధర్మా బద్ధంగా నడుస్తూంది. యుక్తకాలమున సంధ్యోపాసన అభ్యసింప చేయుట, నిత్యవిభూతి రుద్రాక్ష ధారణములవల్ల మూఢుడైన మాన వునియందు 1. సత్శీలము 2. సభ్యత 3. వినయము 4. భాతృ భావము 5. భగవత్భక్తి 6. సహసములను సద్గుణ సంపత్తిక్రమశః అలవడును సర్వకార్య సాధనా సమర్థుడగును. నిత్యసంధ్యా చరణ మువల్ల క్రిమశ, అహంకారము నశించి, సద్బుద్ధి ప్రిజ్వలించి ఉపా సకుని ప్రిజ్ఞామేధా, వివేకము ఇనుమడించును, అనంతరము ఉపా సకునియందు శమాది షట్కాము (1. శమము 2. దమము 3. ఉపరతి 4. తితీష 5. శ్రిద్ధా 6. సమాధానములు) అలవడును. బాహ్యాభ్యంతరేంద్రియములచే సద్బుద్ధిచే, ఏకాగ్రిచిత్తుడై సద్భావనతో ఆ పరమశివుని ఆరాధించేకంటే మిన్నఅయిన దేముంది? ఈ కొద్ది మానవ జీవితప్రమాణ కాలంలోనే సద్గురువు లభ్యమై, అనుగ్రిహించి

బ్రహ్మజ్ఞాన సాధనోపాయములను ప్రబోధిస్తాడు. గురు అనుగ్రహ ముపల్ల మోక్షసాధనము అతి సులభము శైవమతమున ఉపాసకులకు ఉపనయన సంస్కారము జరుగునప్పుడే., స్త్రీలకు వివాహ సమయ మున లింగధారణముచేయుట సాంప్రదాయము విభూతిరుద్రాక్ష శివ లింగధారులను శాంభవీదీక్షితులని పిలుతురు షడక్షరీ మహామంత్రో పదేశము సద్గురువుచే ఉపదేశింపబడుతుంది తద్వారా శివసాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములను నిత్య మంత్రజప అనుష్ఠానం ద్వారా సాధింపకల్గుతాడు.

తనుత్రయగ తానాది మంత్రత్రయమసౌగురు; దీక్షాత్రయేణ నిర్దగ్ధ్వాలింగత్రయముపాదిశేత్ "అనువ్యాస మహర్షి వచనాను సారము, స్థూలసూక్ష్మ కారణములనే మూడు దేహములను. పూర్వ జన్మనుండి లభించిన కార్మిక మాయిక ఆణవరూపమలత్రయమును. సద్గురూపదిష్ట క్రియాదీక్ష, మంత్రదీక్ష, వేధా దీక్షలను మూడు విధ ములైన దీక్షల నిత్యఆచరణముద్వారా దగ్ధమొనర్చి 1. జీవాత్మ (ఇష్టలింగము) 2. అంతరాత్మ (ప్రాణలింగము. 3. పరమాత్మ (భావలింగము) అను త్రివిధలింగ రూపగుణ లక్షణాదుల నుపదే శించుట ద్వారా సద్గురువు ఉపాసకుని ఉద్ధరించును 1. ఉపాసకుని యందలి కార్మిక, మాయిక, ఆణవమలస్థితిని, స్థూలసూక్ష్మ కారణ శరీరములయందు తెలుసుకొను ఉపాయము.

1. స్థూలశరీరమున కార్మికమలమావరించి యున్నప్పుడు 1. స్థూలశరీర భ్రాంతివీడదు. సద్గురు సమక్షమున, దైవ శ్రవణాదులు (జరుగుచున్నప్పుడు, తానుగాతాను గాని, పరప్రేరణచేగాని, ఇతర కారణములచే గాని అచటనుండి వెడలిపోవును. స్థూలశరీరచింతన వల్ల సంసారబద్ధుడగును. ఇదియే కార్మికముల యుతుని లక్షణము.

సద్గురువు అట్టి శిష్యుని సేవాదికములయందు, నియోగించి తదుపరి నవవిధ భక్తి మార్గములయందు నియోగింపవలెను. తద్వారా కాయికమల నివృత్తి కల్గును.

## 2. మాయికమల యుతుని లక్షణములు :-

శ్రీసద్గురువు సన్నిధిని జరుపబడు, దైవ సంబంధ శ్రవణాదికములు జరుగుచున్ననూ, మాయికమలము సూక్ష్మ శరీరము నావరించియున్నందున, అచటినుండి కదలక పోయినను, అతి సులభముగా వివరించుచున్ననూ దాని అర్థమును గ్రహింపలేదు.

ఇదియే జీవుని సూక్ష్మశరీరము మాయిక మాలాశ్రితమని తెలుసుకొనుటకు గుర్తు. అట్టి మాయిక మలయుతుడగు సాధకునకు సద్గురుపు వానియందు మంత్రానుష్ఠానలోపమున్నదని గ్రహించి చిత్తైకాగ్రత సాధనాభూతమగు మంత్రదీక్ష నొసంగి. మాయికమల విముక్తిని కల్గింపవలెను.

## 3. కారణ శరీరమందలి అణవముల స్థితిని తెలుసుకొనుటకు ఉపాయము

సద్గురువు పై విధముగా మంత్రదీక్షనొసంగిననూ వానికారణ శరీరము మాయ మోహరూప అజ్ఞానముతో కూడుకొనియున్నందున శిష్యుడు సద్గురువు కటాక్ష వీక్షణములకు నోచుకొనలేడు. శిష్యుడు సద్గురుమూర్తి సన్నిధిని కదలక శ్రవణాదులు చేయుచున్ననూ, వానిచిత్తము అన్యధా యత్తముకాక పోయిననూ, ఆణవమలము బలముగా ఉన్నందున, నిద్రప్రారంభమై, గురుబోధనర్ధము చేసు కొనలేక స్తబ్దుడగును ఇదియే ఆణవమలాశ్రిత లక్షణము. అట్టి వానిని సద్గురువు వేధ దీక్షదృగ్దీక్షచే, తన కరుణానుగ్రహములచే శిష్యుని ఆణవమల రహితునిగా చేసి బ్రహ్మజ్ఞానోపదేశమొసంగి రక్షింపవలయును. తద్వారా తత్త్వమసి, శివోహం అను శ్రుతి వాక్యములు సార్ధకమగును.

## 30 శీఘ్ర మంత్రసిద్ధికై సాధనోపాయములు

సప్తకోటి మహామంత్రములలో, షడక్షరీమహామంత్రము మంత్ర రాజము మోక్షదాయకము సర్వసిద్ధికరము. సులభ ఆచరణీయము కరన్యాస, హృదయన్యాసములతో ఆచరించిననే గాని, మంత్రము సిద్ధింపదు. "మంత్రాదౌప్రణవసంయుక్తం మంత్రాంతే పల్లవాన్వితం అని, కరన్యాసము చేయునప్పుడు హృదయన్యాసమును ఆచరించు నపుడును.

''మంత్రాణాం పల్లవంపాద: ప్రణవశ్శిరఉచ్యతే
శిర: పల్లవసంయుక్తో మంత్రాలభీష్టఫలప్రద:
ఋషిం, (మూర్ధ్ని) ముఖ్యేచ్ఛందో దేవతాం (హృది) విన్యసేత్
ఆధారే బీజ, శక్తీచ, (పాదయోని): కీలకంన్యసేత్ఇతి

శైవులు జపించు షడక్షరీ మహామంత్రమునుగూర్చి ఉదాహరణకు విచారింతము.

న్యాసము అనగా తాకుట మంత్రయుక్తముగా శరీర భాగములను తాకుటవలన శరీరముమంత్రపూరితమై, మంత్రసిద్ధి శీఘ్రముగా కల్గుటకు సహాయపడును.

కరన్యాసమున, "ఓం"తో మొదలుపెట్టి, మంత్రవర్ణములగు 'న' కార, 'మ' కార, 'శి' కార, 'వ' కార, 'య' కారములతో అంగుష్ఠము (బోటనవ్రేలు) మొదలు, కరతల కరపృష్ఠముల వరకు తాకవలెను. మంత్రమును కర, హృదయా దిన్యాసములతో చేయుటకు ముందు, ఋషిని (మూర్ధ్వము శిరస్సున) చ్ఛందస్సుమ (ముఖమున) దేవతను (హృదయమున,) ఆధారమున బీజశక్తులను (నాభి, గుహ్య భాగములందును) పాదములయందు కీలకమును న్యసింపవలయును. అనగా షడక్షరమంత్ర జపానుష్ఠానమున,

పరబ్రహ్మ ఋషి: (శిరస్సును), దైవీగాయత్రీ చ్ఛంద: (ముఖమును పరశివో దేవతా, హృదయమును ఓం బీజం, నమ: శక్తి, అన్నప్పుడు (నాభి, గుహ్యములను)

శివాయేతి కీలకమని అన్నప్పుడు (పాదములను) తాకవలెను

కరన్యాసానం తరము హృదయాది న్యాసమును పల్లవ సహితముగా ఆచరింపనగును.

| కరన్యాసము | హృదయదిఅంగన్యాసము |
| --- | --- |
| ఓం అంగుష్ఠాభ్యాంనమః | ఓం హృదయామనమః |
| ఓం నం తర్జనీ భ్యాంనమః | నం శిరసే స్వాహా |
| ఓం మం మధ్యమాభ్యాంనమః | మం శిఖాయై వషట్ |
| ఓం శిం తర్జనీ భ్యాంనమః | శ్శిం కవచాయ హుం |
| ఓం వాం కనిష్ఠికాభ్యాంనమ | వాం నేత్ర త్రయాయ వౌషట్ |
| ఓం యం కరతల కరపృష్ఠాభ్యాంనమ | యః అస్త్రాయ ఫట్ ఫట్ |

భూర్భువస్సువరోమిదిగ్బంధః

పై విధముగనే మంత్రజపానుష్ఠాన అనంతరము తిరిగి కర న్యాస హృదయాది అంగన్యాసముల నొనర్చి, భూర్భువస్సువరోమి తిదిగ్విమోకః అని పఠించి ఆచరింపవలయును. పెషడక్షరీ మంత్ర జపమును ఆచరించిన విధముగనే అన్ని మంత్రములను శిరస్సు, చ్ఛందస్సు, హృదయము, బీజము, శక్తి పల్లవయుతముగాను కరన్యాసము ప్రారంభమున ఓంకారయుతముగా (శిరస్సుతోను, హృదయాన్యా సాంతమున (నమః, స్వాహా, వషట్, హుం, వేషట్, ఫట్ అను) పల్లవసహితము అంత్యముననను, మంత్రమును న్యసింప వలయును. న్యాసరహితముగా ఆచరింపబడు మంత్రము, మూకయై సిద్ధింపదు (పలుకదు). ఆసన రహితముగా మంత్రానుష్ఠానము చేసిన, మంత్రము నిద్రావస్థలోనుండి ఫలించదు. పల్లవములు లేకుండా ఆచరింపబడిన మంత్రము దిగంబరియై ఫలహీనమగును. శిరో రహితముగా (ఓంకారము లేకుండా) ఆచరింపబడిన మంత్రము. చచ్చినదానితో సమానమగును. గురుముఖతః గ్రహింపబడని మంత్రమును జపించుటవల్ల ఫలింపదు. ఋషి దైవము చ్ఛందస్సు

లను విడిచి ఆచరింపబడిన మంత్రము విషపూరితమై పామువలె కాటువేసి చంపును శమదమాది సంపత్తి లేనివాని కిచ్చిన మంత్రము మృతమగును.

మంత్రోద్ధారమునకు చెప్పబడిన మంత్రాక్షరములకు అధి, కాక్ష రములను స్వతంత్రించిచేర్చిన మంత్రము నిర్వీర్యమగును. మంత్ర వర్ణముల నడుమ. ఇతర బీజాక్షరములను స్వంతముగా చేర్చుకుని జపించిన, కీలితమంత్రమై అపకారము చేయును. కావున ఉపాసకుడు పైదోషరహితముగా మంత్రమును గురు ముఖతః గ్రహించి శ్రద్ధా భక్తులతో సద్ధ్యానముచే జపించిననే, మంత్రసిద్ధి కల్గును ఉపాసకుడు కామ్యఫలములనాశించి. కొన్ని తంత్రోక్త మంత్రముల జపించియు, కామ్యఫలసిద్ధి పొందనియెడల ''జననం, జీవనం, పశ్చాతాడనం, బోధనంతథా, అథాభిషేకో, విమలీకరణాప్యాయనేపునః తర్పణం దీపనం, గృప్తిర్దశైతా మంత్ర సంస్క్రియాః అను పదివిధములగు మంత్ర సంస్క్రియలను గూడా ఆచరింపవలయును.

1. జననము : పీఠముపై, లేక వామకర తలమున, మాతృక వర్ణములను (న, మశ్శి, వాయ) లిఖించి, పూజించి, వానినుండి మంత్ర వర్ణములను సేకరించుట.

2. జీవనము : మంత్ర వర్ణములను ప్రత్యేక, ప్రత్యేకముగా ప్రణవసహితముగా జపించుట (ఓం నం, ఓం మం, ఓంశిం, ఓంవాం, ఓంయం.

3. తాడనము : భూర్జ పత్రాదులయందులిఖింపబడిన మంత్ర వర్ణములను గంధపునీటిచే, 'యం' అను వాయుతత్వబీజముచే మార్జ నము చేయుట.

4. బోధనం : ఎఱ్ఱగన్నేరు పుష్పముచే, మంత్రవర్ణములను "రం" అను, అగ్నిబీజముచే మంత్రవర్ణ లిఖితకూర్చచే, గంధ జలముచే మార్జనంచేయుట.

5. అభిషేకం : రావిచిగుళ్ళచే శతరుద్ర నమకచమకములచే మంత్రవర్ణములను అభిషేకించుట.

6. విమలీకరణం : మనస్సుతో మంత్రమును చింతించుచూ కుండలిని అగ్న్యుత్థాపన చేయులు.

॥ ఓం హ్రాం ఓం నమశ్శివాయ ఆణవమలం నిర్దహామి
॥ ॥ ॥ ॥ కార్మిక ॥

అని జపించుచూ శరీరమలమే శోధనము చేయవలెను.

7. ఆప్యాయనం : దర్భకూర్చాగ్రముచే ప్రతి మంత్రవర్ణమును ఉచ్చరించుచూ ప్రోషణచేయుట.

8. తర్పణం : జలముచే మంత్రోచ్చరణ పూర్వకముగా లిఖిత మంత్రముపై జలాదులచే తర్పణముచేయుట

9. దీపనం : ఓం హ్రీం శ్రీం, ఓం నమశ్శివాయ అని 108 సార్లు జపించుట.

10. గోపనం : జపించు మంత్రమును గుప్తముగా నుంచి, (శైవమత ప్రబోధిని) జపించుట.

1. మంత్రోపాసన ఎ) ప్రాంశువు బిగ్గరగా ఉచ్చరించుట.

బి) ఉపాంశువు (తనకుమాత్ర) మేవినబడునట్లు ఉచ్చరించుట.

సి) మానసికము (మనస్సుతోనే, నోరు విప్పకుండా ఉచ్చ రించుట అని మూడు విధములు. మానసికము అధిక ఫలదాయకము.

2. జపమాలను గోముఖమున నుంచుకొని మేరుపున దాట కుండా వెనుకకు త్రిప్పుకొనుచూ అంగుష్ఠ (బొటనవ్రేలు) అనామిక (ఉంగరపువ్రేలు) మధ్యవ్రేళ్లతో జపముచేయవలెను.

3. జపము చేయనపుడు వెన్నముకను, కంఠమును శిరస్సును నిటారుగా నుంచుకొని జపము చేయవలెను.

4. ఎ) మంత్రజపము చేయునప్పుడు, దృష్టిని నాసాగ్రభాగ మున కేంద్రీకరించి, మనస్సుతో జపించిన చంచల మైన మనస్సు ఏకాగ్రత పొందును.

బి) మనస్సును దృష్టిని భృకుటి(రెండు కనుబొమ్మల మధ్య భాగమున కేంద్రీకరించి మానసికముగా మంత్ర జపము చేసినచో శీఘ్రముగా మనస్సు వశమగును.

సి) దృష్టిని అంతర్ముఖముచేసి, మనస్సును, షట్చక్రము లగు, మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనా హత విశుద్ధి, ఆజ్ఞా చక్రములయందు నిలిపి మనస్సును ఏకాగ్రతతో తత్రస్థిత ఆచార, మహేశ్వర, శివ, చర ప్రసాద, ప్రాణలింగములపైనను, క్రియాశక్తి, జ్ఞాన శక్తి, ఇచ్ఛాశక్తి, ఆదిశక్తి, పరాశక్తి చిచ్ఛక్తులపై నిలిపి నిత్యము భక్తి శ్రద్ధలతో సత్వగుణోపేతుడై సద్భావముతో జపించిన, అహంకార మమకారములు, మాయామోహరహితుడై ఈ స్వల్పమానవ జీవితకాలము ననే ముక్తిని పొంద కలుగును.

## 31. మంత్రోపదేశమునకు మాసములు

| | | | |
|---|---|---|---|
| చైత్రము | - దుఃఖము | ఆశ్వయుజము | - సర్వశుభము |
| వైశాఖము | - రత్నలాభము | కార్తీకము | - మంత్రసిద్ధి |
| జ్యేష్ఠము | - మరణము | మార్గశిరము | - మహాసౌఖ్యము |
| ఆషాఢము | - బంధునాశనము | పుష్యము | - మంత్రహాని |
| శ్రావణము | - పూర్ణాయుపు | మాఘము | - మేధావృద్ధి |
| భాద్రపదము | - ప్రజానాశము | ఫాల్గుణము | - సర్వసిద్ధి |

### తిథులు

చతుర్థి, షష్ఠి, నవమీ, అష్టమీ, చతుర్దశీ ఈ తిథులను వదలి పెట్టి ద్వితీయా, తృతీయా, పంచమీ, సప్తమీ, దశమీ, ఏకాదశీ, త్రయోదశీ, మహాశివరాత్రి పర్వకాలమందు, కృష్ణపక్షమున పంచమీ పర్యంతము ఉపదేశ, లింగధారణాదులు చేయవచ్చును.

### వారఫలము

| | |
|---|---|
| ఆదివారము - జయము | సోమవారము - మహాపుణ్యము |
| శుక్రవారము - సంపద | గురువారము - మహాసౌఖ్యము |
| బుధవారము - జ్ఞానవృద్ధి | |

శని, మంగళ వారముల యందు ఉపదేశమొసగిన ఆచార్యు

నకు శిష్యునకును అరిష్టము కలుగును కాన ఆ రోజుల యందు పనికిరాదు.

## 32. మంత్రోపదేశమునకు నక్షత్రములు

శిష్యుని జన్మనక్షత్రము రోహిణీ, ఉత్తరా, ఉ.షా., ఉ.భా., పుష్యమీ, అశ్వినీ, హస్తా, అనూరాధా, చిత్రా, పునర్వసూ, మఘా, మృగశిరా, రేవతీ, మూలా, ధనిష్ఠా, స్వాతీ, శ్రవణములు ఈ 18 నక్షత్రములు మంత్రోపదేశమునకు శుభకరములు.

## మంత్రోపదేశమునకు యోగములు

హర్షణము, ధృవము, వృద్ధి, సిద్ధము, సాధ్యము, శివము, శుభము, సిద్ధి, ప్రీతి, ఆయుష్మాన్, సౌభాగ్యము, శోభనము, శుక్లము, బ్రహ్మము ఇంద్రము ఈ 15 యోగములు మంత్రోపదేశమునకు శుభప్రదములు.

## మంత్రోపదేశమునకు కరణములు

బవ, బాలవ, కౌలవ, తైతుల, గరజి, వణజి కరణములు పనికివచ్చును.

## మంత్రోపదేశమునకు లగ్నములు

స్థిరలగ్నములందు విష్ణు మంత్రమును, చరలగ్నములందు

శివదీక్షను, ద్విస్వభావలగ్నమునందు శక్తి మంత్రమును స్వీకరింప వలెను.

కన్యా, వృశ్చిక, మేష, మకర, కుంభ, మీన లగ్నములందు లింగధారణ చేయరాదు.

## మంత్రోపదేశమునకు లగ్నపుష్టి

రవి, కుజ, శని, రాహు, కేతువులు 3 6 11 స్థానములందును. గురు, శుక్ర, చంద్ర, బుధులు 1-4-5-7-9-10 స్థానములయం దుండగా అష్టమస్థాన శుద్దిగల లగ్నమున లింగధారణ చేయవచ్చును.

వైశాఖ శుద్ధ తృతీయా, జ్యేష్ఠ శుద్ధ దశమి, ఆషాఢ శుద్ధ నవమీ, కార్తీక శుద్ధ నశమీ, ఆశ్వయుజ శుద్ధ అష్టమీ, మాఘ కష్ణ చతుర్దశీ (మహాశివరాత్రి) మార్గశిర శుద్ధపౌర్ణమీ ఇవి దేవ పర్వములు గాన ఈ దినములందు మాస నక్షత్ర విచారము లేకనే దీక్షను గైకొనవలెను యోగినీ తంత్రమున చెప్పబడినది.

పుణ్యక్షేత్రములందును, కురుక్షేత్రమునందును, నాలుగు దేవీ పీఠములందును, ప్రయాగ యందును, శ్రీశైలకాశీక్షేత్రములందును కాలనియమమును పాటింపరాదు.

స్త్రీ గర్భిణిగా యున్నప్పుడు 7 మాసములవరకు ఉపదేశము తీసికొనవచ్చును. అటు పిమ్మట పనికిరాదు. ఏ రోజు గురువుగారు శిష్యుని పిలిచి నే నీరోజు నీకు ఉపదేశ మివ్వదలచుకున్నాను అని చెప్పునో ఆ రోజు దినశుద్ధి చూడకయే ఉపదేశము నొందవచ్చును. అన్నిటికంటె గురువుగారికి అనుగ్రహము కలుగుట చాలా విశేషము.

సూర్య, చంద్ర గ్రహణ సమయమున మాస, తిథి, నక్షత్ర, యోగాదుల చింతింపకయే ఉపదేశము (పంచాక్షరీ దీక్ష)ను పొంద వచ్చును.

## 33. లింగధారణకు నక్షత్రములు

కృత్తికా, రోహిణీ, స్వాతీ, పూర్వఫాల్గునీ, పూర్వాషాఢా, పూ. భా., ఉత్తరా, ఉ.షా., ఉ.భా, హస్తా, ఆర్ద్రా, అశ్వినీ, ధనిష్ఠా, శ్రవణం ఈ 41 నక్షత్రములయందు లింగధారణ చేయవలయును.

పుణ్యక్షేత్రములందును, కురుక్షేత్రమునందును, నాలుగు దేవీ పీఠములందును, ప్రయాగ యందును, శ్రీశైలకాశీక్షేత్రములందును కాలనియమమును పాటింపరాదు.

స్త్రీ గర్భిణిగా యున్నప్పుడు 7 మాసములవరకు ఉపదేశము తీసికొన వచ్చును. అటు పిమ్మట పనికిరాదు. ఏ రోజు గురువుగారు శిష్యుని పిలిచి నేనీరోజు నీకు ఉపదేశ మివ్వదలచుచున్నాను అని చెప్పునో ఆ రోజు దినశుద్ధి చూడకయే ఉపదేశము నొందవచ్చును. అన్నిటికంటె గురువుగారికి అనుగ్రహము కలుగుట చాలా విశేషము.

సూర్య, చంద్ర గ్రహణ సమయమున మాస, తిథి, నక్షత్ర, యోగాదుల చింతింపకయే ఉపదేశము (పంచాక్షరీ దీక్ష)ను పొంద వచ్చును.

# 34. ద్వాదశారాధ్యుల సంక్షిప్త పరిచయము

## 1. శ్రీ రేవణసిద్ధారాధ్యులు

వీరు కొల్లిపాకలో సోమేశ్వరలింగము నుండి జన్మించిరి. ఆత్రేయస గోత్రము శ్రీ ఆదిశంకరాచార్యులవారికి చంద్రమౌళీశ్వర లింగము నొసఁగినవారు వీరే, అగస్త్యమహర్షిగారికి శివతత్త్వము నుపదేశించుటయే గాక, శివాద్వైత సిద్ధాంతమును విశదీకరించిరి. విశ్వవర్మ భూపాలుని కుమారుఁడగు చంద్రకేతుపును బ్రతికించిరి. ఇష్టప్రాణ భావలింగారాధన మహిమతో భక్తులకు దివ్యనేత్రముల నిచ్చి కైలాసమును చూపెట్టిరి. వీరికి రేణుకాచార్యులు అను నామాంతరము గలదు. పదునాలుగు వందల (1400) సంవత్సరములు జీవించి శైవమతప్రచారము నొనర్చిన నీ మహనీయునకు "దుర్గాదేవి" అను భార్య, త్రయంబకేశ్వరుఁడు మొదలగు కుమారులుండిరి. వారి వంశమువారు "కాశీకాథుని" అను ఇంటిపేరుతో నున్నవారు.

## 2. శ్రీ మరులసిద్ధారాధ్యులు

భారద్వాజస గోత్ర జన్ములు, గోకర్ణక్షేత్రమునందు మహాబలేశ్వరమున కొంతకాలము తపస్సొనరించిరి. శ్రీనగరము చెంత వీర మహారాజు – తటాక నిర్మాణమునకై శివలింగ ధారులకు కూలిడబ్బుల నీయకయే వారితో మట్టిబెడ్డలు మోయించు చుండగా శైవుల ఇక్కట్లు తొలగుటకై తన చేతిలోని సువర్ణదండము

(బంగారుకట్ట) తోడనే తటాకతట నిర్మాణమును పూర్తి చేయించి వీరకాలుని భస్మోదకము వలన జీవింపఁజేసిరి. వీరి నాకప్పదవమా నింప నేతెంచిన దేవేంద్రుని శిక్షించిరి.

## 3. శ్రీ ఏకోరామ సిద్ధారాధ్యులు

శ్రీ రామేశ్వర జ్యోతిర్లింగమునుండి యవతరించిన ఏకోరామ సిద్ధారాధ్యులు జగద్గురుపదవి నధిష్ఠించిరి. "ఘంటాకర్ణుఁ"డను మరి యొక పేరు వీరికుండెను. వీరు హిమాలయముపై నివసించుటచే కేదారక్షేత్రమునందు "ఘ టాకర్ణహ్రదము" అను పేర నొక చెరువు ఏర్పడినది. మాంధాత యను మహారాజు, బ్రాణాసురపుత్రిక యగు ఉషాదేవియు నీతనివలననే శివజ్ఞానమును సంపాదించిరి. ఉత్తరదేశ మునందు భూపాలురనేకులు వీరికి శిష్యులైరి. విద్వత్సభలయందు పరమతస్థుల నోడించి వీరభాస్కరపతికి తదాచార్యునకును ఎందరో. ఇప్పటికిని ఎతద్వంశియులు "మల్లంపల్లి" అను ఇంటిపేరుతో విం సిల్లుచున్నవారు.

## 4. శ్రీ శ్వేతాచార్య ఆరాధ్యులు

వీరు పరమ ప్రాచీనులు, శివయోగాచార్యులలో అగ్రగణ్యులు, సమగ్ర వేదవేదాంతాభిజ్ఞులు, పెక్కురు శిష్యులకు శివాద్వైతసిద్ధాం తమునే బ్రహ్మసూత్రములు ప్రతిపాదించునవి యని ప్రబోధించిరి. ప్రస్థానత్రయ కర్తయగు శ్రీ నీలకంఠచార్యులకు కల్యాణదేశికులైన వారు.

## 5. శ్రీ లకులీటాచార్య ఆరాధ్యులు

వీరికి ''నకులీకుఁడు'' అను నామాంతరము కలదు. శివయోగాచార్యులలో కడపటివారై ద్వాదశారాధ్యులలో పంచమస్థానము నలంకరించిరి. వామహస్తమున మాదిఫల (బీజపూర)మును దక్షిణహస్తమున లకులిని శిరమున మూడవనేత్రమును ధరించిన వీరికి-కుశికుఁడు గర్గుఁడు మిత్రుఁడు కౌరుషుఁడు నను నలుగురు శిష్యులుండిరి. వీరు ఘోరతపంబొనర్చి బరోడాదేశము నుండి మధురానగరము వరకు శైవమతప్రచారమును గావించిరి. మధురానగరమునందు పాశుపతశైవస్తంభ మిప్పటికిని కలదు. వీరు క్రీస్తునకు పూర్వము రెండవశతాబ్దము నందుండిరి.

## 6. శ్రీ నీలకంఠాచార్య ఆరాధ్యులు

కాశేశ్వర క్షేత్రమున గౌరీవిశ్వేశ్వరారాధ్య దంపతులకు స్వభాను సం॥ చైత్రశు॥ దశమి సోమవారమునందు పుష్యనక్షత్రమున గుర్వధిష్ఠిత కర్కాటక లగ్నమున నీలలోహితరుద్రాంశముతో జన్మించిన వీరు-కాశీక్షేత్రమునకుఁజని శ్రీ శ్వేతాచార్యుల యొద్ద వేదవేదాంగముల నభ్యసించి శాంభవదీక్షఁబరి గ్రహించియు జగద్గురు పట్టంబు నొంది ఉపనిషత్తులకు బ్రహ్మసూత్రములకు భగవద్గీతలకును శివాద్వైతపరములగు భాష్యములను రచించిరి. వీరు శైవమతప్రచారము నొనర్చుచు వారాణాసీ క్షేత్రమునకుఁజని శివపారమ్యమును ప్రతిపాదించుచుండ కాశీపండితులు "మీ మా మతగ్రంథములను అన్నపూర్ణాదేవిఁనగు సన్నిధానమున నుంచుదము, తెల్లవారువరకు ఎవరి గ్రంథములను దేవి-న శిరమునందిడుకొనునో, వారి మతము సర్వ

సమ్మతమగు''నను నిబంధన నొనర్పగా శ్రీవారట్లే యంగీకరించిరి. మరునాడుదయము చూచుసరికి శ్రీవారి గ్రంధములు నమ్మవారి తలపై కనుపడినందున ''శ్రీ నీలకంఠాచార్యుల శివాద్వైత సిద్ధాంతమే ప్రామాణికము సమంజసంబు''నని స్థానికవిద్వత్ప్రకాండులు నిశ్చయించి శ్రీవారికి సాంజలిబంధ ప్రణిపాతంబులొనర్చిరి. మరియు ముక్తిమంటపమునందు శివాద్వైతసిద్ధాంతమును శ్రౌతశైవ సంప్రదాయమును బోధించుచుండగా శ్రీ విశ్వనాథుని మందిరములోని కొడుపులేని గంట మ్రోగుచున్నందున పండితులు పామరులును శ్రీవారి ప్రసంగము నభినందించిరి. వీరిది గౌతమసగోత్రము, విక్రమాంక మహీపాలుఁడు-కాంచనాం బరములతో సువర్ణాభరణములతో సువర్ణముద్రికా (దీనార) సహస్రముతోడను శ్రీవారిని సత్కరించెను.

హరదత్తుఁడు సోమేశ్వరుఁడు భవదేవుఁడు భీమేశ్వరుడు నను నలుగురు శివయోగుల-శ్రీవారికి శిష్యులై దక్షిణ పశ్చిమ ఉత్తర ప్రాక్ దిశలయందు శైవమత ప్రచారము నొనర్చిరి. శ్రీవారికి ''శ్రీ కంఠాచార్యులు'' అను నామాంతరము గలదు. క్రీస్తుశకమునకు పూర్వము పంచమ శతాబ్దమునందు శ్రీవారవతరించిరని చెప్పనగును. ఇప్పటికిని వీరి సిద్ధాంతమే ఆరాధ్యులకు పరమప్రమాణమై యుండుటకు- శివయోగి, మహోపాధ్యాయ, శివశ్రీ॥ ముదిగొండ నాగలింగశాస్త్రి ఆరాధ్యులవారి రచనలగు శతాధికగ్రంధములే ప్రబలములగు ఆధారములగుచున్నవి.

శ్రీవారికి సర్వమంగళ యను భార్య-కుమారులు నుండిరి.

## 7. శ్రీ ఉద్భటారాధ్యులు

వీరు-కాశీవిశ్వేశ్వరలింగము నుండి జన్మించిరి. అన్నపూర్ణా విశ్వేశ్వర దంపతులకు కుమారునిగా పెంపొందిన వీరికి-లీలావతి యను భార్యయుండెను. భారద్వాజసగోత్రము, కాశీక్షేత్రమున శివ పారమ్యమును శ్రుతిస్మృతి పురాణేతిహాసాది ప్రమాణవాక్యముల నుదాహరించుచు ప్రతిపాదించిన శ్రీవారు పూర్వదేశమునందు కొంత కాలము నివసించి-పిదప ఆంధ్రదేశమున "ముదిగొండ" అను గ్రామముఁజేరియుండిరి. పల్లకీ పురాధిపతియగు భోజరాజునకు ఆచార్యులై యుండ కాశ్మీరదేశాధిపతియగు జయాపీడుని ప్రార్థన నాలకించి యాతని సభాపతియై నిత్యము లక్ష దీనారములను పరిగ్రహించు చుండెను వీరు మూడువేల అగ్రహారములను సంపాదించిరి. అరువది నలుగురు (64) రాజులు వీరికి శిష్యులైరి.

యజుర్వేదభాష్యము కావ్యాలంకార సంగ్రహము మున్నగు గ్రంథములను రచించిరి. క్రీస్తుశకము ఐదవశతాబ్దమునందుగల వీరు-అంత్యకాలమున శివయోగ ప్రభావమున మస్తిష్కమునుండి తేజఃపుజముగా బయలుదేరి శివలోకముఁ జేరుచుండ- శివశాపముచే భూతములై పడియున్న ఏడువందల గంధర్వులు- ఆ దివ్య జ్వాలలు సోకినంతనే నిజరూపములఁబడసి దివికేగిరి.

## 8. శ్రీ విశ్వారాధ్యులు

గోదావరీ పావనతీరంబున కోటిపలియందు కాశ్యపగోత్రమున జన్మించిన వీరు-మల్లికార్జున పండితారాధ్యులకు దీక్షాగురువులై ప్రత్తిపాడు గ్రామమున పంటనేలయందు బంగారుమొక్కలను పుట్టించిన

మహనీయులు. వీరి తండ్రి- సోమేశ్వరుఁడు, తల్లి- భవాని, క్రీస్తు శకము పన్నెండవ శతాబ్దము నందుండిరి. కాశీక్షేత్రమున కేదార ఘట్టమునందు శైవమఠమును నిర్మింపఁజేసిరి "ఇవటూరు" అను గ్రామమున నివసించిరి. చతుర్వేదసారము, వృషభాధిపశతకము, బసరాజీయము మొదలగు గ్రంథములను రచించిరి. శిష్యులు పెక్కురు వీరికుండిరి. వీరి వంశమువారు 'పాలగుమ్మి' 'పాలంక' "ఇవటూరు, పాలకురికి" ఇత్యాది గృహనామములతో ఇప్పటికిని ఉన్నవారు.

## 9. శ్రీ వేమనారాధ్యులు

బెలిదేవి గ్రామమున కౌండిన్యస గోత్రమునందు జన్మించిరి. వీరి జనకుఁడు- మల్లికార్జునారాధ్యులు, శ్రీశైలమల్లికార్జున జ్యోతిర్లింగము నుండి యావిర్భవించిన మహనీయులు, విష్ణుదేవభూపాలుఁడు శ్రీవారికి-బెలిదేవి మొదలగు అగ్రహారములను సమర్పించెను. వీరి భార్య పేరు-శర్వాణి, జ్యోతిర్నాథుఁడు, భీమనారాధ్యుఁడు, ఘంటానాథుఁడు మొదలగువారు వీరికి శిష్యులైయుండిరి. సర్పదష్టుఁడై మరణించిన భూపాలుని- మాహేశ్వర చరణతీర్థ ప్రదానమున బ్రతికించుటయేగాక రాజదంపతులకు శివదీక్ష నొసఁగిరి. యాగమున మరణించిన పశువులను జీవింపఁజేసిరి. వీరికి "వ్యోమారాధ్యులు" అను మరియొక పేరు గలదు. సుకేతుపుత్రుని రక్షించిరి. వీరివంశమువారు 'ములుగు' అను ఇంటిపేరుతో పిలువబడుచున్నవారు. మధురానగరము నందు సుందరేశ్వరుని మాటలాడించినట్టి శ్రీవారు క్రీస్తుశకము పన్నెండవ శతాబ్దమునందుండిరి.

87. : స్వామి వివేకానంద

88.

89. పర్వత భజనకీర్తనలు : వీరేశలింగశాస్త్రిగారు

90. శ్రీవీర భద్రపూజ : నిర్మల శంకరశాస్త్రి

91. గాయత్రీ దివ్యశక్తి : పురాణ పండరత్నా కృష్ణ మూర్తిగారు

92. శ్రీదేవి మహాత్మ్యము : శ్రీగోపానందనాదులు

93 వైదిక శివపూజావిధానము : నిర్మల శంకరశాస్త్రి

94 సంక్షిప్త లింగపూజావిధి : దాపుసాహెబ్ మల్లప్ప

95 విరూపాక్ష - మహాలక్ష్మీప్రాత స్మరణ : Cassete

96 శివతత్వసారసతి : నీలకంఠ శివాచార్యులు

97 శివభజన కీర్తనలు : పండితస్వామి గారు

98 యజుర్వేద సంధ్యావందనము : వాశిశ్మ వెంకటేశ్వర్లు

99 ఋగ్వేద సంధ్యావందనము : నిర్మల శంకరశాస్త్రిగారు

100 కాళహస్తీశ్వర శతకము తాత్పర్యసహితం : మాదగులనాగఫణి
మహత్యము శర్మగారు

101 శివ కవచము : శ్రీరామ బుక్ డిపో

102 చిన్మయదీక్ష : పూర్వప్రతి

103 శివపూజా : గొల్లపూడి వీరస్వామి

104 స్తోత్రమాలా : వైద్యనాథ పద్మశేషన్

మహనీయులు. వీరి తండ్రి- సోమేశ్వరుఁడు, తల్లి- భవాని, క్రీస్తు శకము పన్నెండవ శతాబ్దము నందుండిరి. కాశీక్షేత్రమున కేదార ఘట్టమునందు శైవమఠమును నిర్మింపఁజేసిరి ''ఇవటూరు" అను గ్రామమున నివసించిరి. చతుర్వేదసారము, వృషభాధిపశతకము, బసరాజీయము మొదలగు గ్రంథములను రచించిరి. శిష్యులు పెక్కురు వీరికుండిరి. వీరి వంశమువారు 'పాలగుమ్మి' 'పాలంక' "ఇవటూరు, పాలకురికి" ఇత్యాది గృహనామములతో ఇప్పటికిని ఉన్నవారు.

## 9. శ్రీ వేమనారాధ్యులు

బెలిదేవి గ్రామమున కౌండిన్యస గోత్రమునందు జన్మించిరి. వీరి జనకుఁడు- మల్లికార్జునారాధ్యులు, శ్రీశైలమల్లికార్జున జ్యోతిర్లింగము నుండి యావిర్భవించిన మహనీయులు, విష్ణుదేవభూపాలుఁడు శ్రీవారికి-బెలిదేవి మొదలగు అగ్రహారములను సమర్పించెను. వీరి భార్య పేరు-శర్వాణి, జ్యోతిర్నాథుఁడు, భీమనారాధ్యుఁడు, ఘంటా నాథుఁడు మొదలగువారు వీరికి శిష్యులైయుండిరి. సర్పదష్టుఁడై మరణించిన భూపాలుని- మాహేశ్వర చరణతీర్థ ప్రదానమున బ్రతికించుటయేగాక రాజదంపతులకు శివదీక్ష నొసఁగిరి. యాగమున మరణించిన పశువులను జీవింపఁజేసిరి. వీరికి "వ్యోమారాధ్యులు" అను మరియొక పేరు గలదు. సుకేతుపుత్రుని రక్షించిరి. వీరివంశమువారు 'ములుగు' అను ఇంటిపేరుతో పిలువబడుచున్నవారు. మధురానగరము నందు సుందరేశ్వరుని మాటలాడించినట్టి శ్రీవారు క్రీస్తుశకము పన్నెండవ శతాబ్దమునందుండిరి.

## 10. శ్రీపతిపండితారాధ్యులు

కైలాసమున నారదమహర్షి ప్రార్థన ననుసరించి శంకరుఁడు తన నాదేశించినందున- శ్రీపతి(మాధవుఁడు)పల్లవ భూపాల పట్టణము నందు కౌశికసగోత్రమున భ్రమరాంబికా మల్లికార్జునులకు పుత్రుఁడై జనించి శ్రీశైలమున కొంతకాలము నివసించెను.

విజయవాటికయందు కొంతకాలముండిన వీరిపైకి పల్లవరాజా పంపిన ఏనుఁగు వీరిముందు మోకరిల్లినందున నా రాజు (అనంతభూపాలుఁడు) వీరికి శిష్యుఁడయ్యెను. తనయందు కలిగిన విపరీత భావముల నణఁగద్రొక్కుటకు నొక పట్టుపచ్చడం బందు నెట్టని నిప్పులను ముడిగట్టి యొక జమ్మిచెట్టునందు గట్టివేసినందున అగ్నులు చల్లారగా, బ్రాహ్మణులందరు తద్దేశాధిపతి ముందు నిడుకొని పండితుని పలువిధముల వేడుచు వినమ్రులైరి. అంత నీ మహనీయుఁడు ప్రసన్నుఁడై ప్రతి యింట నగ్నులను ప్రజ్వలింపఁ జేసెను. కొండగుహలలో జిక్కుపడియున్న రాజపుత్రునకు ప్రకాశంబుగ దెరువుచూపిరి. క్రీస్తుశకము పదునొకండవ (11) శతాబ్దమునందు వీరుండిరని ద్రాక్షారామమున విక్రమాదిత్య జామాతయగు చక్రదండ రాజుయొక్క శిలాశాసనముఁబట్టి తెలియుచున్నది. ఈ సంతతివారు, శ్రీపతి పండితారాధ్యుల, పండితారాధులవారుగా పిలువబడుచున్నారు.

## 11. శ్రీ మంచెన పండితారాధ్యులు

బ్రహ్మదేవుడు-శివునాజ్ఞచే కేదారక్షేత్రమునందు గౌరీ కేదారేశ్వరులకు పుత్రుఁడుగ నవతరించెను. అట్టి మహాపురుషుఁడే మంచన పండితులు, ఉపమన్యు మహర్షిగారి వలన శాంభవదీక్షఁ బరిగ్రహించిన వీరు- కాశీక్షేత్రము నందలి త్రయంబక సోమయాజియొక్క

పుత్రికయగు చండికను భార్యగా స్వీకరించిరి. వీరిది-సాంఖ్యాయన (సాలంకాయన) గోత్రము, మంచన పండితుని పితామహుఁడగు సోమశంభువు-గౌడదేశము నందలి శైవాచార్యమఠము (గోళకినామధేయము) నకు అధిపత్యమును వహించెను. మంచన పండితులు కాశీక్షేత్రమున కొంతకాలముండిరి. శ్రీశైలక్షేత్రమునందును నివసించి తపస్సొనరించిరి. క్రీస్తుశకము (11)వ శతాబ్దము వరకు వీరు "శైవేతరవాది ఘోషణభేదదక్షః" అను బిరుదమును తన ఇంటి మహాద్వారముపై నెలకొలిపిరి. కాశీక్షేత్రమున వైష్ణవులు వీరిని ద్వేషింప, బిందు మాధవ విగ్రహమును నడిపించి, విశ్వేశ్వరలింగమునకు మ్రొక్కించి, 'శివుఁడే పరమాత్మ' యని పలికించిన శ్రీవారికి వైష్ణవులు తలలొగ్గి ప్రశంసించిరి. వీరి వంశము వారు 'శివలెంక' అను ఇంటిపేరుతో నున్నవారు.

## 12. శ్రీ మల్లికార్జున పండితారాధ్యులు

శివసంకల్పబలమున ద్రాక్షారామ క్షేత్రమునందు గౌరాంబా భీమేశ్వర దంపతులకు పుత్రుఁడై జన్మించిన శ్రీ మల్లికార్జున పండితుండు-ఉపనీతుఁడై కోటిపల్ల్యారాధ్యుని చెంత శాంభవదీక్షఁబరిగ్రహించియు పెక్కు శైవగణార్చనల నొనర్చినవాడు. పండితత్రయములో చక్రవర్తి యనఁదగు శ్రీవారు శివుని కంటె నితరదేవత-పరుఁడనని చెప్పువానిని తన కాలితో తన్నుదు నను, ప్రతిజ్ఞఁగావించి దేశదేశముల యందు సంచరించుచూ శైవేతరమతములను ఖండించిరి.

పండితసభలలో వివాదముఁ జేయుతరి తన నేత్రముల నూడఁ

వెలికినను శివానుగ్రహమువలన మరల నేత్రములను బడసినవారు శివతత్త్వసారము, లింగోద్భవ గద్యము. అమరేశ్వకము మున్నగు గ్రంథములను రచించిరి. విప్రులలో విద్వాంసులగువారు వీరి ప్రబో ధము నంగీకరించి శిష్యులైరి. మహాదేవయ్య అను శివభక్తుడు శివా పచారవశమున తన పాదములఁ ద్రెంచుకొనఁగ నాతని పాదములకు శివదీపమునందలి చమురు మర్దించి మరల పాదముల నంటించిన వీరి మహిమ యపారమని చెప్పవచ్చును. (పలనాటి రాజుల రాజదాని యగు గుంటూరు మండలమునందలి ధనదపురి (చందవోలు గ్రామము) యందు శ్రీవారికి సంబంధించిన శిలాశాసనము గలదు. ఈ శాసనము శివతత్త్వసార గ్రంధమునందు ముద్రింపబడినది. శ్రీవారు ఒకప్పుడు రాజదండనము తనకు కానున్నదని విని మస్త కంబును మూడు మూఱులు గోసికొనినను మఱల మూడు తడవలు మస్తకంబు నంటుకొనినందున వీరు దివ్యశక్తి సంపన్నులని రాజు ప్రజలును గుర్తించిరి. బౌద్ధులను జయించి శివపారమ్యమును నిరూ పించిన శ్రీవారు-క్రీస్తుశకము పన్నెండవ శతాబ్దమునందుండిరి. వీరి వంశమువారు-"నిర్మల" "మడిపల్లి" "అంబారిపేట" "ముత్యంపేట" "కాళేశ్వరము" "కొడిమేల" మొదలగు గృహనామములతో విరా జిల్లు చున్నవారు.

# 35. మంత్రార్వణ క్రమము

ఉపాసకుని నామమందలి అక్షరసంఖ్య, మంత్ర బీజాక్షర సంఖ్యననుసరించి ఆ మంత్రఫలము సిద్ధించును. అందువల్ల గురువు మంత్రోపదేశము చేయుటకు పూర్వము ఉపాసకునికి ఆ మంత్రము సత్ఫలము నొసగునా? లేదా? అని విచారించి అర్వణక్రమ విధిననుసరించి మంత్రమును ఉపదేశించుట శ్రేయస్కరము.

## అర్వణక్రమ ఫలసూచీ పట్టిక

| | | | | |
|---|---|---|---|---|
| బాంధవాః | 9 | 5 | 1 | సిద్ధా |
| సేవకాః | 12 | 6 | 2 | సాధ్యా |
| పోషకాః | 11 | 7 | 3 | సుసిద్ధా |
| ఘాతుకాః | 10 | 8 | 4 | అరయ |

**అర్వణమును చూచు విధానము**

ఉపాసకుని నామాక్షర సంఖ్యను మూడుచే గుణించి, దానికి ఉపదేశింప నిశ్చయించిన మంత్రబీజాక్షరములను కలిపి, తొమ్మిదిచే విభాగముచేయగా మిగిలిన శేషసంఖ్యను పై అర్వణఫలసూచీ పట్టిక యందు చూచుకొనవలెను.

అర్వణముకాని మంత్రరాజమును జపించుటవలన ఉన్మాదాదులు, సర్వనాశనము, అనేక దుస్థితులకు లోనగుట ప్రాప్తించును.

# 36. గోసేవ-గోదాన విశిష్టత

"ధర్మో రక్షతి రక్షతః" అను సూక్తి అందరికి తెలిసినదే. ధర్మ ఆచరణము సుఖశాంతులకు అధర్మాచరణం సర్వదుష్కర్మలకు, అనాచారమునకు కారణము గోవును ధర్మదేవత స్వరూపంగా, కామధేనువుగా నిత్యజీవనంలో సన్మార్గ ఆచరణమునకు, మాతృ ప్రేమకు, విశ్వాసానికి ప్రతీకగా శాస్త్రములు చెప్పుచున్నవి. మాయా మోహితుడై, మూర్ఖత్వ అహంకారయుతుడైన మానవునియందు భక్తి ప్రేమ, సదాచారములను కల్గించే సులభసాధనమిది. తద్వారా భక్తి జ్ఞాన, మోక్ష మార్గావలంబమునకు మార్గమేర్పడి మానవుని నిస్వార్థ సంపూర్ణ జీవన వికాసానికిది మంచిసాధనం.

గ్రామజీవితం మానవునియందు ప్రకృతికి సంబంధించిన లౌకిక జ్ఞాన నిర్మాత అయితే, పట్టణ జీవనం అలౌకిక ఆచార వ్యవహార సాంప్రదాయాలకు, మూర్ఖత్వ అహంకార, స్వార్థజీవనానికి అలౌకిక జ్ఞాన పునాదిగా చూస్తున్నాము.

హిందుదేశము కర్మభూమి అంటే ప్రతి జీవితను చేయుపుణ్య పాపకర్మానుభవాన్ని అనుభవించుటకు పుట్టుతాడనీ, పుణ్యాపాపకర్మ క్షయము నొందుటద్వారా, మోక్షసాధన చేయగల్గుతాడని నమ్మి చరించే సాంప్రదాయం మనది. మిగతావి నిత్యస్వార్థ భోగనిలయాలై చస్తూ పుట్టుతూ కుడితిలోపడ్డ ఎలుకలాగా జీవన్మరణము నిత్యం అనుభవిస్తూ నిత్య యాంత్రిక జీవనానికి అలవాటై మానవ జీవన ధ్యేయమైన మోక్షసాధనకు సుదూరం అవుతాడు. మోక్షమును సాధించేముందు ప్రతివారు ఈ కర్మభూమియందు జనించి ఇచ్చటనే పరమపద సోపానమైన మోక్షసాధన చేయవలసిందే జీవియందు

ప్రేమ, అనురాగములను పెంపొందిస్తుంది. అని పెద్దల నిత్య గోసేవ వచన మాతృభక్తి తద్వారా పితృగురుదేవ భక్తిభావ మును వృద్ధిపొందించి మూర్ఖత్వ నాశనమునకు సహాయపడుతుంది. సహనము, సహజీవనము భాతృభావన పెంపొందిస్తుంది. అధర్మా చరణమందు క్రమశః విరక్తి, ధర్మాచరణమందు క్రమశః రక్తి జనింపచేస్తుంది.

గోఘృతసేవన నాడీమండలమును శుద్ధిచేసి కార్య సామర్థ్య తను, నాడులకు తర్పణమును కల్గించుటద్వారా శక్తిని చేకూరు స్తుంది. శరీర దార్ఢ్యత నిత్యసేవనవల్ల కల్గుతుంది. ఓజస్కరము సంతాన బీజజనకము-నేత్రము నిత్యసేవన ఆయుర్వృద్ధివయస్థాపనం కల్గిస్తుంది.

ఓజశక్తి వృద్ధియై జీవితప్రమాణం పెరిగి సుదృఢంగా జీవించ కల్గుతాడు. అందుకే వీటికి పంచామృతములని పేరు.

పంచగవ్యములు (క్షీరము, పెరుగు, పాలు, గోమయము గోమూత్రము)శరీర షడధ్వశుద్ధి కల్గించి పవిత్రతను చేకూర్చి రుద్రా సమునిగా జీవుని చేస్తుంది.

గోవు ఇంట్లో ఉంటే అది అతిమంగళప్రదం, శుభకరం శ్రేయస్కరం. అది కామధేనువు.

127

## మోక్షప్రపదము

ప్రత్యక్ష గోదానము- ఈదానము పుణ్యకార్యసాధనకు, జీవి కృత పాపకర్మల శమనార్ధము చేయబడుతుంది.

నిత్య సత్యజీవియై త్రికరణ శుద్ధితో సద్భావనతో ఒక సద్బ్రాహ్మణునకు గోదానముచేస్తే అది ఉభయతారకం మోక్షప్రదం భోగదాయకం.

సపత్నీ సుతాదులు కర్మజీవులు- ఇంట్లోవారు జనించిన, చేరిన దినములనుండి వారి పుణ్యఫలములు కనిపిస్తాయి. దానికితోడు జీవి తన నిత్యజీవితంలో ఆచరించే అధర్మఫలము చేరిస్తే ? దానినే అంటిపెట్టుకొని, అధర్మజీవనమునకు భోగలాలసతకు అరిషడ్వర్గము, రాగాది సప్తకంతోడౌతే ఇంకా చెప్పేదేముంది ? అట్టి పాపకర్మ క్షయముకోసం గోదానాదుల నాచరిస్తే ? గోదానాదులనొసర్చిన వారికి కించిత్ఫలం. దానగ్రహీతగూడా ఆ పాపభోగ భాగస్వామి అవుతాడు. "కర్తా కారయితా చైవ ప్రేరకశ్చ అనుమోదకః" అంటే చేసేవారు, చేయించేవారు, ప్రేరేపించేవారు, ఆమోదించేవారు, గ్రహీతలుగూడా భాగస్వాములౌతారు. గ్రహీత సంచిత పాప ఫలక్షయం జరిగేదాకా బాధపడుతాడు- దానికి పరిష్కారం ఏమిటి ?

నిత్యం సహస్ర గాయత్రీ జపమును త్రికరణశుద్ధితో సద్భావనతో ఏకాగ్రతతో ఆచరించి పరమేశ్వరార్పణం చేయాలి. పాప ఫల భోగక్షయంగానే ఉపాసకునికి తెలుస్తుంది.

# గోదాన విధి ఆచరణ క్రమము

సత్వగుణయుక్తమైన దూడతో సహా దానిని స్నానము చేయిం చాక సువర్ణ లేక రజిత శృంగ యుక్తముగా వస్త్రాదులను ధరింప చేసి పసుపు కుంకుమ పుష్పములచే అలంకరించాలి.

ఒక సంవత్సర కాలము కనీసం దాని మేత, దాణాలకు సరి పోవు గ్రాసమును ఆవుదూడతోపాటు ఇవ్వాలి.

3. ఆవుదూడనుకూడా యధాక్రమముగా పూజించాలి. ఆవు యొక్క తోకను అలంకరించి గృహీత హస్తమందు ఉంచి, ఈ క్రింది మంత్రోచ్చారణముచే దాత గృహీతకు గోవత్సయుత గోదానం చేయాలి.

"గోమయం యమునా సాక్షాత్
గోమూత్రం నర్మదా తధా
శుభాచ గంగా క్షీరస్తు తీర్థం యాతి
యాసాం వైతః మపరం"
గవాం అంగేషు తిష్ఠంతి, భువనాని చతుర్దశ
యస్మాత్ తస్మాత్ శివం మే స్యాత్ ।
(ఇహలోకే, పరలోకే షుచ)
అతః శాంతిం ప్రయచ్ఛమే ॥

గోదానము చేయువారు గృహీతకు పురోహితోత్తమునకు నమస్కరించి ఆశీర్వచనము నొందవలెను,

# 37. సోమవార వ్రత నిత్య అనుష్ఠానము- దాని ప్రాశస్త్యము

**1.** సోమ : "అనగా (చిచ్ఛక్తియుత) పార్వతీదేవి సహిత పరమశివుడని అర్థము. పరమశివుని సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహ రూప పంచకృత్యములలో లోకకల్యాణ కారక, ప్రసాద రూప అను గ్రహములను భక్తులకు పార్వతీ సహితుడైన పరమేశ్వరుడు ప్రసాదించుట ఇచ్చట ముఖ్యాంశము.

**2.** సోమ : అనగా చంద్రుడు పార్వతీ సమేత పరమ శివుడు చంద్రరూపులైన పితృ, దేవ, మనుష్యులను తృప్తి పఱచుట కూడా అని అర్థము.

**3.** జగత్ కల్యాణ కారకము. అనుగ్రహ ప్రసాదరూపము అగు సోమయాగ స్వరూపుడైన పరమశివుడు చతుర్విధ పురుషార్థ సాధకముగా సహాయపడుటయే ఇందలి ముఖ్యాంశము.

అనాదిగా సోమవారం రోజున ఉపవాసము, ఏకభుక్తము, నక్త వ్రతము. మరియు అర్ధరాత్రి వ్రతమాచరించుట అను ఆచారము మనకు తెలిసినదే. దీనికి కుల, మత, వర్ణ, లింగభేదములు లేవు. జ్ఞాన జ్యోతియైన పరమశివుడు, లోకపాలన భోగభాగ్య ప్రదాత్రి అయిన ఆ పార్వతీదేవితో గూడి తన్ను ఆరాధించే భక్తులకు త్రివిధ ఇహ, పరమోక్ష భోగభాగ్యములను ప్రసాదించే అశుభ అవకాశాన్ని ఎవరు వదులుకొంటారు ? ప్రత్యేకంగా శైవ సాంప్రదాయ అవలంబికులకిది నిత్యజీవన విధానంలో ఒకభాగమే !

ఎట్లా ఆచరించాలి ?

సోమవారము రోజున సర్వ శరీర స్నాతుడై శుభ, వస్త్ర ధారియై, నిత్యసంధ్యాది అనుష్ఠానములను పూర్తి చేసుకొని మనసా, వాచా, కర్మణా శివభక్తి శివస్మరణాయుతముగా తన దిన కార్య క్రమాన్ని నడుపుకోవాలి.

2. ఆచరణ విధానములో నాల్గువిధములు పైన పేర్కొన బడినవి కదా !

**1. ఉపవాసము :** సోమవారము దినమున నిరాహారియై శివ ధ్యాన రతుడగుట. మఱుసటి దినమున శివపూజాదికముల పూర్తి చేసు కొని ఉదయమున భుజించుట- ఇది శ్రౌతశైవులకు వర్తించదు.

**2. ఏకభుక్తము :** ఏకభుక్త వ్రతస్థులు, మధ్యాహ్నము కాలమున శివపూజాదికముల నాచరించి భుజించుట. మిగిలిన దిన మంతయు శివధ్యానరతుడై ఆచరించుట.

**3. నక్తవ్రతము :** నక్తవ్రతస్థులు-ఛాయానక్తమున అనగా సుమారు 3 ఘడియల ప్రొద్దు ఉండగనేగానీ లేక నక్షత్రోదయకాల మునగాని శివపూజాదికముల నాచరించి భుజించుట.

**4. అర్ధరాత్రి వ్రతము :** సోమవార దినమంతయు ఉప వాసముండి శివపంచక ఆచరణము చేయుచూ అర్ధరాత్రి కాలమున శివపూజ చేసుకొని భుజించుట.

ii) సోమవార దినమున శైవాచార సంపన్న దంపతులను ఉమా మహేశ్వర స్వరూపులుగా భావించి, వారికి పాదపూజ యథా

విధిగా చేసి, గురు తీర్థప్రసాదముఁ స్వీకరించుట అధిక ఫల ప్రదము గోదానము నొసంగి, వస్త్రాదులచే సత్కరించుట విశేష ఫలదము.

iii) ఉమామహేశ్వర రూపదంపతులను సుఖాసీనులుగా చేసి, మహేశ్వరార్చన నిత్య శివపూజా విధానముగాచేసి వారి తీర్థ ప్రసాదములను తీసుకొనవలెను. అనంతరము షడ్రసయుక్త భోజనమొసంగి వారు తిన్నతర్వాత భుజించుట సదాచారము.

iv) సోమవార వ్రతమును, నిత్యము జీవితాంతము వరకుగాని, 12 సం॥ల పైబడిగాని చేయువారలు. ఉద్యాపనము చేయ నవసరములేదు. అట్లుగాక 12 సం॥ల పూర్వము వ్రత విరమణము చేయదలచినచో సోమవార వ్రత ఉద్యాపన విధా నము ననుసరించి చేయతగినది. ఈ సోమవార వ్రతము నాచ రించుటవలన, ఉద్యాపన వలన, చైత్రాదిమాసములయందు కల్గు ఫలములు ఈ క్రింది విధముగా చెప్పబడినది.

1. చైత్రమాసము—లక్ష ఉసిరికాయలతో పూజించిన ఫలము. చతుస్సాగర భూ ప్రదక్షిణ ఫలం.

2. వైశాఖమాసము—గంగాది సర్వ పుణ్యతీర్థ సేవన, ఫలం కన్యాదాన ఫలం

3. జ్యేష్ఠమాసము—సువర్ణ శృంగయుత గోదానఫలం.

4. ఆషాఢమాసము—సహస్ర అశ్వమేధయాగఫలం.

5. శ్రావణమాసము — గణాగ్రృతిస్తై ఆచంద్ర సూర్య నక్షత్ర పర్యంతం విలసిల్లుట.

6. భాద్రపదమాసము—సహస్ర కమల కోటి గోదానఫలం.

7. ఆశ్వియుజమాసము—సమస్త పాతక నాశనం - మోక్ష ప్రదం.

8. కార్తికమాసము — కాయిక, వాచిక, మానసికరూప త్రికరణశుద్ధి సాధనం- శివ సారూప్య సాధనం.

9. మార్గశిరమాసము— ,, ,, ,,

10. పుష్యమాసము—శత అగ్ని సోమేష్టయాగ ఫలం.

11. మాఘమాసము—బ్రహ్మ హత్యాది పాపనాశనం.

12. ఫాల్గుణమాసము—మేరు పర్వత సువర్ణ దానఫలం.

పరమశివుడు ప్రదోషకాలంలో ప్రమధ గణములతోకూడి ప్రతి నిత్యం ఆనందంతో నృత్యముచేసి ఆనందమయుడవుతాడు. ఆ సమయంలో శివారాధన, నక్తవ్రతాచరణము శివపార్వతీ సహిత పరమేశ్వరుని అనుగ్రహమును పొందుటకు మిక్కిలి అనుకూల సమయమిది. మోక్ష ఇష్టకామ్యార్థసిద్ధికి, శివప్రసాదలబ్ధికి తగిన సమయం విశేష ఫలప్రదం.

## 38. కార్తికమాసంలో ప్రతిదిన శైవగణార్చన ఆచరణము

శైవుల సంఘటనకు, శైవమత సిద్ధాంత పూజాదికములను ఉపాసకులకు కార్యక్రమమందు పాల్గొనువారికి నొక్కివక్కాణించే

సదావకాశం. కార్తీకమాసం మరియు దినమున ఉపవాస మాచరించి, శైవ దంపతులకు కార్తీక మాసాంతమువరకు ప్రతినిత్యం. ప్రదోష సాయంత్రం పూజసలిపి; అర్ధరాత్రియందుగాని, నక్షత్రోదయ అనంతరం అందరు కలిసి శివపంచక మాచరిస్తూ చరించే స్ఫూర్తి దాయక, స్మృతికారక, సర్వరోగహర సిద్ధ ప్రక్రియ ఇది అన్ని మతములవారు చాతుర్మాస్యాది ఆచరణ కాలమున నిత్యము శిష్యులను ప్రబోధిస్తూ. తమ తమ సిద్ధాంత ప్రవచనమునకు ఉపయోగించే అతి ముఖ్య సమయమిది.

ఈ సదవకాశ అనాచరణ- అనాదరణమే శైవుల ఆధునిక హీన స్థితికి కారణం. ఇట్టి సమిష్టి కార్యమును అందరు కలసి, కార్తీక మాసంలో ఉమామహేశ్వరరూప దంపతులకు నిత్య శివపూజ నాచరించి, తీర్థ ప్రసాద వితరణము జరుపుట అత్యావశ్యకము. మనము శైవమతాభివృద్ధికి రోజు ఏమిచేస్తున్నాము? అని ఆత్మ విమర్శ చేసుకొని ధృడసంకల్పులై మిగిలిన మతావలంబకులు ఆచరించే ఈ సమిష్టి కార్యమును ఆచరించుటయే శైవమత ఉన్నతికి చాల దోహదపడుతుంది. అది మన కర్తవ్యంకూడా. మన ఇంట్లో, బయట మనము సత్సాంప్రదాయ ఆచరణ కలవారమైతేనే, మన పిల్లలకుకూడా ఆ పూజా చరణాదులయందు అభిరుచి, జిజ్ఞాస ఏర్పడి,అంకురం ఏర్పడి ఒక మహావృక్షముగా పెరిగినట్లు వారే భావిభారత శైవమతా దర్శ మార్గదర్శులవుతారు.

## 39. విభూతిని తయారుచేయు విధానము

వలయు పదార్థములు . 1. గోమయము, 2. ఆవుపాలు గోమయము క్రిందపడనీయక ఒక పత్రమున బట్టి దాని మధ్యభాగ

మున పేడను ఉండలు చేసి ఎండించవలెను. తదుపరి దానిని అగ్ని మధ్యముననుంచి దానిని కాల్చవలెను. బాగుగా కాలిన తర్వాత స్వాంగ శీతలమైన పిదప ఆ విభూతిని శ్లక్ష్ణచూర్ణము గావింపవలెను. బిల్వ ఫలమునందుగాని దేవదారు పాత్రయందుగాని, మామిడి పాత్ర యందుగాని సేకరించి ఉంచవలెను. ఇందు మంచి గంధము 1/10 బాగము పచ్చ కర్పూరము 1/30 కచ్చూరాలు 1/20చొ కలిపి ఆవుపాలతో మర్దించి విభూతిపండ్లుచేసి వాడినచో సౌభాగ్య ప్రదము గను సుఖకరముగా నుండును పంచబ్రహ్మ మంత్రములతో అభి మంత్రించి లలాటము, శిరస్సు శిఖా, కంఠము, హృదయము, ఉద రము హస్తపాదములపై నిత్యము ధరించినచో భోగమోక్షకారకము గోమయమును సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రములచే సేకరించి, ఎండించి పుర, మిడి, తిరిగి ఆవుపాలు వగైరాలతో చేర్చి తయారు చేయునపుడును పంచబ్రహ్మ మంత్రయుతముగా చేసిన అత్యధిక ఫలప్రదము సర్వసిద్ధిదాయకము- అట్టి విభూతిని సద్యోజాతాది పంచ బ్రహ్మ మంత్రయుతముగా లలాటము శిరస్సు శిఖానేత్రములు, కర్ణ ములు కంఠము, ఉరస్సు, పృష్ఠము, బాహువులు మణికట్టు ఊరు, జానుగుల్ఫ పాదములయందు ధరింపవలెను. శరీరములోని ప్రతి పర మాణువు శివమయమే కదా !

## 40. శివాభిషేకము-అనుభవసిద్ధ ద్రవ్యసంగ్రహము

1. అభిషేకచూర్ణమును ఈ క్రింది వానితో కలిపి అభి షేకము చేయవలెను.

1. ఆవుపాలు 2. ఆవు పెరుగు

| | |
|---|---|
| 3. ఆవునెయ్యి | 4. మంచితేనె |
| 5 చక్కెర | 6. చెఱకురసం |
| 7. అత్తరు | 8. పన్నీరు |
| 9. గంధతైలము | 10. పునుగు |
| 11. జువ్వాజి | 12. పచ్చకర్పూరం |
| 13. రుద్రాక్ష | 14. కుంకుమపువ్వు |

వలయు పాత్రలు

| | |
|---|---|
| నారికేళపాత్ర | బిల్వపాత్ర |
| బంగారు పాత్రతో నీరు | వెండిపాత్రతో నీరు |

అభిషేక ఉపయుక్త ద్రవ్యములు

| | |
|---|---|
| నవరత్నోదకము | బంగారు పువ్వు నీరు |
| మామిడి | నేరేడు |
| ఉశిరిక | ఖర్జూరము |
| ద్రాక్ష | కిస్మిస్ |
| కొబ్బరినీరు | దర్భ |
| విభూతి | గంధము |
| అక్షతలు | పువ్వు |
| పత్రి | పసుపు |

ఒక్కొక్క వస్తువును ఒక్కొక్క చిన్న గిన్నెలో ఏర్పాటు చేసుకోవాలి. గోముఖము గోశృంగముద్వారా అభిషేకము చేయవలెను. తరువాత జలముతో అభిషేకము చేయవలెను.

## 41. శివపూజకు ఉపయుక్తమగు విశేషాంశములు

**అభిషేక చూర్ణము** సేకరణ: శివశ్రీ S.P. కోట్లింగంగారు

| | | |
|---|---|---|
| ఏలకులు | దాల్చిన చెక్క | సంపెంగపూలు |
| లవంగాలు | జటామాంసి | దేవదారుచెక్క |
| జీజికాయ | తక్కాలములు | గుగ్గిలము |
| జాపత్రి | చెంగల్వికొష్టు | కుంకుమపువ్వు |
| వట్టివేరు | కడిమిగడ్డ | గోరోచనము |
| మంచిగంధము | నాగకేసరములు | పచ్చకర్పూరం |
| కస్తూరి | | |

పైద్రవ్యములనన్నింటిని సమభాగముగా గ్రహించి వస్త్రగాలిత చూర్ణముచేసి ఒక సీసాయందుగాని డబ్బాయందు పోసి మూత గట్టిగ పెట్టవలెను. ప్రతినిత్యము ఒకటి లేక రెండు చిటికెలు చూర్ణమును కలశోదకమునగాని లేక గోక్షీరమందుగాని కలిపి, శివునికి నిత్యము అభిషేకము చేసిన, అభిషేక ప్రియుడైన ఆ శంకరుడు ప్రీతిచెందును. తర్పణమువలన గణాధిపతి ప్రీతిచెందును.

## 2. అష్టగంధములు

| | |
|---|---|
| 1. గంధపుచెక్క | 2. మారెడుచెక్క |
| 3. దేవదారుచెక్క | 4. కచ్చూరాలు |
| 5. గబిలాలు | 6. పచ్చకర్పూరం |
| 7. కుంకుమపువ్వు | 8. రాతిపువ్వు |

## 3. దశాంగధూపము

కావలసిన ద్రవ్యములు

1. మహిసాక్షి గుగ్గిలం
2. సాంబ్రాణి
3. లోదాసు
4. కచ్చురాలు
5. పట్టదిమ్మె
6. కుసుపోరు
7. పచ్చాకు
8. తుంగగడ్డి
9. మంచిగంధం చెక్క
10. గుగ్గిలము

పైవన్నింటిని వస్త్రాగాలితముచేసి ఆ పొడి ధూపశవస్తువు లాగా వాడాలి.

## 42. ధూర్జటి- సమగ్ర శివాద్వైత సిద్ధుడు

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజములలో ఒకరు మానవ జీవిత సత్యాసత్యాలను కాచి వడబోసిన అనుభవశాలి శైవ పారమ్యమును నమ్మి, నమ్మిన సత్యానికే జీవితాన్ని అంకితం చేసిన స్వచ్ఛంద వేదాంత అనుష్ఠాతవైదిక శివాద్వైతి తాను చూచిన, నమ్మిన, అనుభవించిన జీవిత సత్యసారముల దర్పణము, శ్రీకాళ హస్తీశ్వర శతక మణిహారము.ఇది శతకములన్నింటిలోను రాజము సర్వస్వతంత్రుడు నిర్భయుడు. పరమేశ్వరుని మీదే అధిక విశ్వా సము గలవాడగుటవలన పోతన, త్యాగరాజులవలె తన శతకరత్న మును శ్రీకాళహస్తీశ్వరునికే ఇచ్చి ధన్యుడైనాడు. ఈ శతకములోని ప్రతిపద్యము అతులిత మాదురీ మహిమతో, తన భావములను

నిర్ద్వంద్వంగా సంపూర్ణ విశ్వాసంతో చాటిచెప్పిన మనిషి. స్వాభిమాన దురంధరుడు. జీవన్ముక్తుడైన ధూర్జటి. ఐహిక ఆముష్మిక భోగభాగ్యాలకు సుదూరంగా, ఆ పరమేశ్వరుని సాన్నిధ్యంలో ఆలపించిన ఏకాంత స్వగత ముత్యహారమే కాళహస్తీశ్వర శతకము. చక్కని, తియ్యని, పదజాలంతో జీవిత సత్య సంగ్రహమును పామరులకు, జ్ఞానులకు తేలికగా అర్థమయ్యేటట్లు మానవ హృదయాంతరంగాలలో చొప్పించిన ఘనత ఇతనిదే, అలౌకిక తత్వానుభూతిని, ఈ శతకమున వెదజల్లి సుగంధ పరిమళయుక్తముగా కూర్చిన ఘనత ధూర్జటిదే. శ్రీ ధూర్జటి ఈ శతక రచనద్వారా జీవన్ముక్తుడు, పరమ శివాద్వైత- నిగర్వి- సత్యసాధకుడైనాడు.

## 43. సంసారంలోనే మోక్షసాధనకు రాచబాట

చరాచర సృష్టియంతయు 3 విధములుగా విభజించవచ్చును.

| | | |
|---|---|---|
| 1. స్థూలశరీరము | 2. సూక్ష్మశరీరము | 3. కారణ శరీరము |
| ఐహికము | ఆధ్యాత్మికము | |
| అవిద్యా | విద్యా | |
| జీవుడు | శివుడు | |

ఈ స్థూల శరీరము - సూక్ష్మశరీరమున, సూక్ష్మశరీరము, కారణ శరీరమున; కారణ శరీరము తురీయమున లీనమగును-ఇదియే శివయోగ కీలకము. జీవుడు శివునియందు లీనమైనను, శివుడు పరుడై సృష్టి స్థితిలయ, తిరోధాన, అనుగ్రహములను పంచకృత్యములను సర్వదా నివర్తించుచుండును. అట్లే జీవుడు శివునియందులీనమై నను చరుడై సకల జీవనయాత్రను సాగించును. అప్పుడు జగమునగల

సమస్త పదార్థములు శివమయమేగాన, అవి తనదికాదు శివాధీనము-కాని తాను పరమశివుడుగాన తానుచేయు క్రియా కలాపమంతయు శివార్పితముచేయును. తానుచేయు మనన ధ్యానాది కర్మఫలము నంతయు శివార్పితముల గావించును. అందువల్ల శివైక్యము నొందును. పై విషయములవల్ల ఆముష్మిక విషయములను ఐహిక జీవితంలో శైవమతమందు సమన్వయ పరచబడినదో చూడుడు.

2. శైవమునందంతట ఐహిక ఆముష్మిక సమన్వయము పెంపొందుటకు హేతువు, శైవులు నిత్యము ఇష్టలింగధారణ మొనర్చుటయే ఇష్టలింగమూర్తి నిత్యసన్నిహితుడై యుండుటయే పరలోకమునకాదు మనయందే యున్నాడు కదా ! అనుభావము. అది ప్రాణముతో సమానము. ప్రాణములేని శరీరము లింగ రహిత శరీర ములు సమానములే- వ్యర్థజీవితములేకదా ! లింగము పరమశివ స్వరూపముగాన- దాని ధారణమువలన మాంసాస్థి గతమైనది; సద్గురు ప్రసాదిత మంత్ర దీక్షవల్ల మంత్రితమై పునీతమై పునర్జన్మ రాహిత్య మునకు కారణమగుచున్నది.

## లింగధారణ దీక్ష-శాంభవీ దీక్ష

మాతృగర్భమునుండి అవతరించిన తర్వాత సద్గురుని హస్త మస్తక సంయోగమువల్ల, లింగధారణ దీక్ష ఇచ్చుటవల్ల జీవుడు శివత్వమునొందును.

గురుహస్త సంజాతుడగును. అనగా స్థూలశరీరమునకు ఐహిక తల్లితండ్రులు, అనగా తల్లితండ్రులు జీవుల స్థూలశరీరమునకు కార ణముగను, గురువు సూక్ష్మ శరీరమునకు కారణమగును. అందువల్ల

శైవమున గురువునకు మించిన దైవములేదు. లింగధారణ పొందిన చిన్నవయస్కుడుకూడా పూజనీయుడే.

ఏకవార లింగార్చనమే సమస్త
సౌఖ్యంబులగూర్చి మోక్షంబు సంఘటింప
సతతము లింగధారియై చంద్రమౌళి
పూజచేసెడు నాతని బొగడవశమే ?

(శివతత్వ సుధానిధి)

ద్వాదశారాధ్యుల జీవితములే ఇందుకు నిదర్శనములు.

## పూజార్హ పత్ర పుష్పములు

| పత్రములు | పుష్పములు |
|---|---|
| 1. బిల్వము | 1. ద్రోణపుష్పి (తుమ్మి) |
| 2. తులసి | 2. మందారము |
| 3. గరికె | 3. నంద్యావర్తము |
| 4. ఉత్తరేణు | 4. శ్రియావర్తము |
| 5. సంపెంగ | 5. గన్నేరు |
| 6. నేరేడు | 6. తెల్లజిల్లేడు |
| 7. దవనము | 7. తామర |
| 8. తుమ్మి | 8. కలువ |
| 9. మరువము | 9. లోద్దుగ |
| 10. హ్రీబేరము | 10. నల్లఉమ్మెత్త |
| 11. వావిలి | 11. పాటలా |

12. సంపెంగ
13. మారేడు
14. కానుగ
15. కొంపగోగు
16. మఫీపల
17. అవిశ
18. ప్రియంగు
19. దేవదారు
20. జాజి
21. మల్లె
22. అగ్నిమంథ

N B కిటకి చంపలను పుష్పములు పని

23. పాతిలి
24. బహువల్లి
25. వికర్ణి
26. అసిత
27. కల్హార
28. కనకాంబరము



## విజ్ఞాపనము

పాలుం బువ్వయు బెట్టెదంకుడువరా, పాపన్న రాయన్నలే
లే లెమ్మన్న నరంటిపండ్లు కొనితే లేకున్న నేనొల్లనంటే
లాలింపరే తల్లిదండ్రులపుడట్లే తెచ్చి వాత్సల్య లక్ష్మీలీలా
వచనంబులంగుడుపరా శ్రీకాళహస్తీశ్వరా॥

ఓం పరమేశ్వరా ! పసిపిల్లల కోరికలను వాత్సల్య భావంతో, ఓర్పుతో తల్లితండ్రులెట్లు సమకూర్చి ఊరడిస్తారో, అట్లే నీ భక్తుల మైన మమ్ము జగత్ పితరులేమీరు, తప్పపలుక, వాత్సల్య భావనతో అతికష్టమైన మోక్షమార్గంలోకి మరల్చుమా !

మరియు

తను వెందాక ధరిత్రినుండుననునందాక
న్మహారోగ దీపనదు : భాదుల బొందకుండ
వనుకంపాదృష్టి వీక్షించి యా వెనుకన్ నీపద
పద్మముప్ దలచుచున్ విశ్వప్రపంచంబు బాసిన
చిత్తంబున నుండజేయగలవే శ్రీ కాళహస్తీశ్వరా :

దైన్యంలేని బ్రతుకు, కష్టంలేని మరణం, ఐహిక జీవితంలో భారతీయుల ధ్యేయం మరణ సమయంలో జీవునిదృష్టి దేనియందు లగ్నమౌతుందో, తదుపరి జన్మ దానికి అనుగుణంగానే ఏర్పడగల దని ఒక సిద్ధాంతం దీనికి జడ భరతుని కథ ఒకచక్కని తార్కాణం దైహిక, మానసిక ఆరోగ్యాలద్వారా మోక్షదాయకమైన భగవంతుని పదపంకజ ధ్యానం ప్రసాదింపమని ఆ పరమేశ్వరుని కోఱటం తప్ప మానవుడు కోరుకొనదగిన దేమున్నది ?

## శివునితో భక్తుని ఒడంబాటు

నిను సేవింపగ నాపదల్ పొదమనీ నిత్యోత్సవం బబ్బనీ
జనమాత్రుండననీ, సంసారమోహంబు పై
కొననీ, జ్ఞానము గల్గనీ, గ్రహగతుల్
గుందింపనీ, మేలువ
చ్చిన రానీ, యవి నాకు భూషణములో శ్రీకాళహస్తీశ్వరా

తా. ఓ శ్రీకాళహస్తీశ్వరా! నిన్ను సేవించునపుడు ఆపదలు వచ్చినా నిత్యానందమే కల్గినా, సామాన్యజనుడని నన్ను ప్రజలనినా, మహాత్ముడే అనినా, సంసార వ్యామోహమే పైబడినా, జ్ఞానము కల్గినా, సూర్యచంద్రాది గ్రహగతులే కష్టాలు కలిగించినా, నాకు మేలు జరిగినా, జరుగకపోయినా, ఇవన్నీ నాకు అలంకార ప్రాయాలే.

నీ నా సందొడంబాటు మాట వినుమా! నీచేత జీతంబునే
గానిం బట్టక సంతతంబు మదివేడ్కన్ గొల్తునంత
స్సపత్నానీకంబున కొప్పగింపకుము నన్నాపాటియే
చాలుదేజేనొల్లం గరినొల్ల నొల్ల
సిరులన్ శ్రీకాళహస్తీశ్వరా!

తా. శ్రీకాళహస్తీశ్వరా మన ఇద్దరి నడుమ ఒక ఒప్పందం కుదుర్చుకుందాము. అది యేమంటే - నేను నీనుండి ఒక కానీ అయినా జీతం పుచ్చుకోకుండ, ఎల్లవేళల - ఎంతో ఆదరంతో మదిలో

నిన్నారాధిస్తాను. నీవు మాత్రం నన్ను - కామము - క్రోధము లోభము, మోహము - మదము - మాత్సరము అను ఈ ఆఱు లోపలి శత్రువుల బారి పడకుండ కాపాడవలె. ఇంత మాత్రమే చాలు ఇదే నేను నీకు చేసే కొల్వునకు బదులు నీవునాకు చేయవలసిన మేలు అంతేగానీ - గుఱ్ఱములు, ఏనుగులు ఏ సిరిసంపదలూ నేను కోరటం లేదు.

(స్వర్ణముఖీ వ్యాఖ్య - కాళహస్తీశ్వర శతకము మాదగుల నాగఫణిశర్మ)

శివనామ సంకీర్తన ఫలము

పాట :- అంతా శివమయమన్నా జగమంతా శివమయమన్నా
అంతా శివమయమన్నా
జగతికి మూలము శివుడన్నా ॥అంతా॥

1 జనన మరణముల చక్రములోనా
గిరగిర తిరిగే జీవునకూ
ఉరగ భూషణుని చరణ స్మరణే
తరుణోపాయము వినుమన్నా ॥అంతా॥

2 భవబంధాలను తెంచగలేని
భవులకు శివుడే గతిరన్నా
శివుని తలంచి మనుమన్నా
శివకములే పలుకవిరన్నా ॥అంతా॥

# శ్రీ గంగా పార్వతీసమేత ఈమస్యగస్త్రేశ్వర షట్త్రింశత్ తత్త్వయుక్త సద్గురుస్తవము

షట్త్రింశత్ తత్త్వ యుత శివపూజయే మోక్షభోగ సాధకము. ఇదియే ఆరడుగుల బాట - చిత్తశాంతికి ఏకైక బాట.

"సర్వం శివమయం జగత్" అని శాస్త్రములు చెప్పుచున్నవి. ఈ సర్వసృష్టికి 25 తత్త్వములు (Basic elements) కారణములని సాంఖ్యులు చెప్పెదరు. శైవ మతమున ఆ 25 తత్త్వములేకాక మరియు 11 తత్త్వములు కూడ కారణములని చెప్పబడినది. సృష్టి కర్తయైన శివుడు, కర్మ మలజీవియైన మానవుడు కూడ ఈ 36 తత్త్వములనే కలిగి యున్నారు. కాని శివుని యందలి 36 తత్త్వములు అతి పవిత్రములు కాగా, జీవునియందలి 36 తత్త్వములు మలయుతములు. జీవుని యందలి 36 తత్త్వములను, మంత్ర యుతముగా శివుని 36 తత్త్వములతో లింగాంగ సంధానము చేసి షట్త్రింశత్, తత్త్వోపచారములతో ప్రతినిత్యము త్రికరణశుద్ధిగా, నిరహంకారముగా, సద్భావనతో ఏకాగ్రతతో పూజచేసిన, కార్మిక మాయిక ఆణవములనబడు త్రివిధ శరీరాంతర్గత మలములు నశించి, జీవుని ఆవరించియున్న రోధన, బైందవ మలద్వయ వివర్జితుడై ఇహ జన్మాంతమందే లింగైక్యము సాధింపగలడు. ఇదియే శివ పూజా సారాంశము. మోక్షసాధకము.

## షట్త్రింశత్ తత్త్వోపచార వివరణము :

| | |
|---|---|
| సాంఖ్యము సందలి 25 తత్త్వములు | |
| పంచమహా భూతములు | 5 |
| పంచ తన్మాత్రలు | 5 |
| పంచజ్ఞానేంద్రియములు | 5 |
| పంచ కర్మేంద్రియములు | 5 |
| మనసు, బుద్ధి, అహంకారములను అంత రింద్రియములు | 3 |
| మూలప్రకృతి, పురుషుడు | 2 |
| మొత్తము | 25 |

మూలప్రకృతి :

శైవమున అధికముగా చెప్పబడిన 11 తత్త్వములు 1 కాల 2 కలా 3 రాగ 4 మాయా 5 సదాశివ 6 మహేశ్వర 7 విద్యా 8 శుద్ధవిద్యా 9 శక్తి 10 శివ 11 నియతులు.

మొత్తము 25 + 11 = 36 తత్త్వములైనవి.

పై 36 తత్త్వములు ఈ క్రింది విధముగా వివరింపబడినవి

## షట్త్రింశత్ తత్త్వ తత్త్వోపచార పూజావిధాన తత్వల సూచీ పట్టిక :

శివపూజాంగములు -12

| సంఖ్య | తత్త్వము | తత్త్వోపచార సమర్పణము | ఫలము |
|---|---|---|---|
| 1. | పృథివి | విభూతి ధారణము | సర్వమలక్షయము, శరీర రక్షకవచము మోక్షభోగప్రదం |
| 2. | జలము | స్నాన, పాద్య, అభిషేకములు | ,, |
| 3. | అగ్ని | అంగారతాపము | శీతబాధా నివారకము |
| 4. | వాయువు | ధూప సంవీజనము | 1. మంగళప్రదము<br>2. శరీర సర్వదుర్గంధ నివారిణి<br>3. ఉత్తేజకరము<br>4. యోగవాహిని |
| 5. | ఆకాశము | ధూప ప్రసారణము | ,, |

| | | | |
|---|---|---|---|
| 6. | త్వక్ (జ్ఞానేంద్రియము) | వస్త్రము | శరీర ఆచ్ఛాదనం శరీర ఆరోగ్య రక్షకం మంగళదం |
| 7. | కాల | అక్షతలు | జీవి మల నిర్మాల్యకరం మోక్షప్రదం |
| 8. | సదాశివ | పుష్ప బిల్వార్పణ | మోక్షదం |
| 9. | శివ | నైవేద్యము | జీవభోగసాధనమైన త్రివిధ శరీర సహిత జీవాత్మను పదార్థంగా శివార్పణచే శరీర పంజరమునుండి జీవునికిముక్తి శివసాయుజ్య సాధనకు మలిమెట్టు. |
| 10. | ప్రకృతి | తాంబూలం | సర్వమలకారక త్రిగుణములను శివార్పణ చేయుట. |
| 11. | విద్యాశుద్ధ | వస్త్ర ప్రావరణం | శరీరమునుండి వెలువడిన జీవరూపం మంత్రాచ్ఛాదిం శుద్ధ వస్త్రావరణం. జీవ రూప శివాం నిశ్శరీరియై చిచ్ఛక్తియుత పరమశివునియందు లయమగుటకు సాధకం |
| 12. | పురుష | అంగనివేశము | హృదయ స్థలమున జీవజీవేశ అవినాభావ సంబంధము. |

## శివోపచారములు $(9+15)=24$

| సంఖ్య | తత్త్వము | తత్వోపచార సమర్పణము | ఫలము |
|---|---|---|---|
| 13. | మనస్సు | ఆసనము | మనోచాంచల్య నివారకం |
| 14. | బుద్ధి | ఆహ్వానము | సుబుద్ధిదము, బుద్ధిచాపల్యహరం |
| 15. | గంధం | అర్ఘ్యము | దశవిధ పుష్టికరం, హస్తశుద్ధికరం |
| 16. | రసం | ఆచమనము | బాహ్యాభ్యంతర స్రోతోశుద్ధికరం |
| 17. | విద్యా | యజ్ఞోపవీతము | సుజ్ఞాన ప్రాప్తికరం, మలశుద్ధికరం |
| 18. | ప్రమాణ | గంధము | ఆచారలింగ దర్శకం మరియు ఆచారలింగ నిలయం. |
| 19. | రూప | నీరాజన, జ్యోతి, దీప, కరదీపిక హారతులు | చిచ్ఛక్తియుత పరమ శివ సందర్శకము |
| 20. | రాగ | మాల్యధారణ | ప్రాణలింగ సందర్శకం |
| 21. | కలా | ఆభరణములు | శివాశివ ఐశ్వర్య సందర్శకము |

ఇష్టలింగముపై బిల్వపత్రమును బోర్లించి పెట్టవలెను. దానిపై పొదినిఘూటిని [illegible] అనంతరము లింగముపై ఏమియు నుంచరాదు.

| సంఖ్య | తత్త్వము | తత్వోపచార సమర్పణము | ఫలము |
|---|---|---|---|
| 22. | శక్తి | ఛత్రము | తాపత్రయహరం |
| 23. | స్పర్శ | చామరం | శివశివానుభూతికరం |
| 24. | నియతి | తాలవృంతము | శరీరమనో ఆందోళన శమనకరం |
| 25. | చక్షు | దర్పణము | జీవనిర్మాల్యగుణకరం, జీవేశ సత్వగుణ సందర్శకం |
| 26. | శ్రోత్ర | ఘంటానాదము | సర్వవిఘ్నకారక భూతోచ్చాటనకరం |
| 27. | శబ్దం | శంఖారవము | సర్వ శత్రుహరం, శిష్టరక్షకం |
| 28. | మాయ | గీతము | మాయామోహ నిర్మూలనకరం |
| 29. | జిహ్వా | వాద్యము | సంసార భీరుత్వహరం, శత్రు భయంకరం శిష్టపాలకం. |
| 30. | మహేశ్వర | నృత్యం | దుష్టశిక్షణ శిష్టపాలనకరం |

| సంఖ్య | తత్త్వము | తత్త్వోపచార సమర్పణము | ఫలము |
|---|---|---|---|
| 31. | పాద | ప్రదక్షిణం | సర్వపాపహరం. |
| 32. | పాణి | నమస్కారం | సర్వేశ్వర సందర్శకరం |
| 33. | వాక్ | స్తుతి | శివశివానుభూతిదం. |
| 34. | ఉపస్థ | యాచన | అనుగ్రహప్రదం |
| 35. | పాయు | విజ్ఞప్తి | మోక్షదం |
| 36. | అహంకారం | విసర్జన | పంచపాశమల వినాశకరం |

భక్తస్థలము :

"భక్త స్థవమిదం పుణ్యం జీవస్య మూర్ధత్వా హంకార
వినాశకం । సంధ్యా శమాది షట్కా జనకం
ప్రత్యక్ష ఫలదం శివం"

ఉపాసకుడు సుస్నాతుడై, తూర్పు లేక ఉత్తర ముఖముగా శుభ్రమైన స్థలమున పీటను వేసుకొని దానిపై చిత్రాసనమును గాని జింకచర్మమును గాని పఱచి సుఖాసీనుడు కావలెను.

గోఘృత దీపారాధనము :

"గోఘృత దీపారాధనమిదం త్రినేత్ర తర్పణం శివం ।
నాడీమండల పోషణ కరం నాడీమల నివారకం శివం"

''నతత్ర సూర్యోభాతి న చంద్ర తారకం నేమా విద్యుతో భాంతికుతో యమగ్నిః తమేవ భాంతమను భాతి సర్వం తస్య భాసాసర్వ మిదం విభాతి ॥"

అనుమంత్రోచ్చారణతో రెండుదీపముల వెలిగింపవలెను. భక్త స్థలాధిపతియైన గణాధిపతికి, భక్త స్థలస్థితులైన సద్యోజాతముఖ, క్రియాశక్తియుత ఆచారలింగమునకు, తదాశ్రిత భక్త మహేశ్వర రుద్ర గణమునకు పంచభూత తత్వ సంకేతమైన దీపారాధనకు "లం" అనెడి పంచోపచార పూజ చేయవలెను. తదనంతరము ప్రప్రథమమున కలశమందలి జలమును శివ సృష్టిస్వరూప సంకేతంగా అభిమంత్రించుచూ కలశపూజ చేయవలెను. అట్టి అభిమంత్రిత పరమ పవిత్ర కలిశోదకమును పూజాద్రవ్యములపైన తనపైన

చల్లుటద్వారా తానుపునీతుడై పూజాద్రవ్యముల పవిత్రములుగా దురిత క్షయకారకములుగా చేయవలెను.

గణపతి ధ్యానము :

సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజ కర్ణికః లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః । ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః వక్రతుండ శ్శూర్పకర్ణః హేరంబ స్స్కందపూర్వజః । షోడశైతాని నామాని యః పఠేత్ శృణుయాదపి । విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమేస్తథా । సంగ్రామే సర్వ కార్యేషు విఘ్నస్తస్యవజాయతే ॥

శివపార్వతులధ్యానం :

యశ్శివోనామ రూపాభ్యాం యాదేవీ సర్వమంగళా ।
తయోః సంస్మరణాత్ పుంసాం సర్వతో జయమంగళం॥

ఆవాచ్యాత్మ స్వరూపాయ శివభావ ప్రదాయినే ।
నమస్సద్గురు నాథాయ షట్స్థల బ్రహ్మమూర్తయే.

చిచ్ఛక్తియుత పరమశివ ధ్యానము :

మండలాంతర్గతం హిరణ్మయం
భ్రాజమాన వపుషం శుచిస్మితం
చండదీధితి మఖండవిగ్రహం
చింతయేత్ మునిసహస్ర సేవితం

శంకరస్య చరితాకథామృతం
చంద్రశేఖర గుణానుకీర్తనం
నీలకంఠ ! తవపాద సేవనం
సంభవంతు మమ జన్మ జన్మని ॥

స్వామినే । సర్వజగన్నాథ యావత్పూజావసాన గం ।
తావత్ త్వం ప్రీతిభావేన లింగేస్మిన్ సిన్నిధిం కురు ॥

మృత్యుంజయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే
అమృతేశాయ శర్వాయ మహాదేవాయతే నమః ॥

దేహో దేవాలయ ప్రోక్తః జీవో దేవస్సనాతనః ।
త్యజేత్ అజ్ఞాన నిర్మాల్యం సోహం భావేన పూజమేత్॥

శాంతం పద్మాసనస్థం శశిధర మకుటం
పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రం చ ఖడ్గం పరశు
మభయదం దక్షభాగేవ హంతం
నాగం పాశంచ ఘంటాం
ప్రళయ హుతవహంచాంకుశం
వామ భాగే నానా లంకారయుక్తం
స్ఫటిక మణి నిభం పార్వతీశం నమామి ॥

గంగా పార్వతీ సమేత అగస్తేశ్వరాభ్యాం నమః
ధ్యానం సమర్పయామి ॥

ఆచమనం :

"ఓం నమః శంభవేస్వాహా శంకరాయ స్వాహా శాంతాయ స్వాహా"అని ఆచమనము చేసి శివపంచవింశతి నామోద్చాటన చేసి "ఉత్తిష్టంతు భూతపిశాచాః ఏతే భూమి భారకాః ఏతేషాం అవిరోధేన బ్రహ్మ కర్మసమారభే । " అనిభూతోచ్చాటన చేయవలెను.

ప్రాణాయామం :

ఓం భూర్భువస్సువః ఓం తత్సవితు ర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ॥

సంకల్పము :

శివ శివ శంభో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయపరార్ధే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూ ద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే కృష్ణా గోదావర్యోః మధ్యప్రదేశే భక్త మాహేశ్వర గురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన చాంద్రమానేన............... సంవత్సరే............ అయనే........ఋతే........ మాసే........ పక్షే ............శుభతిధే........శుభనక్షత్ర........ శుభ వాసరే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శ్రీమాన్.........శ్రీయుత........గోత్రోద్భవస్య ........నామధేయస్య సహకుటుంబానాం షడూర్మ్యాది రహిత షట్థ్సల పరబ్రహ్మ నిర్వాణ సుఖసంపదా వాప్త్యర్థం శ్రీగురు చరణముద్దిశ్య షట్థ్సల షట్కాల శివపూజాం కరిష్యే ॥ తదంగత్వేన కలశపూజాం కరిష్యే ॥

కలశపూజ :

"ఈశానః కలశస్యాగ్రే పూర్వే తత్పురుషస్తథా ।
అఘోరే దక్షిణశ్చైవ సద్యోజాతస్తు పశ్చిమే ।
ఉత్తరే నామదేవశ్చ మద్యేతు పరమశ్శివః
అదోభాగే పరాశక్తిః విశ్వోద్భాసిత కారిణి
సద్రూపం కలశాకారం చిద్రూపం కలశద్యుతిః
తత్రస్థ జలము త్కృష్టం సర్వతీర్థోత్తమోత్తమంపరం
చిదానందరసం సాక్షాత్ శివరూపం మితిస్మృతం ॥"

కలశమందలి జలములో విభూతి గంధాక్షతలుంచి చేతితోమూసి

"ఆకలశేషు ధావతి । పవిత్రే పరిషిచ్యతే । ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే । ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః పశవాపః అమృతమాపః స్వరాడాపః విరాడాపః యజుగ్ంష్యాపః జ్యోతిగ్ం ష్యాపః సర్వ దేవతా ఆపః భూర్భువస్సువరాపవోం" అను మంత్రముతో కలశోద కమును పూజాద్రవ్యములపై, దేవునిపై తనపై దురితక్షయకార కముగా చల్లవలెను.

సూచన : శైవమున సంధ్యావందనము కైవల్యజ్ఞానాంగము గావున దీపారాధనానంతరము సంధ్యావందనము, బ్రహ్మయజ్ఞము పితృతర్పణముల నాచరించుట ఉచితమని భావించెద. వైదికులు సంధ్యను కర్మాంగముగా ఆచరించుచున్నారు.

మహేశ్వర స్థలము :

సద్గురు పాదసేవాధికమిదం ।
జీవస్య మూర్ఖత్వాహంకార నివారకం ।
కాయికమాయిక మలహరం చైవ
కైవల్య జ్ఞాన సిద్ధిదం చిరం ॥

ఆసనం :

విశ్వభేషజ మిదం హస్తం,
మాతృ (పితృ) గురు జీవాత్మ సంజ్ఞికం
భగవత్తరమిదం (వామ) పాణితలం
శివాయ పరమాత్మనే ॥
భస్మాసనమిదం, షడక్షరీ మంత్రబంధితం ।
హే గంగా పార్వతీశ ।
స్వీకురుష్వంమర్కటీ మనో ఆసనమిదం,
గౌరీ సహనివాసయ ।

శ్రీ గంగా పార్వతీ సమ్మేతాయ అగస్త్యేశ్వరాయనమః ఆసనం సమర్పయామి ।

ఆవాహనం :

హే గురులింగ । ఇష్టలింగరూపక । కైవల్యజ్ఞాన
ప్రదాయక । స్వీకురుష్వ ఆవాహనమిదం సుబుద్ధిదం
భోగభాగ్యప్రదం శివం ॥

పాద్యం :

సర్వ తీర్థసమం దివ్యం ప్రత్యక్షఫలదం శివాత్మకం
హే గంగా పార్వతీనాథ గృహాణ పాద్యమిదం
సుభక్త్యా తుభ్యమర్పితం ॥

శ్రీ గంగా పార్వతీ సమేతాయ అగస్త్యేశ్వరాయ నమః పాద్యం సమర్పయామి

అర్ఘ్యం :

అష్టగంధ సమాయుక్తం, అష్టపుష్ప విరాజితం ।
గృహాణ అర్ఘ్యమిదం సుభక్త్యా తుభ్యమర్పితం ।

హే గంగా పార్వతీ సమేతాయ అగస్త్యేశ్వరాయ్యంనమః అర్ఘ్యం సమర్పయామి ।

ఆచమనం :

నిర్మలం నిర్గుణం శంభో జలాధిష్ఠానరూపకా
స్వీకురుష్వ ఆచమనమిదం సుభక్త్యాతుభ్యమర్పితం

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయ నమః ఆచమనం సమర్పయామి ।

గురుస్తుతి :

యోగగురు సశ్శివ సాక్షాత్ సశ్శివః సగురుస్మృతః ।
ముక్తి భుక్తి ప్రదాతాచ తస్మై శ్రీగురనేనమః ॥

స్నానం :

హంసాదక సమం రమ్యం త్రిమలహరం శివం ।
హేసోమ సూర్యస్వరూపక ! గృహాణస్నానమిదం
సుభక్త్యా తుభ్యమర్పితం
హే గంగా పార్వతి సమేత అగస్త్యేశ్వరాయనమః
స్నానం సమర్పయామి.

పాద్యం :

పూర్వవత్

పాదతీర్థగ్రహణం :

సద్గురు పాదోదకమిదం జీవస్య మూర్ఖత్వాహంకార నివారకం । సకల పాపక్షయకరం, అకాల మృత్యుహరణం శివం పాదతీర్థమున సేవించి, ॥ఇష్టలింగ సద్గురు మూర్తికి "లం"ఇతి పంచోపచారముల నొసంగవలెను.

షడక్షరీ మంత్రజపం :

షడక్షరి మంత్ర (రాజ) జపమిదం (శ్రీఘ్ర) మోక్ష భోగ ఫల దాయకం ।(మోక్షరః శివసన్నిధౌజ ప్రతినిత్యం పఠతి) ప్రాప్నోతి సంధ్యా శమాది షట్క సంపదాం"

(ఇహ జన్మాంతే మోక్ష సిద్ధిదం పరం)

జపానంతర జపఫలమును పరమేశ్వరార్పణ చేయవలెను.

## ప్రసాది స్థలము

**లింగనిరీక్షణము** : తమేవ ధీరోవిజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రహ్మణః నానుధ్యాయేత్ బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హితత్ తమేవైకం విజ్ఞానథ అన్యాద్వాచో విముంచథ ॥

అను మంత్రమును పఠించుచు లింగనిరీక్షణము చేయవలెను.

## లింగాంగ సంధానఫలం

"నిత్యం దశావధాన విధాన ఆచరణం చిత్తైకాగ్రత సాధకం । బాహ్యాభ్యంతర పూజాంగం కైవల్యజ్ఞాన సిద్ధిదం పరం "శివలింగ తీర్థప్రసాద సేవనమిదం శీఘ్రఫలదం శివం నిత్యపూజా చరణాత్" శివసామీప్య సారూప్యదం పరం ॥

## భస్మానులేపనం :

పంచభూతాత్మకం లయజం త్రిమలహరం శివం ।
తాపత్రయహరం భస్మప్రియం తాం జగదీశ్వర ।

ఒక పుష్పమును పొడి విభూతిని అర్పింపవలెను

## కర్పూరంతో సామరాగ నీరాజనం :

సానురాగ నీరాజనమిదం, పార్వతీశ ప్రత్యక్షదంపరం
గృహాణ హే భక్త వత్సల సుభక్త్యా తుభ్యమర్పితం ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః కర్పూర నీరాజనం సమర్పయామి

నివేదనం :

గృహాణ నివేదన మిదం ఖర్జూర ద్రాక్షాది సమన్వితం।
షద్రసీ త్రిశరీర రూపీ సుభక్త్యా తుభ్యం మర్పితం ॥

ప్రాణలింగ స్థలము :

నిత్య షట్త్రింశత్వ పూజా చరణం,
సర్వాభీష్ట ఫలదాయకం
సంసార భీరుత్వహారుశ్చైవ చిత్తశాంతి, ప్రసాదదం,
శివం

దర్శన నీరాజనమ్ :

దర్శన నీరాజనమిదం శివసామీప్య సాధకంపరం
లింగాంగ సంధానకరీ పార్వతీశ ప్రత్యక్షదం చిరం

మజ్జన నీరాజనమ్ :

హే చరలింగాన గంగా పార్వతీశ
కురుమాం ముముక్షం
రుద్రగణాంగం నిత్యషట్థ్సలతవపూజయా, భక్తవత్సల

పాద్యమ్ :

పూర్వవత్

అర్ఘ్యమ్ : ,,
ఆచమనమ్ : ,,

రుద్రాభిషేకమ్ :

పంచామృతేన సంయుక్తం, ఫలోదకేన సమన్వితం
శుద్ధతోయేన కృతమిదం అభిషేకం సర్వాభీష్టసిద్ధిదం
సర్వశత్రు వశంకరం శివం
శ్రీగంగా పార్వతి సమేత అగస్త్యేశ్వరాయనమః
అభిషేకం సమర్పయామి

పాదతీర్థగ్రహణం :

భవాంబు నిధి విస్తార సేతవే మోక్ష
హేతవే । పాపప్రశమనార్థాయి పాదతీర్థాయతేనమః ॥

భస్మాసనం :

పూర్వవత్

అంగారతాపనము :

అంగారతాపన మిదం శీతబాధా నివారకం
హే సర్వేశ గృహాణ సుభక్త్యా తు భ్యమర్పితం,

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః అంగార తాపనం సమర్పయామి

ధూపం :

పూర్వవత్

వస్త్రము :

విశ్వవ్యాపిన మీశానం చరలింగ స్వరూపక
గృహాణ వస్త్రద్వయ మిదం తంతునాభ ఇవవ్యాపక ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః వస్త్రద్వయం సమర్పయామి.

భస్మాను లేపనం :

పూర్వవత్

యజ్ఞోపవీతం :

యోగదం జ్ఞానదం శుద్ధం శుద్ధ విద్యాస్వరూపకం ।
సందారీయ యజ్ఞోపవీతమిదం లింగరూపకం ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాద్యాంనమః యజ్ఞోపవీతం సమర్పయామి

గంధము :

దశపుష్టి స్వరూపంచ త్రిశక్తిదం శివం గృహాణ ।
గంధాక్షితమిదం దివ్యం రమ్యంసుమనోహరం ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః శ్రీ గంధం సమర్పయామి ।

మహానీరాజనమ్ :

సర్వజ్ఞా సర్వలోకేశ త్రైలోక్యనతిమిరాపహ ।
గృహాణ నీరాజనమిదం పంచకృత్య పరాయణ"

శ్రీ గంగా పార్వతీ అగస్త్యేశ్వరాయనమః మహానీరాజనం సమర్పయామి ।

అక్షతలు :

పంచభూత స్వరూపాయ జగదాధారరూపక
గృహాణ అక్షతమిదం శుద్ధతత్వ స్వరూపక

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః అక్షతాన్ సమర్పయామి ।

మాల్యధారణ :

మంత్రగంధ సమాయుక్తం నానా పుష్పవిరాజితం ।
హే జగదాధార రూపాయ గృహాణ
మాల్యమిదం శివరూపకం ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయ నమః పుష్పమాల్యం సమర్పయామి ।

ఆభరణములు :

హిరణ్మయాయ రమ్యాయ అభీష్ట ఫలదాయక ।
సంధారయ ఆభరణాని సువర్ణాని మానసోల్లాసినం శుభం॥

శ్రీ పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః ఆభరణాని సమర్పయామి ॥

పుష్పం :

నానావర్ణాని రమ్యాని మంత్రజపేన పవిత్రతాని ।
గృహాణ పుష్పార్చనమిదం కలాతత్వ స్వరూపక ॥

శ్రీ గంగా పార్వతీ సమేతు అగస్తేశ్వరాద్యాంనమః పుష్పేణి పూజయామి ॥

బిల్వము :

శ్రీవృక్ష జనితం పత్రం శ్రీఘ్రం మోక్షదం భవనాశనం।
త్రిసుపర్ణం గృహాణేశ సుభక్త్యా తుభ్య మర్పితం ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్తేశ్వరాయనమః బిల్వం సమర్పయామి

ధూపం :

పూర్వవత్

దీపం :

గృహాణదీపమిదం త్రైలోక్యతిమిరాపహం ।
ఆయుస్తేజో వృద్ధికరం మాయామోహ వినాశకం ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్తేశ్వరాయనమః దీపమ్ సమర్పయామి ।

ఛత్రం :

శుద్ధ సత్వగుణోపేతం చంద్రకాంతి రివావృతం ।
గృహాణ ఛత్రమిదం విశ్వేశ ఉష్ణతాపోపశమనం మృదు॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః ఛత్రమ్ సమర్పయామి ॥

చామరం :

భోగరూపం చ రమ్యం చ సుఖ స్పర్శద మీశ్వర ।
గృహాణ చామరమిదం దైవీయం తుభ్యమర్పితం ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయ నమః చామరం వీజయామి ॥

తాళవృంతం :

దివ్యజంబూనద ప్రాయం ఉష్ణస్వేదనివారకం ।
గృహాణ తాళవృంతమిదం
రమ్యం మానసోల్లాసినీమ్మృదు ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః తాళవృంతం వీజయామి ।

దర్పణం :

షట్త్రింశత్‌తత్వ సంయుక్తం జీవ జీవేశ బింబకం ।

జీవమల నిర్హరణ గుణకం
దర్పణం అవలోకయ (నిత్యం) ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః దర్పణం సమర్పయామి

ఘంటానాదం :

గృహాణ ఘంటానాదమిదం, శివరూపకం
వేదాదివర్ణ సంయుక్తం నాదరూపం నిరామయం ।

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః ఘంటానాదం సమర్పయామి

శంఖారవం :

శృణు శంఖారవమ్ దివ్యం సర్వేశత్రుభయంకరం ।
జయదం మంగళదం చైవ శివసాయుజ్యసాధకం ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయ నమః శంఖారావం సమర్పయామి

గీతం :

చతుష్షష్టి కళోపేతం మధురంచ మనోహరం ।
గీతం శృణు సర్వేశ మాయామోహ విసర్జక ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాభ్యాం నమః గీతం సమర్పయామి

వాద్యం :

వాద్యం భయహరం రమ్యం సర్వశత్రుభయంకరం ।
శృణు డమరుకం దివ్యం శిష్టపాలన రక్షక ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్తేశ్వరాయనమః వాద్యం సమర్పయామి

నృత్యం :

విష్ణ్వాదిరుద్ర గణేన సేవితం కైలాసినం భక్త
ఆర్తాశ్రితపరాయణం అవలోకంచ నృత్యం ప్రదర్శితం
మయా । హేనటరాజశేఖరా సృష్టిస్థితి లయకారక !

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్తేశ్వరాయనమః నృత్యం సమర్పయామి

ప్రదక్షిణం :

ప్రమధ రుద్ర ముముక్షు భక్తగణేన సేవితం ।
అగస్త్యాది యమధర్మ రాజార్చితం నిత్యం
స్వీకురుష్వ ప్రదక్షిణాని కృతం మయా
పాపౌఘ నాశక రక్ష రక్ష గంగా పార్వతీప్రియవల్లభ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్తేశ్వరాయనమః ప్రదక్షిణ నమస్కారం సమర్పయామి

నమస్కారం :

అగస్త్యేశ్వర నమస్తుభ్యం గంగా పార్వతీ ప్రాణవల్లభ
సూర్య విఘ్న రాజ సమేతాయ విశ్వనాధాయతేనమః

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయ నమః నమస్కార శతం సమర్పయామి ।

స్తుతి :

హర శంభో మహాదేవ విరూపాక్ష త్రిలోచన ।
దీనబంధో దయాసింధో రక్ష రక్ష మహేశ్వర ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః స్తుతింకరోమి

దీపహారతి :

భావాలంకార యుక్తాయ బాహ్యాభోగాభి లాషిణే ।
సహమత్కారపీఠాయ ఇష్టలింగాయ మంగళం ॥

దేహేంద్రియ మనఃప్రాణ సంగతాయాంగ భోగినే ।
అంతరాత్మ స్వరూపాయ ప్రాణలింగాయ మంగళమ్ ॥

ఆదిమద్యాంతశూన్యాయ అఖండానంద భోగినే ।
భానుకోటి ప్రకాశాయ భావలింగాయ మంగళమ్ ॥

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః దీపహారతి సమర్పయామి

యాచన :

నాధికం ముక్తి సంప్రాప్య్య మశోక మచలం సుఖం
తత్ప్రదం దేహిమే శీఘ్రం నజానామి ప్రార్థనముత్తమం
శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వర స్వామినే నమః
యాచ్నాంకరోమి

విజ్ఞాపన :

సంసార (సర్ప) దర్ప గష్టానాం
తాపత్రయేన దుఃఖితాం ।
భీరోహం ఆశ్రితాహం త్వమేవ శరణం మమ ॥
(నాస్తి శరణం అన్యథా) స్వీకురుష్వ
పూజాదికమిదం కృతం మయా
మనోవాక్కాయ కర్మణా ।
కురుమాం నిర్భయం నిర్మలం చైవ
నిర్వైరి నిస్సంశయం తదా ॥
శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరస్వామినేనమః
విజ్ఞాపనమ్ సమర్పయామి

జీవమల విసర్జన :

శివయోగ భక్తి జ్ఞానా చరణాత్ నిత్యం ।
జీవోహం త్రివిధ శరీర మల నిర్ముక్తోహం ।
(నిత్య శివపూజాం తే ఇహ జన్మాంతే)
నతోస్మి, ధన్యోస్మి, శివరూపోస్మి

శరణుస్థలం :

షట్స్థల నిత్య షట్త్రింశత్ తత్త్వోపచారపూజాచరణం
త్రిశరీర మలహరం శివసాయుజ్యసాధకం
హే ప్రసాదలింగ ! స్వీకురు నివేదనమిదం
త్రిశరీరూపీ, షడ్రసీ, పవిత్రితం ముక్తజీవేనసయుతం

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః నివేదనం సమర్పయామి

ఐక్యస్థలము :

భవబంధ విముక్త జీవోహం ।
త్రిశరీర త్రిమల త్రిగుణ నిర్ముక్తోహం ।
పరమానంద భరితాహం ఐక్యస్థలాశ్రితోహం ।
హే జీవేశ । పరమ శివ! కరుణార్ద్రి హృదయ !
జీవాత్మైక్య సంధానం
శీఘ్రం మమప్రసాదయ

ఆనంద నీరాజనం :

గృహాణ ఆనంద నీరాజనమిదం చిదానంద రూపీ ।
సఫలమిదం మమజన్మతవ త్రికరణ పూజనేన నిత్యం ॥
శివశివేతి నామోచ్చారణం కరోతియః
అనుపాసకోపివా శివోభవతి సంశయ

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వర స్వామినే నమః ఆనందనీరాజన సమర్పయామి.

మహానీరాజనం :

కర్పూర రూపీ జీవోహం, త్వం వహ్నిరూపీ శివోసి।
శివ వహ్నినా తప్తమిదం త్రిశరీరం నిత్యం।
భవబంద (శరీరపంజర) విముక్తోహం
లింగైక్యరూపీ శివోహం
గృహాణ నీరాజనం మిదం కర్పూరాఖ్యం సదాశివ ।

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వర స్వామినేనమః మహా నీరాజనం దర్శయామి ।

తాంబూలం :

త్రిగుణాని సత్వరజో తమోగుణాని జీవస్య మోక్షస్థితి బంధకరాణినిత్యం । నిశ్చిత ఫలసూచకమిదం గృహాణ, తాంబూలం పూగీఫల సమాయుక్తం నాగవల్లి దళైర్యుతం

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయనమః తాంబూలం సమర్పయామి.

తాంబూల నీరాజనం :

షట్స్థలనిత్య షట్త్రింశత్ తత్వపూజాచరణాత్ ।
త్రివిదకర్మక్షయోహం జీవోహం ।
కర్మక్షయా తాంబూలనీరాజన మిదం గృహాణ ।
ధన్యోస్మి నతోస్మి నిత్యం సదాశివోస్మి (ఇహజన్మాంతే)॥

శ్రీ గంగా పార్వతీ అగస్త్యేశ్వరస్వామి నేనమః తాంబూల నీరాజనం సమర్పయామి

శివపూజా నిర్మాల్య విసర్జనము :

మృత్యుంజయాయ రుద్రాయ నీలకంఠాయ శంభవే
అమృతేశాయ శర్వాయ మహాదేవాయ తే నమః
గౌరీవల్లభ ! కామారే ! కాలకూట విషాశనః
మాముద్ధర ! ఆపదాంభోధే త్రిపురఘ్నాంత కాంతక

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయ నమః నిర్మాల్య విసర్జనం ఉత్తరతః కరోమి

పార్వతీశ పార్వతీశ పార్వతీశ దయానిధే!
భవానీశ భవానీశ భవానేవ గతిర్మమ!
పాపోహం పాప కర్మాహం పాపాత్మా పాపసంభవః ।
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ ॥

అని శివపూజా నిర్మాల్యమును సశేషముగా తొలగించి కండ్లకు అద్దుకొని వాసన చూచి అభిషేక పళ్ళెరమున ఉంచవలెను.

వస్త్రప్రావరణము :

అవిద్యేన ముక్త్యోహం మూర్ఖత్వ
అహంకారాదినా వివర్జితాహ
స్వీకురుష్వ వస్త్రప్రావరణమిదం శుద్ధం మంత్రితంశివం

శ్రీ గంగా పార్వతీ సమేత అగస్త్యేశ్వరాయి నమః వస్త్రప్రావరణం సమర్పయామి

అంగనివేశం :

త్రిశరీరభోగీ షల్లింగ రూపీ జీవోహం ।
నిత్యం తవపూజనేన నిస్సంగీ నిర్గుణో నిర్మలోస్మి ।
సత్యో శివోస్మి హిరణ్మయోస్మి నిత్యం
పూజావసాన కాలే నిత్యం హే ఇష్టలింగమూర్తీ !
శివానందమూర్తి ! మహాలింగరూపీ ! మమహృదయ
కుహరే సుఖం, వస, గంగా పార్వతీసహనిత్యం॥
సమర్పితమిదం గంగా పార్వతీ అగస్తేశ్వరస్తవం ।
తవపాదాంబుజేనిత్యం మనోవాక్కాయకర్మణా ॥
హే గంగా పార్వతి ప్రాణవల్లభః అగస్తేశ్వర ।
కురుమాం షడూర్మ్యాది రహితం శీఘ్రం
(నిత్యం శివపూజాంతే ఇహజన్మాంతే) !
ప్రసాదయ ! శివసాయుజ్యపదం
తవాశ్రితానాం ఇహజన్మాంతే ॥ ముదిగొండ శివకిరణ్

సీ. మల్లికా కుసుమముల మనసు దోచగనేను
భ్రామరాంబను గానుకామదమన
కనుదోయి పెకిలించి కాన్కగా నీయగా
కన్నప్పకానయ్య కన్న తండ్రి
మూఢభక్తిని జూపి మురిపింప జేయశ్రీ
కాళహస్తులగాను కాలకంఠ
పసిపాప గాజేసి పవళింపజేయగా

చెజ్జను గానయ్య పిచ్చితండ్రి

ఆ. ఆత్మలింగమడుగ అర్ధభాగమడుగ
బంటురీతి నిల్ప నింటిబయట
పశువునైన నన్ను పాలింపుమంటిని
మాయతొల్గజేసి మనుపుమంటి

సీ. ఆద్యంతములు లేని అభవుడివనితెల్ప
హరివిరించులగాను ఆదిదేవ
సాహితీ సుధలెల్లొ చవిచూపిచొక్కింప
శారదాంబనుగాను సన్నుతాంగ
వేదాంత వీధుల విహరింపజేయగా
వేదవేదుడగాను వేదసార
రాగాల తేలించి రంజింపజేయగా
త్యాగరాజునుగాను యోగరాజ

ఆ. ఆత్మజ్ఞానమిచ్చి అరిషడ్వర్గమడచి
బంటురీతికొల్చు భాగ్యమిచ్చి
నీ పదాంబుజములనేచేరి కొలుచుచు
ధన్యతముడనగుచు తనరనిమ్ము.

భవానీ శాస్త్రి

# ఉపయుక్త గ్రంథ సూచిక


1. శివపూజా విధి : ముదిగొం నాగలింగశాస్త్రిగారు

2. లఘుశివపూజా విధి : ,, రామలింగశాస్త్రిగారు

3. శివపూజా విధానము : శైవమహాపీఠము విజయవాడ

4. ,, : చిల్డ్రిన్స్ బుక్ హౌస్. గుంటూరు.

5. శివపూజా విధి : దేవస్థానం ఎలకుర్రు

6. లఘుశివపూజా విధానము : కొంపల్లిజ్వారాయారాధ్యులు ఒంగోలు

7. శివపూజావిధి : ముదిగొండ చినకోటయ్యశాస్త్రి అయ్యావారు

8. శివపూజావిధి : ,,

9. శివభజన కీర్తనలు : తాడికొండ మల్లిఖార్జున అయ్యావారు,

10. ,, ముదిగొండ శంకరారాధ్యులు

11. పర్వత భజన కీర్తనలు : ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు వరంగల్

12. శైవసర్వస్వము : ముదిగొండ చినకోటయ్య అయ్యావారు

13. సిద్ధాంత కిరణములు : ,,

14. దీక్షాకౌముది : ,,

15. శైవ సిద్ధాంత సంగ్రహము : శైవమహాపీఠము,విజయవాడ

16. శివయోగము : ముదిగొండ కోటయ్య అయ్యావారు

17. శివాగమములు : ముల్లంపల్లి జ్వాలా వీరభద్ర శాస్త్రిగారు

18. ఆంజనేయ నిరూపణము : శైవమహాపీఠము విజయవాడ

19. శైవమత ప్రబోధిని సీరీస్ : తాటికొండ నాగమల్లయ్యగారు శైవమహాపీఠం విజయవాడ

20. లింగధారణ ఎందుకు : శైవమహాపీఠము, విజయవాడ

21. శివలీలామృతము : ముదిగొండ వీరభద్రరాధ్యులు సందిగామా

22. శివపంచాక్షరీ మహామంత్రార్థము : శైవమహాపీఠం, విజయవాడ

23. శివభక్త విజయము : ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు

24. శైవమత ప్రకాశిక : జనవరి 5 శైవప్రచారిణీప్రెస్ వరంగల్

25. శైవధర్మ ప్రబోదిని : శైవమహాపీఠం విజయవాడ.

26. పార్వతీ స్తవము : ముదికొండజ్వాలాపతిలింగశాస్త్రి గారు

27. సోమవార వ్రతోద్యాపనవిధి : ముదిగొండ వీరేశలింగశాస్త్రి గారు

28. అంత్యేష్టి

29. సమర్థ సద్గురు : పూర్వ్యప్రతి కళీగార్డెన్స్ గుంటూరు

30. కాలహస్తీశ్వర శతకము : సాధన గ్రంథమండలి తెనాలి

31. చంద్రభాగానదీతీరాలు : స్వామిసుందర చైతన్యానంద

32. శివభజన కీర్తనలు : శ్రీ॥ పండిత స్వామిగారు

33. సకలేశ్వర శతము : ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారు

34. యజ్ఞప్రసాదము : స్వామిచైతన్యానంద

35. శివమేధ : శైవమహా పీఠము విజయవాడ

36 శివపూజా మంత్రార్థము : నిర్మల శంకరశాస్త్రిగారు

37. శివభక్త మందారము : వెలిదెమార్కండేయ

38. సర్వవేదాంతసార సంగ్రహము : భగవత్పాదులు శంకరాచార్యులు

39, శివుని ఐశ్వర్యము : ఈశ్వర ప్రగడ సదాశివ శర్మగారు

40. భువనేశ్వరీదుర్గాతంత్రము : చల్లాగోపాలకృష్ణశాస్త్రి మచిలీపట్నం

41. దుర్గాసప్తశతీపారాయణ సర్వస్వము : మంత్ర మూర్తి సుబ్రమణ్య శాస్త్రి

42. మంగళహారతులు : ముదిగొండ పాపయ్య శాస్త్రిగారు

43. శివతత్వ సుధావిధి : ములుగుమృత్యుంజయరాధ్యులు

44. నాడిమండల చలన రహస్యము : ప్రొఫెసర్ అంజన్‌గారు నెల్లూరు

45. రాజయోగము : రామకృష్ణమఠము మద్రాస్

46. జన్మరాహిత్యం : యోగి రామచంద్రరావు

47. శంకరకృప : శంకరమఠం నల్లగుంట

48. లలితా సహస్రనామము : వావిళ్ళ వెంకటేశ్వర్లు&సన్స్ మద్రాస్

49. శైవ ఆరాధన విధి : ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ తెనాలి

50. వివేకచూడామణి : రామకృష్ణమఠము

51. ఆత్మలింగ శతకము :

52. కుండలిని శక్తి : జనప్రియ పబ్లికేషన్సు తెనాలి

53.

54. చరక సంహిత : వావిళ్ళవెంకటేశ్వరశాస్త్రి అండ్ సన్సు మద్రాస్

55. సుశ్రుతసంహిత ,,

56. వాగ్భటము

57. మహాన్యాసము : చల్లాలక్ష్మి నరసింహశాస్త్రి అండ్ సన్స్

58. ,, : పాలావరుల రామశర్మగారు హైద్రాబాదు
59. నాడీవిజ్ఞానము : పూర్వప్రతి
60. నాడీవిజ్ఞానము : వావిళ్ళ వెంకటేశ్వర్లు అండ్ సన్స్
61. అగస్త్యప్రోక్త వైద్యశాస్త్రము :
62. సౌందర్యలహరి : శ్రీదేవి వేదవిద్యాలయము
63. శివానందలహరి : ,,
64. కాశీసారము : శైవప్రచారిణి ప్రెస్ వరంగల్
65. ఆంధ్రరుద్ర భాష్యము : చదలవాడ సుందరరామ శాస్త్రిగారు
66. లలిత పారాయణము రోగనిర్మూలనము : కాశీనాథుని సాంబ శివరావుగారు
67. శబ్దకర్ణామృతము : కలగ ఆంజనేయశాస్త్రి
68. మహాగాయత్రీ మంత్రార్థము : సూర్ణవరపు లక్ష్మీపతిశాస్త్రిగారు
69. మంత్రపుష్పము : వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి అండ్ సన్స్
70. శ్రీవల్లి భృగువల్లి : ,,
71. ఆనందవల్లి : ,,
72. అభిలాష్టకము : శివపురాణం

73. తటిస్థగ్రామ పంచరత్నములు : ముదిగొండ శంకరారాధ్యులు
74. భావలింగ శతకము ,,
75. ఆత్మప్రకాశినీ కంఠమాల :
76. సుబ్రహ్మణ్య సహస్రనామావళి : శ్రీరామా బుక్ డిపో
77. గణేశ పూజావిధానము : గణపతి దేవస్థానం సికిందాబాద్
78 నమకము చమకము : వావిళ్ళ వెంకటేశ్వర్లు అండ్ సన్స్ మద్రాస్
79. షట్కాల శివపూజా విధానము : ఇవలూరి సోమలింగారాధ్యులు
80. షట్స్థల గురు భోధాసారము : చాగంటి వీరమాంబ రాజమండ్రి
81. శివయోగసారము : ముదిగొండ వీరేశలింగశాస్త్రి (తెలుగుసేత పరిష్కర్త) వెలుగునేలు
82. నిత్యసోమవార వ్రతవిధానం : చల్లా లక్ష్మీనరసింహ శాస్త్రిగారు
83. మోహముద్గరము : శ్రీమత్ భగవత్పాదుల శంకరాచార్యులు
84. స్తోత్రకదంబము : సరస్వతీ బుక్‌డిపో సికిందాబాద్
85. సహజయోగము : శ్రీ నిర్మలాదేవిగారు
86. నమశ్శివాయ పాలు : ముదిగొండ పాపమ్మగారు (సేకరణ)

87. : స్వామి వివేకానంద

88. :

89. పర్వత భజనకీర్తనలు : వీరేశలింగశాస్త్రిగారు

90. శ్రీవీర భద్రపూజ : నిర్మల శంకరశాస్త్రి

91. గాయత్రీ దివ్యశక్తి : పురాణ పండరత్నా కృష్ణమూర్తిగారు

92. శ్రీదేవి మహాత్మ్యము : శ్రీగోపానందనాథులు

93 వైదిక శివపూజావిధానము : నిర్మల శంకరశాస్త్రి

94 సంక్షిప్త లింగపూజావిధి : దావుసాహెబ్ మల్లప్ప

95 విరూపాక్ష - మహాలక్ష్మీప్రాత స్మరణ : Cassete

96 శివతత్త్వసారసతి : నీలకంఠ శివాచార్యులు

97 శివభజన కీర్తనలు : పండితస్వామి గారు

98 యజుర్వేద సంధ్యావందనము : వాశిక్మ వెంకటేశ్వర్లు

99 ఋగ్వేద సంధ్యావందనము : నిర్మల శంకరశాస్త్రిగారు

100 కాళహస్తీశ్వర శతకము తాత్పర్యసహితం మహత్యము : మాదగులనాగఫణి శర్మగారు

101 శివ కవచము : శ్రీరామ బుక్ డిపో

102 చిన్మయదీక్ష : పూర్వప్రతి

103 శివపూజా : గొల్లపూడి వీరస్వామి

104 స్తోత్రమాలా : వైద్యనాథ పబ్లికేషన్

105 శివపూజా విధానము : ఉప్పలగౌరీ శంకరగుప్త

106 సంధ్యావందనము : ముదిగుండ వీరేశలింగశాస్త్రిగారు

107 పెద్దబాలశిక్ష : యన్.వి. గోపాల్ & కం.

108 శైవధర్మ ప్రదీపికా : మల్లంపల్లి జ్వాలావీరభద్రశాస్త్రిగారు

109 శైవ అపరము : చల్లా లక్ష్మీనరసింహప్రెస్

110 వేమన పద్యరత్నాకరము : బాల సరస్వతీ బుక్‌డిపో

111 బ్రహ్మవిద్యా

112 నీలకంఠభాష్యము





# అభిప్రాయ వేదిక

1) అశాంతి నెలకొన్న ప్రస్తుత వాతావరణంలో శాంతిని ప్రసాదించే దివ్యఔషధం భగవదర్చన. అర్చనవిధానం తెలియనిదో, భగవదర్చనకూ, భగవదనుగ్రహానికి దూరమౌతారు. ఆస్తికులైన భారతీయులకు భగవదర్చన అనేది స్వధర్మం. అట్టి శివారాధన విధానాన్ని సమకూర్చే ఉత్తమగ్రంథం ఈ శివపూజా వివేచనము.

**శ్రీ విద్యా నృసింహభారతిస్వామి**

జగద్గురు శంకరాచార్యులు, పుష్పగిరి, కడప జిల్లా.

2) విస్తృతి చెందిన అశాంతిని దుష్కర్మ ఫలములను నివారించే సాధనం సద్గురువు ముఖతః ప్రాప్తమైన నిత్యమంత్రానుష్ఠానము అది మోక్షసాధనంకూడా మిశ్రమ ధర్మావలంబనమును విడనాడి నిత్యజీవితంలో శాంతిని, సౌఖ్యాన్ని, కల్గించే సులభసాధనం ఈ 'శివ పూజా వివేచనము'.

**శ్రీ గోపానందనాథులు**

చండీ నవశతి ప్రచారకులు, తిరుపతి.

3) (స్థూల. సూక్ష్మ, కారణ) శరీర మనో ఆత్మల సంయోగమునకు ఆయువు అనిపేరు ఆరోగ్యాన్ని, ఆధ్మాత్మికతనూ కల్గిస్తూ ధర్మార్థకామములను ఐహిక సుఖములనూ తద్వారా నాల్గవది అయిన మోక్షమునూ పొందుచు (జీవన) వైద్య విధానం ఈ ఆయుర్వేదము ఒక్కటే! ఆయుర్వేదము మానవులకు ఆరోగ్య సంరక్షణము చేయునదే గాక ఆస్తికులుగా, ధర్మపరులుగా, సత్యవాదులుగా, పరిశుద్ధ జీవులుగా చేయునదికూడా ఇదే ఇతర వైద్యవిధానములకు ఆయుర్వేదమునకూ వున్నవ్యత్యాసము వ్యాధులు శివాపచారమువలన కల్గును. నిత్య శివారాధన సర్వవ్యాధులను పోగొట్టి మనశ్శాంతిని ఆరోగ్యము ఇచ్చు దివ్య ఔషధము. "ఆయుర్వేదో అమృతానాం!" శివపూజ, ఆయుర్వేద విధానాల ఆచరణ ఆవశ్యకతనూ వివరించేదే ఈ 'శివ పూజా వివేచనము'

**వైద్యశ్రీ ప్రకాశచంద్ర శతపథి**

విజయవాడ

**వెల రూ. 51-00**